# చతుర

జన్మదిన ప్రత్యేక సంచిక

ఫిబ్రవరి 2007

వెల 7/-

## 30 వసంతాలు

ప్రథమ బహుమతి పొందిన

సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి నవల

## చినుకుల సవ్వడి

# గెలుపుకి చెప్పిన అర్థం-భవితకు ఇచ్చిన అభయం

# విజయవాణి

## గ్రూప్ ఆఫ్ స్కూల్స్

## డే & రెసిడెన్షియల్ స్కూల్స్ - నంద్యాల, కర్నూలు జిల్లా



వచ్చే విద్యా సంవత్సరమునకు
నూతన అడ్మిషన్లకు గాను
ఫిబ్రవరి నుండే రిజిస్ట్రేషన్స్
ప్రారంభమగును.
వివరాలకు మా ఆఫీసు
నందు సంప్రదించగలరు.



## విజయవాణి

రెసిడెన్షియల్ స్కూల్
(E.M.)
మహానంది రోడ్
నంద్యాల, కర్నూలు జిల్లా
ఫోన్: 08514 - 329955

రాష్ట్రంలోనే కార్పొరేట్ పాఠశాలలకు ధీటుగా అత్యంత ప్రతిష్ఠాత్మకంగా విద్యార్థులకు అవసరమైన అన్ని అధునాతన సౌకర్యాలతో విద్యార్థులపాలిట కల్పవృక్షంగా బాసిల్లుతున్న విజయవాణి గ్రూప్ ఆఫ్ స్కూల్స్‌లో ఒక భాగమైన మహానంది రోడ్‌లోని విజయవాణి రెసిడెన్షియల్ స్కూల్‌ను ఒక్కసారి వీక్షించండి. మీ పిల్లల భవిష్యత్తు పాలిట ఒక చక్కని నిర్ణయం తీసుకోండి.

చైర్మన్: కాశ్నూరి సిద్దయ్య, B.A., (B.Sc. Ag.)

**Visit us at : www.vijayavanidarsan.com**
**an ISO 9001 - 2000 quality management standard**

| విజయవాణి పబ్లిక్ స్కూల్ | విజయవాణి E.M. స్కూల్ |
|---|---|
| నర్సరీ నుండి 10వ తరగతి వరకు, బాలాజీ కాంప్లెక్స్, నంద్యాల, కర్నూలు జిల్లా. ఫోన్స్: 08514-221760, 246152, 249162 | నర్సరీ నుండి 10వ తరగతి వరకు, ఆర్.ఎస్. రోడ్, నంద్యాల, కర్నూలు జిల్లా. ఫోన్స్: 08514-242127, 222624 |

సంపుటి : 30 | సంచిక : 1
ఫిబ్రవరి : 2007 | 349వ సంచిక

# చతుర
*30* వసంతాలు

ఈ నెల నవల

చినుకు తడితో పులకించిన
కరవు సీమలో పరిమళించిన
జీవన మాధుర్యం

# చినుకుల సవ్వడి

సన్నపురెడ్డి
వెంకటరామిరెడ్డి

10వ పేజీలో

బొమ్మలు: వాసు

---

◆ డిసెంబరు చతుర నవల **ముద్ర** పై
పాఠకుల సమీక్షలు 193

---

**చతుర సమీక్ష** | ఫిబ్రవరి '**చతుర**' నవల చినుకుల సవ్వడి

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు:

చిరునామా:

# అంధుల ఆపద్భందువు

# నల్లగొండ సూరదాస్ భవన్



శ్రీశ్రీశ్రీ చినజీయర్‌స్వామి గారి కరకమలములచే శంకుస్థాపన



శ్రీ అద్వాని గారిచే సన్మానింపబడుతున్న మహాదాత శ్రీ సమ్మిడి వీరారెడ్డి గారు



రాష్ట్ర హోంశాఖామాత్యులు శ్రీ జానారెడ్డి గారిచే సన్మానింపబడుచున్న సంస్థ ఉద్యోగిని



పాఠశాలలో సన్మానింపబడుచున్న శ్రీమతి కొండవీటి జ్యోతిర్మయి



సంస్థ ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో గానామృతమును పంచుతున్న గజల్ శ్రీనివాస్

సంస్థకు ఇచ్చే విరాళాలకు 100% టాక్స్ మినహాయింపు కలదు

**6 నుండి 16 సంవత్సరముల అంధ బాలబాలికలకు ఉచిత విద్య, భోజన, వసతి సౌకర్యాలు కలవు**

మీరు ఇచ్చే విరాళాలు - అంధులకు మార్గదర్శకాలు

## సూరదాస్ భవన్

డెవలప్‌మెంట్ & వెల్ఫేర్ అసోసియేషన్ ఆఫ్ ది బ్లైండ్

దీనదయాళ్‌నగర్, గొల్లగూడ, నల్లగొండ.

Ph: 227920, Cell: 98496 43534, Website: www. helpblind.org

చతుర

30 వసంతాలు

సాహిత్యంలో రెండు ప్రధాన స్రవంతులైన కథ, నవలలకు రెండు ప్రత్యేక వేదికలుగా ఊపిరి పోసుకున్న పత్రికలు విశ్వకథావేదిక 'విపుల', నవ్యానవలా కానుక 'చతుర'. తెలుగు పత్రికా రంగంలోనే వినూత్న ప్రయోగాలుగా 1978 ఫిబ్రవరిలో ఆవిర్భవించిన జంట పత్రికలివి. తమ వైశిష్ట్యాన్ని నెలనెలా చాటుకుంటూ సాహితీ సుమగంధాలను వెదజల్లుతూ అమితంగా పాఠకుల సమాదరణకు పాత్రమైన ఈ పత్రికలు ఒక ప్రభంజనాన్నే సృష్టించాయి.

కాలం నిత్యనూతన పోకడల జలధి, నిత్య గమనశీలి. దానికి అనుగుణంగా సరికొత్త మార్పుల్ని నిక్షిప్తం చేసుకుంటూ ఆసాంతం నవీనతను నింపుకుని వైవిధ్యాన్ని నిత్యవైభవం చేసుకుని పాఠక హృదయాలతో మరింతగా మమేకమవుతున్న విపుల, చతుర ఈ ఫిబ్రవరితో 30వ వసంతంలోకి అడుగిడుతున్నాయి.

అప్రతిహత సాహితీ సూర్యబింబాలై దీధితులు విరజిమ్ముతున్న విపుల, చతుర ఉత్తమ అనువాద, తెలుగు కథలు; నవలలు ఎంపిక చేసి పాఠకుల్ని చైతన్యవంతుల్ని చేయాల్సిన సాంఘిక కర్తవ్యాన్ని ఏనాడూ విస్మరించకుండా నిబద్ధతతో ముందుకు సాగుతున్నాయి. ఈ కర్తవ్యాన్ని దృష్టిలో ఉంచుకునే రచయితల్లోఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని నింపి వారిని కార్యోన్ముఖుల్ని చేసి పాఠకులకు మేలిమి రచనలను అందించే సంకల్పంతో కథలు, నవలల పోటీలు నిర్వహిస్తున్నాయి. గతంలో విపుల, చతుర 100, 200వ సంచికలు వెలువడిన సంధర్భంలో రెండుసార్లు ఈ పోటీలను నిర్వహించడం జరిగింది. ఇప్పుడు, 30వ ఏట అడుగిడుతున్న శుభ సందర్భాన మరోసారి సాహితీ జగత్తున నిండుశోభ నింపాలనే తపనతో మూడోసారి విపుల కథల పోటీ, చతుర నవలల పోటీ నిర్వహించాం. రెండు లక్షల రూపాయల మొత్తంతో భారీ బహుమతులను ప్రకటించాం.

ప్రకటించిన గడువునాటికి 150 నవలలు అందాయి. కలం చేతబట్టి అక్షర సృజనకు నడుం బిగించే వారి సంఖ్య నానాటికి తగ్గిపోతున్న నేటి పరిస్థితిలో ఈ సంఖ్యను ఎక్కువగానే భావిస్తున్నాం. పోటీలో పాల్గొన్న నవలా రచయితలలో పురుషులు 87 మంది, మహిళలు 60 మంది. పోటీకి వచ్చిన రచనలను క్షుణ్ణంగా పరిశీలించి ప్రాథమిక స్థాయి, సాంకేతిక అర్హతలు లేని కారణంగా పోటీకి అనర్హమైనవిగా భావించి తొలగించిన నవలలు-18. పరిశీలనకు స్వీకరించిన నవలలు- 132.

ప్రాథమికంగా పరిశీలనకు నిలిచిన 132 నవలలను మొదటి దశలో 17 మంది, రెండో దశలో ముగ్గురు చదివారు. వీరంతా ప్రముఖ రచయితలు, విమర్శకులే. ఈ రెండు దశలలో తుది పరిశీలనకు అనర్హమైనవాటిని తొల

చతుర 30 వసంతాలు

గించగా నిగ్గుదేలిన నవలలను ముగ్గురు న్యాయనిర్ణేతలు పరిశీలించారు. తుది పరిశీలనకు నిలిచిన ప్రతి ఒక్క నవలను వీరు సాకల్యంగా చదివి బహుమతి నవలలను ఎంపిక చేశారు. ఈ ఎంపిక న్యాయ నిర్ణేతల ఏకాభిప్రాయంతో జరిగింది. **కొలకలూరి ఇనాక్, డి.వెంకట్రామయ్య, కాత్యాయని విద్మహే** తుది న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

చతుర నిర్వహించిన ఈ బృహత్ సాహితీ యజ్ఞంలో పాల్గొన్న రచయితలందరికీ ధన్యవాదాలు. పోటీకి వచ్చిన నవలల్లో- టివి, సినిమాలను దృష్టిలో ఉంచుకునో, రొటీన్ ప్రేమగాథల్ని ఇతివృత్తాలుగా తీసుకునో రాసిన నవలలే అధికంగా ఉన్నాయి. విభిన్నమైన ఇతివృత్తాన్ని తీసుకుని శైలీ శిల్పాల మధ్య సమన్వయంతో జీవితంలోని వైరుధ్యాల్ని, వెలుగునీడల తత్వాన్ని అందిపుచ్చుకోగలిగి విశ్లేషించిన రచనల లేమి కొట్టొచ్చినట్లు కన్పించింది. ఇవి ఏ కొద్ది స్థాయిలోనో ఉన్న నవలలు కూడ సమగ్రత కొరవడడం వల్ల వడపోతకు గురై మెరుగైన నవలలు మాత్రమే న్యాయనిర్ణేతల పరిశీలనకు వెళ్లాయి. తాము పరిశీలించిన నవలలపై న్యాయనిర్ణేతల అభిప్రాయాలను ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

ప్రథమ బహుమతి పొందిన నవలను కూడా ఈ జన్మదిన సంచికలో ప్రచురిస్తున్నాము. బహుమతి పొందిన ఇతర నవలలను, సాధారణ ప్రచురణకు స్వీకరించిన నవలలను వీలు వెంబడి ప్రచురిస్తాము.

## నవలల పోటీ విజేతల వివరాలు

ప్రథమ బహుమతి : **చినుకుల సవ్వడి** – సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి
ద్వితీయ బహుమతి : **ఆకుపచ్చని గాయం** – డా॥ వి. చంద్రశేఖరరావు
తృతీయ బహుమతి : **జీవన శోధన** – శ్రీఉదయిని

కన్సొలేషన్ బహుమతులు:

1. **నేల నవ్వింది** – కె.ఎన్. బాలాజీ
2. **దేవుని రాజ్యం** – ఎలికట్టె శంకరరావు
3. **శీల పరీక్ష** – కాకాని చక్రపాణి
4. **అభిమానం** – చిలుకోటి కూర్మయ్య
5. **ఆకృతి** – అనురాధ

# షిర్డిసాయి సన్నిధిలో ఉచిత సామూహిక వివాహాలు





శ్రీ కాళేశ్వర్

మనిషి జీవితంలో సంతోష సంబరాలతో, ఆనందదాయకంగా జరుపుకునే మధురమైన ఘట్టం వివాహం. కమనీయమైన దాంపత్య జీవితానికి పెళ్ళి అనే వేడుక ఒక వేదిక.

వరుస కరువులతో విలవిలలాడుతున్న అనంతపురం జిల్లా ప్రజలు అనేక మంది పేదరికంతో దుర్భర జీవితాన్ని అనుభవిస్తున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో పెళ్ళీడుకొచ్చిన ఆడపిల్లలకు వివాహాలు చేసే ఆర్థిక స్థోమత లేక దిక్కుతోచని స్థితిలో ఉన్నారు. ఇటువంటి విపత్కర పరిస్థితులలో షిరిడి సాయినాథుని కరుణా కటాక్షములతో పేద ప్రజలను ఆదుకోవాలని పెనుకొండలోని షిరిడిసాయి గ్లోబల్ ట్రస్ట్ నిశ్చయించింది. శ్రీ కాళేశ్వర్ ఆధ్వర్యంలో 2007 మార్చి 1వ తేదీ నుండి 8వ తేదీలలో 1008 (ఒక వెయ్యి ఎనిమిది మందికి) ఉచిత సామూహిక వివాహాలు నిర్వహింపబడుచున్నాయి. ఈ సందర్భంగా వివాహాలు చేసుకొనే వారికి మంగళ సూత్రం, పట్టుబట్టలు, వసతి సౌకర్యాలు కల్పించబడును. వివాహాలు చేసుకోదలచిన వధూవరులు స్థానిక ఎమ్మార్వో దగ్గర వయస్సు ధృవీకరణ పత్రాలను తీసుకొని శ్రీ షిరిడిసాయి గ్లోబల్ ట్రస్ట్ - పెనుకొండ కార్యాలయం నందు మీ పేర్లు నమోదు చేయించుకొనగలరు.

నూతన వధూవరులకు షిరిడిసాయినాథుని శుభాశీస్సులు కలగాలని కోరుకుంటూ...

**షిరిడిసాయి గ్లోబల్ ట్రస్ట్ - పెనుకొండ - అనంతపురం జిల్లా**

© 0861-2316778

24 గంటలు హాట్‌లైన్

098400 69000



# చింతించకండి
# ధైర్యంతో వుందాం

- HIV/ఎయిడ్స్‌ను దృఢపరిచే ప్రపంచస్థాయి రెట్టింపు పరీక్ష
- 15 ఏళ్ళ అనుభవం.
- చెన్నైలో చికిత్సపొందినవారి సంఖ్య 10,000 పైబడి.
- కన్సెషన్ సిస్టమ్‌లో HIV/ఎయిడ్స్‌కు నవీన చికిత్స (ART)



Y.R.G.CARE

ఒక గంటలోపే పరిశోధనల నిర్ధారణ

## వై ఆర్ జి కేర్ ఎయిడ్స్ పరిశోధన మరియు విద్యాకేంద్రం

ఇండియన్ రెడ్ క్రాస్ సొసైటి వై ఆర్ జి కేర్ కమ్యూనిటి క్లినిక్

రెడ్ క్రాస్ బ్లడ్ బ్యాంక్‌కి దగ్గర, రెడ్‌క్రాస్ రోడ్, నెల్లూరు - 534 003.

వి హెచ్ ఎస్ వైద్య నిలయం కేంపస్, తరమణి,చెన్నై - 600 113. ఫోన్: 044: 2254 2929

# చినుకుల సవ్వడి

## సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి



మేనమామ
వేధింపులు
భరించరాని వేళ,
తన భవిష్యత్తు
అంధకార బంధురమవుతుందేమోనన్న
భయం ఆవహించిన వేళ ... ఆపద్బాంధవుడై ఆదుకున్నాడు,
ఏనాడో దూరమైన మేనబావ. పెళ్లి చేసుకుని కంటి పాపలా,
ప్రాణం కంటే మిన్నగా చూసుకున్నాడు. ఆమెను సుఖపెట్టడానికి ఎన్నో ఇబ్బందులూ,
అవహేళనలనూ ఎదుర్కొన్నాడు. ఆమె సైతం అతడినెంతగానో ప్రేమించింది.
అతని ఊరినీ, వృత్తినీ తనదిగా చేసుకుంది. కష్టసుఖాలను ఆనందంగా పంచు
కుంది. జీవితం సాఫీగా సాగిపోతున్న సమయంలో, ఆమె తల్లి వచ్చి వివాదాలు,
భయాలు చెలరేపింది. ఆ స్థితిని సైతం ప్రేమతో జయించగలిగిన ఆ భార్యాభర్తలు
ఊరి ప్రజలకు ఆదర్శప్రాయులయ్యారు. వర్షాలు, పండిన పంటలు,
కరువు కాటకాలు, వాన రాకడ కోసం ఎదురు చూపులు, చేల గట్టున
కాపలాలు, పొలం పనులు, పరస్పర పరిహాసాలు, కలో గంజో
కలిసి పంచుకుని ఆనందంగా ఆరగించడాలు, సరసాలు, సర
దాలు, చెరువు నీళ్లలో ఈదులాటలు ఇంకా ... ఆత్మీయ
తలు, అభిమానాలు ... అన్నీ కలగలిపి అలతి అలతి పదా
లతో అక్షరబద్ధం చేసి 'చతుర' నవలల పోటీలో ప్రథమ
బహుమతిని పొందిన సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి
నవల **'చినుకుల సవ్వడి'** ఈ నెల కానుక.



షాఢమాసపు చివరి రోజుల్లో ఒకానొక మిట్ట మధ్యాహ్నపు వేళ– తలవాకిట కొంగు పరచుకొని గడపను తలగడగా పడుకొని వుంది లక్షుమ్మ.

పాడిబఱ్ఱెల్లాంటి నల్లని మేఘాలు ఆకాశవీధినబడి
పొద్దు పొడుపుదిశగా మందంగా సాగుతున్నాయి.
ఎండపొడ కానరాకుండా నేలంతా నీడలు వ్యాపించాయి.
నేలతాపం తగ్గి చల్లదనం ముసురుకొంటూ వుంది.
మాపటేలకంతా మేఘాలు చేపుకొచ్చేట్టున్నాయి.
వానధారలు కుండలతో కుమ్మరించేట్టే వున్నాయి.

నాలుగవ ఏడాది గడుస్తూ వుంది– పదను వాన లేక, వంకలు వాగులకు పానం రాక, చెరువులు దొరువులు అలుగులెత్తి పొర్లక. ఉన్నట్టుండి రెండురోజులుగా ఈ మేఘాల అలజడి. బంగాళాఖాతంలో వచ్చిన పెనుతుపాను గురించి నాలుగు రోజులుగా టి.వి.లు మొత్తుకొంటూనే వున్నాయి. డొక్క చేతబట్టుకొని నగరాలకు వలస వెళ్లినవాళ్లు వాన మోడాల వాసన పసిగట్టి పక్షుల్లా తిరిగి గూళ్లకు చేరుకొంటున్నారు.

వాన రాకడ గురించి ఊహిస్తోంటే కలగా వుంది ఆమెకు.
రెండు రోజులుగా ఊర్లో జనం ఎంత సంబరంగా వున్నారనీ! అదను తప్పి వస్తున్నప్పటికీ దాని తీవ్రతను బట్టి ఏయే పైర్లు పెట్టాలో రచ్చబండల మీద కూచుని వ్యూహాలు పన్నుతున్నారు. ముసలాళ్లయితే మరీ చూపులు ఆనక నొసటికి చేయి అడ్డుంచి మోడాలకేసి అదేపనిగా చూసి చూసి వాన ఖాయమేనంటున్నారు.

ఆడమ్మగారయితే ఎండుపుల్లలు విరిచి పొయ్యి మూలన కుప్పేసుకొంటున్నారు.
మగాళ్లు మట్టిమిద్దెలెక్కి వరంకట్టలు సరిజేసుకొంటున్నారు.
మేఘాల కదలికలూ, వాటి సందుల్లో తీగమెరుపులూ...
వెనకే ఉరుముల రొదలూ జనాల్ని ఒకపట్టున నిలబడనీయటంలేదు.
కాసేపు కనుగూరుకుదామని నడుం వాల్చివుంది లక్షుమ్మ.



నిద్ర ఎంతకూ వచ్చి కళ్ల మీద వాలటం లేదు.

లేచి కూచుని కొట్టం పైకప్పుకేసి చూసింది.

రూపాయి బిళ్లంత ఆకాశపు తునకలు ఎనుగాడి పొడవునా తళతళలాడుతున్నాయి.

కుళ్లిన బోదను కోళ్లు కాళ్లతో గీరి రంధ్రాలు చేశాయి. వానవస్తే కొట్టమంతా కురుస్తుంది.

శివుణ్ణి ఇంటివద్దే వుంచింటే ఆకో అలుమో కప్పి కారకుండా చూసుండేవాడు. తనే బలవంతంగా కడపకు పంపింది.

రెండేళ్లయింది శివుడు ఇంటిపట్టున వుండక. తనతోటి వయసుగాళ్లతో కలిసి బేల్దారి పనులు వెదుక్కుంటూ టౌన్‌కెళ్లాడు. పదో పరకో సంపాదించి తెస్తున్నాడు. పెళ్లి ఖర్చులకు కూడేసుకొన్నాడు.

లేచి అడ్డగోడదాకా వెళ్లింది.

కాగుమీది కుండలో చేయిపెట్టి వెతికింది.

చినుకులు కారితే తడిసే వస్తువులేమైనా వున్నాయేమోనని జాగ్రత్తగా పరిశీలించింది.

తను ముందే సర్దిపెట్టుకొంది. మనస్సు ఉండబట్టక ఏదో భద్రతకోసం సరిచూస్తోంది.

శివునికి పెళ్లి చేద్దామని తాను చాలా ప్రయత్నించింది. ఊర్లోనే వున్న కూతురు అల్లుళ్ల చేత బలవంతపెట్టించింది. కళ్యాణ ఘడియ రావటమేమోగాని వానొచ్చేదాకా పెళ్లిమాట ఎత్తొద్దన్నాడు శివుడు. వాన రావాలిట... కరవుదీరే వాన... చెరువులు, దొరువులు, వాగులు, వంకలు ఏకమయ్యే వాన రావాలిట... అప్పుడే తను పెళ్లి చేసుకొంటాడుట.

మొన్నటిదాకా కొడుకు పెళ్లిమీదనే దిగులు.

చతుర 30 వసంతాలు

## సన్నపురెడ్డి జీవన సవ్వడి

బాల్యాన్నీ యవ్వనాన్నీ బాలరాజుపల్లెతోనే పెనవేసుకున్న సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి ప్రస్తుతం అక్కడే నివాసముంటు న్నారు. బియస్సీ బిఇడి చేసిన ఆయన కడప జిల్లాలోని ఆ పల్లెకు దగ్గరలోనే వున్న మూలపల్లెలో ఉపాధ్యాయుడిగా పని చేస్తున్నారు. సగిలేటి నదీ ప్రవాహంతో అనుబంధాన్ని పెనవేసుకుంటూ ఆయన చెన్నమ్మ, లక్ష్మిరెడ్డి లకు 1963లో జన్మించారు. ప్రస్తుతం 'చినుకుల సవ్వడి' వినిపిస్తున్న సన్నపురెడ్డి ఇప్ప టికి అయిదు నవలలు రాశారు. అంతేకాదు, నలభై కథలు, అరవై కవితలు కూడా రాసి నప్పటికీ ఏవీ సంకలనంగా వెలువడలేదు. ఈ ఏడాదే తొలి కథా సంపుటి వెలువరించే ప్రయత్నంలో ఉన్న ఆయన రచనలు ఎన్నెన్నో అవార్డులకు కొత్త వన్నెలను చేకూ ర్చాయి. 'ఒక్క వాన చాలు', 'చనుబాలు', 'అంటు'వంటి కథలతోపాటు 'కాడి', 'తోలు బొమ్మలాట', 'పాలెగత్తె' నవలలకు వివిధ పత్రికలు, సంస్థలు నిర్వహించిన పోటీల్లో అవార్డులు లభించాయి. '98లో ఉండేల విజ్ఞాన కళా పీఠం వారి పురస్కారం, 2004, 2006ల్లో రెండుసార్లు అధికార భాషా సంఘంవారి తెలుగు భాషా పురస్కారం అందుకున్నారు. 'చతు ర'లో తన నవలకు బహుమతి రావడం ఎప్పటికీ మరిచిపోలేని అనుభూతిని మిగిల్చిందని అంటారాయన.



వానకు, పెళ్ళికి ముడిపెట్టి కూచున్న అతని అమా యకత్వం మీద దిగులు.

వానకోసం ఎన్ని రోజులుగా ఎగజూస్తోం దనీ తను! ఊర్లో వాళ్లకు ఉత్సాహం రేపి వన భోజనాలకు వెళ్లేలా చేసింది. వాళ్లనూ వీళ్లను బంగపడి గుడిలో విరాటపర్వం చది వించింది, కప్పల పెళ్ళిళ్లు చేయించింది.

ఆకాశంలో మేఘాల కదలిక కన్పిస్తే చాలు తన కొడుకు పెళ్ళికి వేసిన పందిర్లు లాగే తోచేవి. మెరుపుల్ని విద్యుద్దీపాల వెలు గుల్లాగా, ఉరుముల్ని మంగళ వాయిద్యా ల్లాగా ఊహించుకొనేది.

పెద్ద వాన రాలేదు.

కొడుకు పెళ్ళి జరగలేదు.

అయితే- విధివశాత్తూ వారం రోజుల కిందట తెలిసిన ఒక వార్త శివుని పెళ్ళికీ వానకూ మధ్య బిగిసివున్న గొలుసును పుటుక్కున తెంచింది. వానతో సంబంధం లేకుండానే పెళ్ళికి సిద్ధం కావలసిన పరిస్థితి ఏర్పడింది అతనికి.

లక్షుమ్మ పుట్టినిల్లు కడప దగ్గర పల్లె.

ఆమెకు ఇద్దరు తమ్ముళ్లు. సన్నకారు మెట్ట రైతులు. భూముల్ని దున్నుతూ అప్పుల్ని పండించే కరవు రైతులు. తన తలమీద దోసెడు విత్తులు పడింది మొదలు రాకపో కలు కూడా సక్రమంగా జరపని నిస్సహా యులు. కన్నవాళ్లు చచ్చింతర్వాత కంటిచూ పుకు కూడా దూరమయ్యారు. మేనమామల బాంధవ్యపు తీపి ఎట్లాంటిదో తన పిల్లలకు తెలీదు. పెద్దతమ్ముడు ప్రమాదవశాత్తూ చనిపోయినప్పుడు కూడా తనకు కబురందేస రికి వారం రోజులు పట్టింది. తను వెళ్లేసరికి ఏడుపు వరద కూడా బాగా తగ్గి అక్కడ క్కడా ఆడాళ్ల కళ్లల్లో చిలపచిలపలుగా

కన్పించింది. తమ్ముని కూతురు అప్పటికి నాలుగేళ్ల పిల్ల. శివునికంటే రెండేళ్లు చిన్నది. లోకం తెలీని అమాయకురాలు. తల్లి వొడిలో కూచుని బేలగా చూస్తూండిపోయింది. తనా పిల్లను దగ్గరకు తీసుకొని సముదాయించినట్లు గుర్తు.

తర్వాత ఎప్పుడో తెలిసింది- పెద్ద తమ్ముని భార్యకు పొలం సరిగ్గా పంచివ్వకుండా తృణమో ఫణమో యిచ్చి సాగనంపారని, ఆమె కడప చేరుకొని దోసెల పెనం పెట్టుకొని బతుకుతోందనీ. ఇన్నేళ్లుగా ఆమె సమాచారం తెలిసిరాలేదు. తెలుసుకోవాలని తను ప్రయత్నించనూ లేదు. తన సంసారం ఈదేందుకే తనకు ఊపిరాడటంలేదు. మరొకరిని గురించి పట్టించుకునే తీరిక ఎక్కడుంది?



నాలుగేళ్లుగా చాలినంత నీరు దొరక్క భూమి బొగులుపోయి వుంది. ఎంత వాన వచ్చినా తనలో ఇముడ్చుకొనేందుకు పగుళ్లు వారిన శరీరంతో ఎదురు చూస్తోంది. మంచివాన కురిస్తే అడిగినంత పంటనిస్తుంది

ఉన్నట్టుండి వారం రోజుల కిందట కడప నించి ఒక్కడే ఊడిపడ్డాడు శివుడు.

మేనత్త కన్పించిందట.

కూతురు ఎదిగి పెద్దదై ఉందిట.

కడప శివారుల్లోనే చిల్లరంగడి పెట్టుకొని బతుకుతున్నారుట.

వాళ్లు కన్పిస్తే వీడు సావాసగాళ్లనూ, బేల్దారి పనిని వదిలి ఊరికి రావలసిన అవసరమేమిటో తనకు అర్థం కాలేదు.

మేనత్త సరోజమ్మకు తమ్ముడొకడున్నాడుట. తాగుడు, జూదం అన్ని అవలక్షణాలున్న వీధిరౌడీట. భార్యను చంపి కొంత కాలం జైలు కూడు కూడా తినొచ్చినాడుట. ఇప్పుడు అక్కను వేధిస్తున్నాడుట కూతుర్నిచ్చి పెళ్లి చేయమని. ఆమె ససేమిరా ఒప్పుకోకున్నా బలవంతపెడుతున్నాడుట. జులుం ప్రదర్శిస్తున్నాడుట.

కొడుకు మొహంలోకి సాలోచనగా చూసింది లక్షుమ్మ. వాడి ఉద్దేశం అర్థమవుతూనే వుంది. తనెవ్వరైందీ అత్తకు పరిచయం కాకుండానే తల్లి అనుమతి కోసం వచ్చాడు.

మనసు పాలలా పొంగింది తనకు.

ముందా పిల్లను అక్కడి నుంచి తప్పించి తీసుకురమ్మని పంపింది. ఆ పిల్ల ఇష్టపడితే కోడలిగా చేసుకోవచ్చు. లేదా మరో మంచి సంబంధం చూసి ఒకింటిదాన్ని చేసి పంపొచ్చు.

గడప దాటి వీధిలోకొచ్చి మరోసారి ఆకాశంకేసి చూసింది లక్షుమ్మ. పడమటి కొండలమీదుగా వాన కాళ్లు దిగినట్లున్నాయి. వాన ఖాయమే. అందులో సందేహం లేదు. పదను చేయొచ్చు. వంకలు వాగులు పొంగొచ్చు. చెరువులు దొరువులు నిండొచ్చు. మళ్లీ మంచికాలం రావొచ్చు.

నాలుగేళ్లుగా చాలినంత నీరు దొరక్క భూమి బొగులుపోయి వుంది. ఎంత వాన వచ్చినా తనలో ఇముడ్చుకొనేందుకు పగుళ్లు వారిన శరీరంతో ఎదురుచూస్తోంది. మంచి వాన కురిస్తే అడిగినంత పంటనిస్తుంది. రేపు సంవత్సరానికి కూడా బోరు బావుల్లో నీటి ఊట తరగకుండా చూస్తుంది. రెండేళ్లు కష్టపడి పండించుకొన్న పంటను, తర్వాత కరవొచ్చినా కనీసం ఏడాది పాటు దాచుకొని కష్టాల పాలబడకుండా బతకొచ్చు. అందుకే నీటి తేమ ఉన్నన్ని రోజులూ చెమట ఆరకుండా కష్టించాలి.

ఆలోచిస్తూ వెళ్లి వాకిట్లో కూచుంది లక్షుమ్మ.

ఆమె ముక్కుపుటాలు వానగాలిని ఆబగా పీలుస్తున్నాయి.

ఆమె వొంటిమీది చర్మగ్రంథులు గాలి లోని తేమను ఆర్తిగా రుచి జూస్తున్నాయి.

ఆకాశంలోని మేఘాలన్నింటినీ తనలో ఇముడ్చుకొనేందుకు సిద్ధమైన నల్లరేగడి నేలలా సెగలు పొగలు పోయే మనస్సుతో ఆమె ఎదురుచూస్తోంది.

వాననీటి కోసం... వరదనీటి సవ్వడి

**మన సంగతి తెలిస్తే మాత్రం మీ మామ ఊరుకోడు. జీపు తీసికొని ఎంటబడ్తాడు అంటూ మరోసారి వెనుదిరిగి రోడ్డుకేసి చూశాడు**



కోసం... తన కొడుకు కోసం... మేనకోడలి కోసం... ఆమె దప్పికగా చూస్తోంది.

* * *

ఉరుములు మెరుపుల ఆర్భాటంతో ఇప్పుడో యింకాసేపట్లోనో నేలమీద దూకే ట్టున్నాయి మేఘాలు.

గాలిహోరు అంతకంతకూ అధికమవు తోంది.

తమ అదుపు తప్పిన కొమ్మలు పూనకం వచ్చిన వాటిలా ఊగుతూ చిందులేస్తోంటే ఒళ్లంతా ఆందోళనతో పదరుతున్నాయి చెట్ల మొదళ్లు.

సన్నగా కురిసే వాన తుంపర్లను నేలమీద వాలకుండా ఎగరగొడుతున్నాయి తుపాను గాలులు.

ప్రకృతి బీభత్సానికి తోడు కన్ను పొడుచు కొన్నా కానరాని చీకట్లు. అప్పటికి రాత్రి ఎని మిది గంటలైంది.

తార్రోడ్డుమీద అడపాదడపా ఏదో ఒక వాహనం వికృతంగా రొద జేస్తూ వెళ్తోంది.

సాయంత్రం ఆరుగంటల్నించి గాలి ఉధృతి పెరిగింది. రానురాను ప్రచండమైన హోరుగాలిగా మారబోతోంది. అప్పుడే కడ ప వైపునించి దూసుకొచ్చిన ఎర్రబస్సు మట్టి బాట వద్ద ఆగింది.

బస్సులోంచి ఇద్దరు మనుషులు కిందకు దిగారు. ఇంకా పసుపు బట్టల్లోనే వున్న నవ వధూవరులు వాళ్లు. శివుడు... గౌరి...

బస్సు కదలి వెళ్లగానే సూట్ కేస్ ఓ చేతికి తీసికొని మరో చేత్తో ఆమె చేయందుకొ న్నాడు అతడు.

కడప రోడ్డుకేసి ఒకసారి సుదీర్ఘంగా చూపులు సారించి, మట్టిబాట మీద కదిలాడు.

మెల్లిమెల్లిగా అతని అడు గులు వేగం పుంజుకుంటు న్నాయి. ఆమె చేతిని పట్టి లాక్కుపోతోన్నట్లుగా వుంది అతని నడక. అప్పుడప్పుడు తను వచ్చిన రోడ్డుకేసి ఆందోళనగా దృష్టి సారిస్తున్నాడు. "ఊరు చేరుకొంటే సాలు. ఎవరేం పీక్కోలేరు..." గొణుక్కొంటున్న ట్లుగా అన్నాడు.

మెరుపుల వెలుగుల్లో అతనితోబాటు అడుగులేసేందుకు ప్రయత్నిస్తోంది ఆమె.

"మన సంగతి తెలిస్తే మాత్రం మీ మామ ఊరుకోడు. జీపు తీసికొని ఎంటబ డ్తాడు." మరోసారి వెనుదిరిగి చూశాడు రోడ్డుకేసి.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

హోరుగాలికి తోడు వాన కూడా లావు చినుకుల్లోకి దిగేట్టుంది. అలవాటైన దారి గా బట్టి వీలైనంత తొందరగా నడిచేందుకు ప్రయత్నిస్తున్నాడు శివుడు.

అతనిలో ఇంకా ఆదుర్దా తగ్గలేదు.

రోడ్డు మీద వెళ్లే వాహనం స్లో అయి తమ మట్టిబాట కేసి తిరుగుతుందేమోనని

భయం భయంగా వుంది.

అలా జరక్కూడదనే తమ ప్రయాణ విషయాన్ని అత్యంత గోప్యం చేశారు.

గుడిలో పెళ్లవగానే బస్సులో అడుగుపెట్టారు.

తాము లేచిపోతున్నామనే విషయం గౌరి తల్లి సరోజమ్మకూ, ఆ వీధిలోని అప్పుడు రంగస్వామికి తప్ప మూడో కంటివాడికి కూడా తెలీకుండా జాగ్రత్తపడ్డాడు.

లేచిపోవడమనే మాట మనస్సులో కదలగానే అతని పెదాలమీద సన్నని నవ్వు పూసింది.

అప్పుడప్పుడూ వింటూండేవాడు ఆ పదాన్ని.

ఇప్పుడది తన అనుభవానికి వచ్చింది.

"పెద్ద వానయ్యేట్టుంది. బెన్నే పోవాల..." అంటూ నడక వేగం పెంచాడు.

మెడిమలు తొక్కొంటూ వస్తోంది ఆమె కూడా.

కొంతదూరం వెళ్లింతర్వాత ఉన్నట్టుండి అతనికో అనుమానం వచ్చింది.

తన వెనక వచ్చేది టౌన్లో ఎలాంటి కష్టమూ తెలీకుండా సుఖంగా పెరిగిన అమ్మాయనీ, గుంటలు మిట్టలతో దారిమధ్యకు పెరిగివచ్చిన కంపకొమ్మలున్న ఇలాంటి మట్టిబాట వెంట సాధారణ నడకే కష్టంగా వుంటుందనీ, అలాంటిది తమ కాలి కొద్దీ నడవటమంటే ఆమె తనవెంట పరుగెత్తుకు రావటమేననీ అర్థమయ్యేసరికి ఒక్కసారిగా నడక వేగం తగ్గించాడు.

తన మొరటుదనానికి తన్ను తాను తిట్టుకొంటూ ఆమెకేసి పశ్చాత్తాప భావంతో చూశాడుగాని, కారుచీకట్లలో ఆమె ముఖకవళికలు కన్పించలేదు.

ఏదో సవ్వడి మాత్రం చెవుల సోకుతోంది. సన్నగా గస పెడుతోన్న సడి.

వాన చినుకుల కన్నా మేనమామ భయాన్ని ఎత్తిచూపి ఆమెనిట్లా పరుగులు తీయించి బాధపెడుతున్నాడు తను.

ఆయాసంతో గుండెలు ఎగిసిపడుతున్నాయి

కాబోలు తన మాటలకు ప్రతిస్పందించలేదు.

తన కదలికల్ని సాధారణ నడకలోకి మార్చుకొంటూ ఆలోచించసాగాడు. ఆమె మాట కలపలేదనుకోవటం కూడా పొరబాటే.

తమ మధ్య ఇంతదాకా ఒకటిరెండు మాటలకంటే ఎక్కువ దొర్లలేదు. ఆమెతో మాట్లాడేంత చనువు అబ్బలేదు ఇంకా- చూపుల పరిచయం తప్ప.

మనస్సులు విప్పుకొనేంత సాన్నిహిత్యం లేదు- మాంగల్యంతో ముడివడటం తప్ప.

తాము వాళ్ల వీధుల్లోనే మిద్దెకట్టుడు పనులకు వెళ్లేవారు.

ఆమె అంగట్లోనే తరచు వస్తువులు కొనేవారు.

అప్పుడప్పుడు రౌడీ వీరారెడ్డి వచ్చి గొడవ చేయటం తమ కళ్ల ముందే జరుగుతుండేది.

అతను వచ్చినపుడల్లా దిక్కులేని పక్షుల్లా అమ్మా కూతుళ్లిద్దరూ ఏడుస్తూ కూచోవటం, వాళ్ల కష్టాలు తీరాలంటే ఆ పిల్లను లేవదీసుకుపోయే మగాడు రావాలని ముసలి రంగస్వామి అంటూండటం తమ ఎరుకలోని సంగతే.

సరోజమ్మ తన మేనమామ పెళ్లామని తెలిసింతర్వాత తనలో కొత్త భావాలు కలిగాయి.

ఒక కూలివానికి ఆమె తన కూతురిని కట్టబెడుతుందనే అత్యాశ లేకున్నా లోలోపల సన్నని చిరు ఆశ ఉండేది. వానొస్తే తాముా రైతులమే గదా అని. ఆమెను పెళ్ళాడే తాహతు తమకూ ఉందని.

వీరారెడ్డి వత్తిడి ఎక్కువ కావటం, అదే సమయంలో తన కోరిక రంగస్వామి వద్ద

చెప్పి తమ బంధుత్వాన్ని కూడా ఎరుక పరచటం, సరోజమ్మ వొప్పుకోవటం... అంతా కలగా ఉంది.

చినుకుల పరిమాణం పెరిగింది.

అసంకల్పితంగానే అతని నడక వేగం కూడా హెచ్చింది.

నల్లని చీకట్లో మరింత నల్లని ముద్దలా పాత చింతచెట్లతో కూడిన ఊరి స్వరూపం దగ్గరబడింది.

చినుకు సోకినపుడంతా ఒంటిమీద చురుక్కుమంటోంది.

చినుకుల సందడి ఎక్కువై శరీరాల్ని పూర్తిగా తడిపేలోపల ఊరి పొలిమేర తొక్కారు.

కళ్లాలు దాటేసరికే చినుకులు వడుపందుకొన్నాయి.

కళ్లాల్లో అక్కడక్కడా చెట్లకొమ్మలు విరిగి పడ్డట్టున్నాయి. దారి మధ్యకు జారిన వాటి రెమ్మల స్పర్శ శరీరానికి వింతగా అన్పిస్తోంది.

ఊరి గమిల్లోనే కళ్లాల వైపున్న కొట్టం ముందు ఆగాడు శివుడు.

సూట్ కేస్ వాకిలి ముందుంచాడు.

తడివి చూస్తే- తలుపు చిలుకు బిగించి తాళమేసి ఉంది. కొట్టం కప్పు కూడా లేచిపోయి వుంటుందేమోనని అనుమానం. అక్కగారి యింటికి వెళ్లినట్లుంది అమ్మ.

ఇప్పుడామెను పిల్చుకురావటమంటే సుమారైన గందరగోళానికి దారితీసినట్లే.

ఎంతటి వానాగాలయినా- కొత్త కోడల్ని 'సాంగెం' చేయకుండా ఇంట్లోకి తీసుకురావటం అంత సులభం కాదు. ఆదరాబాదరా ఆ ఇంటికీ యీ ఇంటికీ తిరిగి కొందరు ముత్తయిదువల్నయినా పిల్చుకురావాలి. పసుపు సున్నం కలిపి ఎర్రనీళ్ళు తయారుచేయాలి. దిష్టి తీసి వాకిలికి ఆ పక్కా ఈ పక్కా పోసి తమను ఆహ్వానించాలి. అప్పటిదాకా తాము వానలో తడుస్తూనే ఉండాలి.

ఇప్పుడీ సంప్రదాయమంతా జరపాలనుకోవటం పెద్ద రసాభాసగా వుంటుంది. తడిసి నానినాని మొలకెత్తినా ఆశ్చర్యపోనవసరం లేదు.

చేయి చాచి చూరు కింద గోడమీద అక్కడక్కడా తడిమేసరికి అతని నమ్మకం ఫలించి తాళపు చెవి దొరికింది.

తలుపు తెరిచి లోపలికి అడుగుపెట్టాడు.

హోరుగాలికి ఎక్కడో విద్యుత్ స్తంభాలు విరిగిపడ్డట్టున్నాయి. ఊర్లో కరెంటు బుడ్డి వెలుతురు లేదు.

చేతుల్తో తడిమి దీపపు గూడు గుర్తించాడు.

అగ్గిపెట్టె అందుకొని పుల్ల గీచి అరచేతులు అడ్డుంచి ఆరిపోకుండా జాగ్రత్త పడుతూ కిరోసిన్ దీపం వెలిగించాడు.

కుడికాలు ముందు పెట్టి గడప దాటింది గౌరి.

గాలికి దీపం అల్లల్లాడుతోంది.

గాలి వెనక్కి తోస్తూవుంటే తలుపును బలంగా నెట్టి గడియపెట్టాడు.

గాలి హోరు ఉధృతమైంది.

చినుకుల సడి కూడా పెరిగింది.

చెట్ల కొమ్మల అగచాట్లు చెప్పనలవిగాకుండా ఉంది. ఇప్పుడో ఇంకొద్ది సేపట్లోనో విరిగిపడేట్టున్నాయి.

గాలి తాకిడికి కొట్టం గజగజ వణుకుతోంది.

అంటే- ఎనుగాడి మీది కప్పును ఎగరగొట్టినట్లుంది గాలి.

వాన ఎక్కువైతే కొట్టమంతా వెలుస్తుంది.

సూట్ కేస్ తీసికెళ్లి పాత చెక్కపెట్టె మీదుంచి తెరిచాడు.

"గుడ్డలు మార్చుకో గౌరీ!" చెప్పాడు.

ఆమె తటపటాయించింది.

తన బట్టల్ని అందుకొని అతను మార్చు

చతుర 30 వసంతాలు

కొన్న తర్వాత ఆమె కది లింది. అడ్డగోడ అవత లికి వెళ్లి మార్చుకొంది.

మంచమ్మీద కూచుని తినుబండారాల పొట్లాలు విప్పాడు శివుడు. పండ్ల పేకెట్లు తీశాడు.

"రా! కూచో గౌరీ!" పిల్చాడు.

ఆమెలో కదలిక లేదు.

లేచి, బొంత విదిల్చి మంచమ్మీద పరచి ఆమె వద్దకెళ్లాడు.

"ఇదే మన ఏడంతస్తుల మేడ. అదే మన పట్టెమంచం, పట్టు పరుపు... రా... కూచో..." నవ్వుతూ ఆమెను పిల్చాడు.

మెల్లిగా మంచందాకా నడిచింది ఆమె.

అతను కూచున్న తర్వాత తనూ కూచుంది.

మిక్చర్ పొట్లం విప్పి ఆమె ముందుకు జరిపాడు.

"తీసుకో... ఈ పూటకు ఇవే మన తిండి..." అంటూ పళ్లు కూడా తీశాడు.

"అందరిలా ఇంటికాడ పెండ్లి జేసుకొ నుంటే ఇప్పటికంతా మెరవణి బండిమీద ఊరేగుతుండేవాళ్లం... తప్పెట్లు, మేలాలూ, కట్టె తిప్పేవాళ్లూ... గుండెత్తేవాళ్లూ... బోకుశాలగా వుండేదనుకో..."

అతనికేసి ఓరగంట చూస్తోన్నదల్లా కిసుక్కున నవ్వింది ఆమె.

ప్రశ్నార్థకంగా చూశాడు.

అప్పుడే ఉరుములు... మెరుపులు... బైట్నించి హోరుగాలి, జోరువాన బీభత్సం... ఎనుగాడి మీంచి సన్నగా జారిన రెండు చినుకులు...

తన మాటల్లోని అసంబద్ధత ఏమిటో వెంటనే అర్థమైంది అతనికి.

"ఇంత పెద్ద వానగాలిలో మెరవణి చేస్తారని కాదు..." అంటూ సిగ్గుబడబోయి సర్దుకొని "అయినా మనమిప్పుడూ ఊరేగే గదా వొచ్చింది! ఉరుముల తప్పెట్లూ... మెరుపుల ఫోకసింగ్ లైట్లూ... చెట్లకొమ్మల డ్యాన్సులూ..."

మరోసారి కళ్లెత్తి అతనికేసి చూసింది.

అదే అవకాశంగా "యీ పండ్లు తీసుకో" అంటూ ద్రాక్షగుత్తి అందించాడు. మునివేళ్లతో సుతారంగా అందుకొంది ఆమె.



**అందరిలా ఇంటికాడ పెండ్లి జేసుకొనుంటే ఇప్పటికంతా మెరవణి బండిమీద ఊరేగుతుండేవాళ్లం... తప్పెట్లు, మేలాలూ, కట్టె తిప్పేవాళ్లూ... బోకుశాలగా వుండేదనుకో**

తను మిక్చర్ నములుతూ "పెండ్లి సరే, కొత్తరకం... తొలిరేయి సంసారం కూడా ఏందిది? దీపెం లేని యింట్లో... వాన కురిసే కప్పు కింద ... కుక్కిమంచం, పాత బొంత మీద... యిదేం కాపరం అనుకుంటా డావా?" అన్నాడు.

ద్రాక్ష పండు నోటబెట్టుకొంటూ కళ్లు పైకెత్తింది ఆమె.

"మా చిన్నాయన కొడుకొకడు నాలుగేండ్ల కిందట పెద్ద వానవొచ్చినేడు... 'నాకు పెండ్లో నాకు పెండ్లో...' అనే ఒకటే పోడు జేసిండులే. పెండ్లి జేస్తామా అంటే యీని కంటే పెద్దోడొకడుండాడు. పెద్దోన్ని పక్కన బెట్టి యీనికెట్లా జెయ్యాల? పెద్దోనికి పెండ్లి చెయ్యడానికి వాడు అవిటోడు. పిల్లనిచ్చేందుకు ఎవురూ ముందుకు రాలే... చిన్నాడేమో తొక్కులాడ్తాండాడు... ఎంత జెప్పినా యినుకోడే...! మా సిన్నాయనకు యాసిరిక వొచ్చి పెండ్లి, నాగేలి రొండూ ఒకేతూరి జేసిండు... దాంతో మా చిన్నోని

తిక్క కుదిరింది..."

పెండ్లి జెయ్యడమంటే సరే! నాగేలి ఏమిటి?

అయోమయంగా చూసింది.

ఆమె సందేహం అర్థమైంది.

"పెండ్లి జేసిండా...! అంతటితో వాన్ని వొదిలింటే సరి... రాకలు పోకలు వొగదెగ కుండానే... ఇరుగుడుపులు మరుగుడుపులు పూర్తిగాకుండానే వానికోసం కొత్త నాగేలి సేయించిండు. కొత్త గిత్తల తెచ్చిండు. కుండా చట్టీ కొత్తవే తీయించిండు. వాని సోలెడు గింజలు వానికి కొల్చి యిచ్చిండు. చారెడు నేల పంచిచ్చిండు. కుంటోడున్నె ఇంట్లో ఉండొద్దని వేరు బెట్టింద్రు... ఇంగ వాని సావు జూడూ... ఇంటికి మచ్చికగాని కొత్త పెండ్లామా... కాడిమాను కింద అర్రు గాని లేత గిత్తలూ... దుంప అరగని నాగేలీ... ఏం జెప్పాల్లే నా సామిరంగా...! వాని అగసాట్లు సూసి మాకు ఒకటే నవ్వు... పెండ్లి జేసు కొంటే పెండ్లాన్ని ఎంటే సుకొని ఆ ఊరికీ ఈ ఊరికీ తిరిగి సుట్టాలిండ్ల కాడ అల్లెం పేరుతో సియ్యా బువ్వా తినొచ్చుననీ, జల్సాగా తిరగొచ్చుననీ అనుకొన్నేడు పాపం! నాగేలి కూడా చేసేసరికి కుడితి నీ ల్లల్లో పన్నె ఎలక మాదిరి గిలగిలాడిండ నుకో... ఒక్కపూట యిండ్లిండ్సిపొయ్యేదానికి లేదు. ఒన గంట పెండ్లాన్నిడ్సి పొయ్యేదానికీ లేదు...." చెబుతూ, "వానొస్తాంది. మనగ్గూడా పెండ్లి, నాగేలి రొండూ అయ్యే ట్టుండాయి" మెల్లిగా గొణిగాడు ఓరగంట ఆమెను చూస్తూ.

నవ్వాగింది కాదు గౌరికి.

బుగ్గలు పూరించి పెదాలు బిగించినా ఆగలేదు.

ఎనుగాడి నుంచి వెలుస్తోన్న చినుకులు వాసాల మీంచి దిగజారి చిటుకు పొటుకు

మంటూ అప్పుడొకటి యిప్పుడొకటిగా రాలుతున్నవి కాస్తా వడుపందుకొన్నాయి.

ఒకటి రెండు నీటిబొట్లు మీద రాలటంతో విదుల్చుకొంటూ పైకెగజూసింది ఆమె.

ఖచ్చితంగా మొహం మీదకే జారింది చినుకుల ధార.

ఉలికిపాటుగా వెనక్కి సర్దుకొని పైటతో తుడుచుకొంది.

అక్కడా కారుతున్నాయి.

ఆమె అవస్థ గమనించాడు శివుడు.

మంచం దిగాడు.

కాళ్లకట్ట వైపు పట్టెను పట్టుకొని జరజర బారెడు దూరం లాగాడు.

వెనక్కి తూలబోయి సర్దుకొంటూ అతనికేసి అయోమయంగా చూసింది ఆమె.

మంచం దిగబోయింది గాని అతను వారించాడు.

"అప్పుడే ఏమైంది? యీ మూల నించి ఆ మూలకూ... ఆ మూల నుంచి ఇంకో మూలకు... మంచమ్మీద ఇండ్లంతా వూరేగిస్తేగాని చినుకులు పడని తావు దొరకదు...." చెబుతూ తనూ కూచున్నాడు.

కారేలు తింటూ ఆమెను కూడా తినమని చెప్పాడు.

ద్రాక్షపండ్లు చప్పరిస్తోంది ఆమె.

పండు తీసుకొన్నపుడంతా అతనికేసి చూపుల్ని సారిస్తోంది.

బైట గాలి, వాన పోటీ పడ్డట్టున్నాయి. ఒకదాన్నొకటి లొంగదీసుకోవడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి.

చూరునీళ్ళు దూకే సడి, చినుకుల సవ్వడి, గాలిహోరు, చెట్ల కొమ్మల విసుర్ల రొదా కలగలిసిన వింత శబ్దాలు చెవుల్ని గింగురుమనిపిస్తున్నాయి.

ఎనుగాడి నుంచి జారే చినుకుల పోటు అక్కడక్కడా ఎక్కువ కావడంతో మరోసారి మంచాన్ని ఇంకో మూలకు లాగాడు శివుడు.

అర్ధగంట వ్యవధిలో నాలుగు మూలలా తిప్పాడు.

అడ్డగోడ అవతల బువ్వ దినే అరలో మచ్చు కిందకి మంచం చేర్చాడు.

అర్ధగంటసేపు ఆపింది తడికల మచ్చు తర్వాతనే అసలు సమస్య మొదలైంది.

ఎన్నేళ్ల నుంచో పొగచూరి కర్రువ్వతో నిండిన మచ్చు నించి కారే నీళ్ళు కాఫీ డికాక్షన్ రంగులో మీదకు దూకుతుండటంతో అక్కడ కూడా ఉండలేకపోయారు.

మంచం మళ్లీ అడ్డగోడ ఇవతలికి చేర్చబడింది.

ఏం చేయాలో అర్థం కాలేదు.

మంచాన్ని ఓ మూలగా గోడ వారకు లాగాడు.

చినుకులు కారుతూనే ఉన్నాయి.

తప్పించుకొనే తావు దొరకలేదు.

ప్లాస్టిక్ పేపర్ లాంటిది ఇంట్లో ఉన్నా సరిపోయేది.

బైట ఎవరిండ్లకు వెళ్ళేందుకు వీల్లేని పరిస్థితి. వాన ఒక కారణమైతే, తమ ఉనికి అందరికీ తెలియటం ఇష్టం లేనిది మరో కారణం.

కొంతసేపుంటే నట్టిల్లు కూడా మడుగయ్యేట్టుంది.

సూట్‌కేసును ఎత్తి అడ్డగోడ మీదుంచాడు.

వెనుదిరగబోతూ మచ్చుకిందుగా చూసేసరికి అక్కడున్న 'పెచ్చేట' అతన్ని ఆకర్షించింది.

చదరపు గజం విస్తీర్ణంలో పెద్దదిగా కన్పించే చేట అది. విసుర్రాతి కింద వేసికొనేందుకు ఉద్దేశించిన పాతకాలపు చేట. నిన్నమొన్నటిదాకా పల్లెల్లో ప్రతి యింటా ఉండేది పెద్ద చేట... పెచ్చేట. ఇప్పుడు అవసరం లేనిదై మచ్చు కిందకి చేరింది.

ఉత్తరాంధ్రలో అగ్రగామి నర్సింగ్ హోమ్

# తిరుమల నర్సింగ్ హోమ్

ఆర్.టి.సి. కాంప్లెక్స్ దరి, విజయనగరం

ఫోన్స్: (08922) 223921, 225850, 227482, 233558



విజయనగరం తిరుమల నర్సింగ్‌హోమ్‌నందు అత్యాధునిక పరిజ్ఞానం గల లేపరోస్కోపిక్ శస్త్ర చికిత్సలు

డా॥ కె. తిరుమలప్రసాద్
M.S, FAIS
శస్త్ర చికిత్స నిపుణులు

డా॥ కె. క్రిష్ణశాంతి
MBBS, DGO
స్త్రీల వైద్యనిపుణురాలు

IMAGE - I
3-CHIP DIGITAL LAPAROSCOPIC SYSTEM

గత 13 సం॥ లుగా లేపరోస్కోపిక్ శస్త్రచికిత్సలలో విశేష అనుభవంగల ఉత్తరాంధ్ర ఏకైక నర్సింగ్ హోమ్

**అందరికీ అందుబాటులో లాప్రోస్కోపిక్ శస్త్రచికిత్సలు**

* గర్భసంచి తొలగించుట (హిస్టిరెక్టమి)
* కడుపులో కణుతులు (ఒవేరిన్ సిస్ట్, ఇక్టోపిక్, ఫైబ్రాయిడ్)
* అపెండిక్స్ * హెర్నియా (గిలక) వేరకోసిల్ (నరాల పొంగు)
* గాల్‌బ్లేడర్‌తో రాళ్లు తొలగించుట * మరియు కడుపులో సోకే ఇతర వ్యాధులకు




**సౌకర్యాలు :**

- అత్యవసర ఎమర్జెన్సీ విభాగం
- ఐ.సి.యు. కాట్స్
- వెంటిలేటర్లు
- మల్టీ పారామీటర్ మోనిటర్లు
- పల్స్ ఆక్సీ మీటర్లు
- సెంట్రల్ ఆక్సిజన్
- 12 లీడ్ ఇ.సి.జి
- కార్డియాక్ మోనిటర్లు
- డిఫిబ్రిలేటర్లు
- పేస్ మేకర్
- సిరంజి పంపులు, ఇన్‌ఫ్యూషన్ పంపులు (ఆర్టిరియల్ బ్లడ్ గాస్ ఎనాలిసిస్)
- 24 గం॥ లేబ్ ఫార్మసీ
- ఐ.సి.యు. శిక్షణ పొందిన నర్సింగ్ సిబ్బంది
- సూపర్ స్పెషాలిటీ సర్వీసెస్
- అనుభవజ్ఞులైన మరియు శిక్షణ పొందిన అనస్థెటిస్ట్ ఇన్‌టెన్సివిస్ట్



తిరుమల హాస్పిటల్ ఆవరణము, ఆర్.టి.సి. కాంప్లెక్స్ దగ్గర, విజయనగరం, ఫోన్ : 224433

దాన్ని చూడగానే అతనికో ఉపాయం తోచింది.

ఆ వెనకే మూడు చేటల కథ గుర్తొచ్చి నవ్వొచ్చింది.

మచ్చు కింద నుంచి పెచ్చేటను బైటకి లాగాడు.

తమ మంచం పైగా కప్పునించి కారే నీళ్లకు అడ్డుగా దాన్ని ఏటవాలుగా వేలాడగట్టాడు.

ఇప్పుడది సగం మంచానికి రక్షణనిస్తూ ఉంది. కారే చినుకులకు అడ్డుపడి కొట్టం చూరులా అవతలికి జార్చుతోంది.

చేట మంత్రం బాగా పారింది.

గోడకు వీపాన్చి కాళ్లు బారజాపి మంచంపట్టెకు తన్ని కూర్చున్నాడు.

చేటనీళ్ళు సరిగ్గా పాదాల మీదకు కారుతున్నాయి.

ఆమెను కూడా తనలాగే కూచునేలా చేశాడు.

కాళ్ళమీది పంచెను మోకాళ్ళ దాకా ఎగబెట్టాడు.

ఆ చేత్తోనే ఆమె చీరకుచ్చిళ్లను కూడా పైకి సర్దాడు.

తడబడుతూనే ఆ పన్జేశాడు.

గమ్మత్తయిన అనుభూతి.

పెచ్చేట మీంచి తమ ముంగాళ్ళ మీదకు చల్లగా జారే చినుకులు... ఆనుకొని కూచున్న శరీరంలోంచి సెగలు పొగలవుతోన్న స్పర్శానుభూతి.

ఆమెకు ఎడమ వైపు భుజం తడుస్తోందేమోనని అనుమానం.

సంకోచిస్తూనే ఆమె వీపు మీదుగా భుజం తడివి చూసి తనకేసి లాక్కున్నాడు.

అద్భుతమైన గగుర్పాటు.

మౌన భాషల తాదాత్మ్యతా నివేదన.

కొంతసేపు నిశ్చలంగా ఉండిపోయారు ఇద్దరూ.

బైట అంతకంతకూ ఉధృతమవుతూ



జలపాతపు హోరులా దూకే తుపాను గాలి.

మిద్దె దొనల్లోంచి దూకే నీళ్ళ హోరెత్తు

తోన్న శబ్దం.

వీధులన్నీ వంకలయినట్టున్నాయి.

వంకలన్నీ వరదెత్తిన పెన్నమ్మలయినట్టున్నాయి.

ఎవరిదో మేకల దడి లేచినట్టుంది.

ఊరికి ఉత్తరం వైపు కొండవాగు జోరు చెవులు దిబ్బెళ్లు పడేలా చేస్తోంది.

తెల్లారేసరికి ఏ చెరువూ ఖాళీగా ఉండదు. కట్టలు తెంచుకొని కొన్నీ, అలుగులు పొంగి మరి కొన్నీ...

తన ఇల్లు కూడా అలుగు పొంగేట్టుంది.

తమకు ఏకైక దిక్కుగా ఉన్న 'పెచ్చేట'ను చూస్తూంటే నవ్వొస్తోంది.

ఉన్నట్టుండి కిసుక్కున నవ్వాడు.

అతనికేసి కళ్లె తింది ఆమె.

"మూడు చేటల కథ చెప్పనా..." అన్నాడు నవ్వు చెదరకుండానే.

"ఊ..." అంది.

చెప్పబోయే ముందుగా మరోసారి నవ్వుకొన్నాడు.



మేకల అరుపులు గోలగోలగా విన్పిస్తు న్నాయి.

"మనలాంటి ఆలు మొగున్లేనంట... బీద కాపరం...యిదో యిట్లాగే ఎనుగాడి బోదంతా కుల్లిన పాత గుడిసె... వానా

కాలం జడిబడితే వాళ్లకూ మన అగసాట్లే నంట... స్వాతికార్తెలో ఒకనాటి మాపటేల పాత చుట్టం వొకాయన వొచ్చినాడంట. రేత్రికే వాన...జడి... చుట్టానికి మంచమేసి బొంత పరిచి, వాళ్లేమో కింద పడుకొన్నే రంట... వాన ఎక్కువైంది... కప్పు తడిసి కారేది మొదులైంది. చుట్టం మంచమ్మీద కారడం లేదుగాని వాళ్ల తావులో కారతాంది.

ఇద్దరూ లేచి కారని తావు వెతుక్కుని వెతుక్కుని కూకున్నేరు. కాసేపటికి మంచమ్మీద కూడా చినుకులు కారబట్టినాయి. చుట్టం లేచి కూచుని మంచమ్మీదే ఆ పక్కకూ ఈ పక్కకూ సర్దుకొన్నే కుదర్లా ... ఒకపక్క పట్టె మీద వెతుక్కుని కూకొన్నే సరిపోలే... చినుకులు కారని తావు దొరకలే... మంచమ్మీద పరిచిన పాత గుడ్డల బొంత తీసి కప్పుకున్నేడు. కాసేపటికి అదీ తడిసిపోయింది. ఏం జెయ్యాలో అర్థంగాలే... తన పరిస్థితే ఇట్లా ఉంటే ఆలుమొగుండ్ల పరిస్థితి ఇంకెట్లా ఉందోనని మెరుపుల వెలుతుర్లో అటు ఇటు పారజూసిండు. దేవర మూలన ఇద్దరూ కరచుకొన్నట్లుగా వొదుక్కొని కూచుని కనబన్నేరు... వాళ్లు వూరకే కూకోలే... నెత్తిన చెరొక చేట కప్పుకొని కూకోనుండారు. కారిన నీళ్ళన్నీ చేట మీద బడి ఏటవాలుగా కిందకు జారతండాయి. తడిసిపోకుండేందుకు మంచి ఉపాయం.. తనకూ ఒక చేట దొరికితే బావుండనుకొన్నాడు చుట్టం... తలయినా దాచుకోవచ్చుగదా...!



నెత్తిన చెరొక చేట కప్పుకొని కూకోనుండారు. కారిన నీళ్ళన్నీ చేట మీద బడి ఏటవాలుగా కిందకు జారతండాయి. తడిసిపోకుండేందుకు మంచి ఉపాయం...

మెరుపుల కాంతిలో ఇండ్లంతా వెతికిండు... మూడో చేట లేదు. దిగులుగా మంచమ్మీద కూకుంటా అప్పుడన్నేడట అతను, "సంసారమంటూ చేస్తే మూడు చేటలన్నా ఉండొద్దా! ఇదేం దరిద్రపు సంసారం?" అని. వాళ్ళిద్దరు మాత్రం మూల నుంచి కదల్లేదంట..."

ఆమెకు నవ్వాగింది కాదు.

గలగల నవ్వుతూనే ఉంది.

ఉన్నట్టుండి ఫెళఫెళమని ఏదో విరిగిన కఠోరమైన ధ్వని. ఆ వెనకే నేల అదిరేలా 'దబ్' మంటూ ఏదో వీధిలో పడిన శబ్దం.

ఉలిక్కిపడింది ఆమె.

చెవి గూబలు అదిరేలా విన్పించిన చప్పుడుకు అదిరిపడుతూ అప్రయత్నంగానే అతనికేసి తిరిగింది.

ఆమె తల అతని ఎద మీద వాలింది.

చేయి అతన్ని చుట్టేసింది.

"వేపచెట్టు కొమ్మ యిరిగినట్టుందిలే..." చెబుతూ ఆమె భయం పోయేలా వీపు నిమురుతూ ప్రేమగా దగ్గరకు తీసుకొన్నాడు శివుడు.

ఆమెను తన అసలు భంగిమలోకి వెళ్లకుండా పొదవి పట్టుకొన్నాడు.

వాళ్లకు ఇప్పుడు 'పెచ్చేట' అవసరం కూడా కన్పించలేదు.

చిన్న చేట చాలు.

రెండు శరీరాలు అవసరం లేదు.

ఒక్క శరీరం చాలు.

వాళ్లిప్పుడు ప్రపంచ స్పృహ మరిచారు.

తుపాను గాలులూ, అచ్చెనగాయలంతేసి చినుకులూ, కళ్లు మూసుకుపోయే మెరు

## రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు

# మాడరన్ 'ఐ' హాస్పిటల్ & రీసర్చ్ సెంటర్ వారి శుభవార్త !

GOMS No. 162 HM & FW (K.1) DEPT Dt 23-05-2005
GOMS No. 477 HM & FW (K.1) DEPT Dt 30-08-2005

ప్రకారం
రాష్ట్ర ప్రభుత్వ గుర్తింపు

* రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు మరియు వారిపై ఆధారపడ్డవారు * ఉపాధ్యాయులు

* రిటైర్డ్ ఉద్యోగులు & వారిపై ఆధారపడ్డవారు * స్థానిక సంస్థల ఉద్యోగులకు

---

కంటి వైద్యానికి సంబంధించిన అన్ని వ్యాధుల పరీక్షలు మరియు
శస్త్ర చికిత్సలకు అయ్యే ఖర్చులను రీ ఇంబర్స్ పొందవచ్చును.




## మాడరన్ 'ఐ' హాస్పిటల్ లో మాత్రమే లభించే సూపర్ స్పెషాలిటీ సేవలు

- కాటరాక్ట్ (కంటి శుక్లం) : COLD PHACO SURGERY with FOLDABLE IOL.
- దృష్టి దోషాలు : కంప్యూటర్ పరీక్ష, కంటి అద్దములు, కాంటాక్ట్ లెన్సు & లాసిక్ లేజర్ చికిత్స.
- గ్లుకోమా (నీటికాసులు) : HUMPHREY FIELD ANALYSER పరీక్ష, YAG LASER చికిత్స మరియు TRABECULECTOMY చికిత్స
- రెటినా : FUNDUS FLUORESCEIN ANGIOGRAPHY (FFA) & B SCAN - షుగర్, బి.పి. గల వారికి రెటినా వైద్య పరీక్షలు LASER PHOTO COAGULATION - VITRECTOMY చికిత్స.

మెల్ల కన్ను : వ్యాధి నిర్ధారణ, శస్త్ర చికిత్స... కంటి రెప్పలు DCT, DCR
ఇతర అన్ని కంటి శస్త్ర చికిత్సలు... అన్ని కంటి వ్యాధుల నివారణకు ఒకే ఒక అడ్రస్సు ...

**TTK, HERITAGE, MEDSAVE, FAMILY HEALTH PLAN, GOOD HEALTH PLAN, BAJAJ ALLIANZ.**

*కార్డ్ హోల్డర్స్‌కు క్యాష్‌లెస్ ట్రీట్‌మెంట్ సౌకర్యము కలదు.*

**A.P. TRANSCO, BSNL, FCI** ఉద్యోగస్తులకు,
రిటైరైన ఉద్యోగస్తులకు మరియు వారి మీద ఆధారపడ్డ వారికి
క్యాష్‌లెస్ ట్రీట్‌మెంట్ సౌకర్యము కలదు.

# మాడరన్ 'ఐ' హాస్పిటల్ & రీసర్చ్ సెంటర్

వెంకటరమణ హోటల్ ప్రక్కవీధి, పొగతోట, నెల్లూరు. ఫోన్ : 2324868, 2306015.

డా॥ పి.ఎల్.రావు
M.S.F.P.S.M., (Madurai)

డా॥ శ్రీమతి పి.భారతి
D.O. (Madurai), F.A.M.S., F.P.M.S. (USA)

డా॥ ఓ.గోపాలకృష్ణ
M.S. F.A.C.S. (USA)

డా॥ B.కృష్ణమూర్తి
B.Sc., M.B.B.S., D.O.

పులూ, చెవి గూబలు పగిలే ఉరుములూ, వంక వరదలూ, చెరువు అలుగు ధ్వనులూ, తమ మీద కారే చినుకుల చిటపటలూ.... ఏవీ గుర్తుకు రాలేదు.

వాళ్లపైన గొడుగు పట్టిన పెచ్చేటకయితే అంతులేని ఆశ్చర్యంగా ఉంది. ఇప్పటిదాకా తన నీడన వొదిగి ముడుచుకొన్న వాళ్లు కాస్తా ఇప్పుడు తన ఉనికినే మరిచారు. వాసాల మీంచి కారే నీళ్లు వాళ్ళ శరీరాల మీద టపటప రాలుతోన్నా, 'పెచ్చేట' చెవుల కెందుకో అవి 'చుంయ్ చుంయ్' మంటూ కాలిన ఇనుము మీద పడ్డ వాటిలా ఇగిరిపో తోన్నట్లు తోచింది.

మూడు చేటల కథ తనూ వినివుంది పెచ్చేట.

ఇప్పటి యీ ఆలుమగల తోటి తన అను భవం దృష్ట్యా ఆ కథలో ఏదో లోపమున్న ట్లుగా తోచింది.

ఇంత పెద్ద చేటయిన తనకే యీ కథలో విలువ లేకుండాపోయింది. రెండు చేటలకు అంత విలువ ఎందుకిచ్చినట్లు?

## 2

ఉదయానికంతా వాన వెలిసి ఆకాశం నిర్మలమైంది.

ఆకులు బోద కసవుల్తో అపరిశుభ్రంగా ఉన్న వీధుల్ని ఎవరింటి ముందు వాళ్ళు ఊడ్చుకొంటున్నారు. కసవు గంపల్ని తల మీద పెట్టుకొని ఊరి బైటకు వెళుతున్నారు.

విరిగి పడిన వేపచెట్టు కొమ్మల ఆకుల సందుల్లో పురుగుల కోసం వెదుకుతున్నాయి కోళ్ళు.

ఇంటిముందు అస్తవ్యస్తంగా పడి ఉన్న వేప కొమ్మల్ని తీసికెళ్ళి కళ్లం దొడ్లో వేసి వస్తున్నాడు శివుడు.

తల్లి వెంట పురుగుల్ని ఏరుకు తింటోన్న బుల్లి కోడి పిల్లలు... కొమ్మ పైకెత్తినప్పుడు ఆకుల తోటి పైకి లేచి దూది వుండల్లా జారి పడుతున్నాయి.

కొండవాగు ప్రవాహ గానం తోటి చెరువు అలుగు నీళ్లు దూకే శబ్దమూ జోరుగా విన్పి స్తోంది.

శివుని చెవులు అటుకేసి పీకుతున్నాయి.

కొమ్మల వెనగ్గా కొత్త చీరతో వున్న అమ్మాయి మొహం స్పష్టాస్పష్టంగా కన్పించి, ఆమె కసవూడుస్తోన్న దృశ్యం అర్థమై, వింతగా చూడబోయిన జనానికి ఆమె ఎవరో తెలిసి ఆశ్చర్యపోయారు. గాలివాన ఆగిన తర్వాత రాత్రి పుట్టలు పగులగొట్టు కొన్న ఉసుళ్లు మందలు మందలుగా ఇళ్ళ ల్లోని దీపాల ముందు మూగినట్లుగా కొద్ది సమయానికే గ్రామంలోని ఆడాళ్లంతా శివుని ఇంటిముందు గుమిగూడారు.

శివుని తల్లి లక్షుమ్మను తూలనాడారు. "ఏమే ముసిల్దానా! కొత్త కోడలికి నలుగన్నా పెట్టకుండా ఇంట్లేకి తెచ్చుకొన్నావూ? వాల్లంటే ఉడుకు నెత్తుటోల్లు. నీకన్నా బుద్ధిలే..." అని

శివుణ్ణి దబాయించారు. "ఏందిరా నా బట్టా! పప్పు పరమాన్నం బోసి మా నోరు కమ్మజెయ్యకుండా పెండ్లాన్ని యింట్లేకి తెచ్చు కొన్నెవు?" అంటూ.

గౌరిని కూడా వదల్లేదు. "అదిగాదే పిల్లా! ఆడ ముత్తైదులకు ఆకొక్కలిచ్చి మగసాము లకు కాల్లు మొక్కినాంక గాదూ అత్తగా రింట్లో అడుగు బెట్టాల్సుంది..." అంటూ.

ఏది ఏమైనా పచ్చి పసపుకొమ్ములాంటి వొంటితో తీగ మెరుపులా ఉన్న గౌరిని అందరూ మెచ్చుకొన్నారు.

ఈడు జోడు బావుందన్నారు.

ఒకర్నొకరు నెట్టుకొంటూ బురదకాళ్లతోనే యింట్లోకెళ్లారు.

గౌరి మనోభావాలతో సంబంధం లేకుం డా వరసైన ఆడపడుచులు ఆమెను తడికల

చాటుకు తీసికెళ్లి తలమీద నీళ్లు పోశారు. స్నానం చేయించి కొత్తబట్టలు కట్టారు.

శివున్ని కూడా రెక్కపట్టుకొని ఈడ్చుకొచ్చి అతనిపైనా ఓ బిందెడు నీళ్లు కుమ్మరించి కొత్తగా తయారుచేశారు.

చాప పరిచి యిద్దర్నీ పక్కపక్కగా కూచో బెట్టారు.

బియ్యానికి పసుపు సున్నం కలిపి తయారుచేసిన అక్షింతల్ని నలుగుబెట్టారు.

"రమ్మనరె నలుగుకూ...

రాధ రుక్మిణి తోడుతా... రమ్మనరె నలుగుకూ..." అంటూ ఓ మనోజ్ఞమైన నలుగు గీతంతో ప్రారంభమైన జానపద సాహిత్యం అక్కడ వరదలైంది.

"పదాలు పాడకుంటే మూగి పిల్లోల్లు పుడ్తారే నాయమ్మల్లారా! పాడండి... పాడండి..." అంటూ ముసలమ్మలు ప్రోత్సాహమివ్వటంతో కార్యక్రమం మనోరంజకంగా సాగింది.

అక్కణ్ణించి ఎప్పుడెప్పుడు బైట పడదామా అన్పిస్తోంది శివునికి.

ఆడవాళ్ల మధ్యనుంచి పారిపోవాలనిపిస్తోంది.

లేచిన వెంటనే చెరువు వద్దకు పరుగులు తీద్దామనుకొన్నాడు.

విరిగిపడిన వేపకొమ్మల వల్ల ఇంటి ముందు దారికూడా మూసుకుపోవటంతో ఆగవలసి వచ్చింది. ఆడాళ్ల చేతుల్లో చిక్కే దుస్థితి కలిగింది.

అలుగునీళ్లు దూకే సవ్వడి అతన్ని ఓ భంగిమలో నిలబడనీయట్లేదు.

ఎగిరిపోవాలనిపిస్తోంది.

చెరువునిండా తొణకిసలాడే ఎర్రనీళ్లల్లో కప్పించి దూకాలనిపిస్తోంది.

ఊరి మగాళ్లంతా చెరువుకట్ట మీదే ఉంటారు. వేపపుల్ల పూర్తిగా అరిగిపోయే దాకా పళ్లు తోముతూ కట్టమీద తిరుగు

చతుర 30 వసంతాలు

తూనే వుంటారు. కడుపులో ఆకలి రెపరెపమనే దాకా మొగాలు కూడా కడగరు.

ఒకటి రెండుసార్లు లేచి తప్పించుకురాబోతే ఆడవాళ్లు పట్టుకొని కుదేశారు శివుణ్ణి.

నలుగు పూర్తయిా కాకుండానే పీటల మీంచి లేచి వెనుదిరిగి చూడకుండా చెరువు కేసి నడిచాడు.

పెద్దపెద్ద అంగలు కాస్తా ఊరు దాటగానే పరుగుగా మారాయి.

ఎదురైన వాళ్ళు ఏదో అడుగుతోంటే సమాధానమివ్వకుండానే, చెరువు నీటి పరిమాణాన్ని గురించి వాళ్ల మీద ప్రశ్నలు గుప్పిస్తూ, సమాధానం కోసం కూడా చూడకుండానే ముందుకు సాగి కట్టమీద తేలాడు.

చెరువు నిండా అలలు తొణికిసలాడుతూ ఎర్రనీళ్లు.

దూరంగా అలుగు మోత.

చెరువు కట్ట నిండా చచ్చిపడున్న ఉసుళ్ల మంద. కంపచెట్ల మీదా గడ్డిగాదంపైనా అంటుకొని వున్న వాటి రెక్కలు...

చిన్నచిన్న అలలకు తోసుకొచ్చి కట్టవారన నీళ్లమీద పేరుకుపోతోన్న ఎండుటాకుల తెట్టు.

సంతోషాన్ని తట్టుకోలేకపోయాడు శివుడు.

కట్టవెంట కొంతదూరం పరువెత్తి పసుపు బట్టల్తోనే చెరువు గర్భంలోకి కుప్పించి దూకాడు.

తృప్తిగా మునకలేశాడు.

మనసారా ఈదాడు.

వెంట్రుకల్లో చిక్కుకొని వున్న అక్షింతలు నీళ్లల్లో కలిశాయి.

ఒంటికి పూసిన గంధం ఎర్రనీళ్లను సుగంధభరితం చేసింది.

ఈది... ఈది... ఈ నాలుగేళ్ల కరువు బాధ కరగిపోయేలా ఈది... వలసబతుకు చేసిన గాయాలు మరచిపోయేలా మునిగి తేలి... శరీరమంతా అలసిపోయేలా నీళ్లాట ఆడి ఆడి... ఎర్రనీళ్లల్లోంచి బైటకొచ్చేందుకు మనస్సు రాక... గోదురుకప్పలా దరి కరచుకొని తేలుతోంటే...

"ఒరే శివగా..." అనే పిలుపు వినిపించింది.

నీళ్లమీంచే తలెత్తి చూశాడు.

తనకేసే ఈదుకొంటూ వస్తూ హనుమంతు.

"ఒరే ఒరే... నాగ్గూడా యాడన్నా మంచి తావుంటే సెప్పరాదూ!"

"ఏం తావురా?"

"అదేరా... మంచి పిల్లదొరికే తావూ... నా కొడకా బంగారంమంటి పెండ్లాన్ని తెచ్చుకొన్నెవు గదురా!"

ముసిముసి నవ్వుల్లో మునిగిపోయాడు శివుడు.

"అర్రయిన గిత్తేనా? కాడి మెడమీంద బెట్టి యిప్పుడు అర్రు జెయ్యాల్నా" అడిగాడు హనుమంతు.

"అర్రు గాలేదు... అర్రు జేసేది లేదు."

"అంటే...ఏ పనీ సేతగాదు. నువ్వు నేర్పుకోవు... అంతేనా?" ఆశ్చర్యంగా అడిగాడు.

తలూపాడు శివుడు.

"రైతు పనిరా...! సంగటి గెలకడమో.. కనీసం పేడకాండ్లెయ్యడమన్నా రాదా!"

హనుమంతుకేసి తేలిగ్గా చూశాడు శివుడు.

"ఎర్రి నా కొడకా! పేడ బేసేందుకు వొల్లొంగిందంటే రైతు పనికి మెడలొంచినట్టే గాదూ!" అన్నాడు.

"ఎర్రి నా కొడుకును నేను గాదు నువ్వు... పని సేతగాదంటావు. నేర్పుకోనటావు. కూకోబెట్టి సాకడానికి నువ్వేమనా కుబేరునివా? ఒరే సామీ! నువ్వు సూపింపిల్లొద్దు. నీ సావాసమొద్దులేరా!" అంట గట్టెక్కాడు.

☎ 2332970
2330970

# శ్రీ దుర్గ

## సూపర్ స్పెషాలిటి న్యూరో సర్జరీ హాస్పిటల్

### స్పైనల్ & బ్రెయిన్ సెంటర్

15/266, బృందావనం మెయిన్‌రోడ్డు (తిక్కన టెలిఫోన్ భవన్ తూర్పు వైపు), నెల్లూరు-1







సింహపురికే తలమానికంగా, కోస్తా ఆంధ్రాలో అతిపెద్ద రూఫ్ గార్డెన్‌తో
సువిశాలమైన పార్కింగ్ కలిగి, సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకున్న

# శ్రీ దుర్గ ఫంక్షన్ హాల్

ఈనాడు ఆఫీసు ఎదురుగా, చెముడుగుంట, నెల్లూరు.



డా॥ పి. శ్రీనివాసులరెడ్డి
M.S., M.Ch., Neuro Surgeon



పి. అపూర్వ
Medico



డా॥ పి.యశోదర
Gynaecologist

చతుర 30 వసంతాలు

నవ్వుకొంటూ శివుడూ గట్టెక్కి తడి బట్టలతోనే చెరువు కింది తన మడికయ్య వద్దకెళ్లాడు.

కయ్య చుట్టూ తిరిగాడు.

సాగుబడి లేక పొలమంతా కంపచెట్లు పెరిగివున్నాయి.

గెనిమలు హద్దుగా నీళ్లు నిండిన చతురస్రాకారపు మడికయ్యలన్నీ సూర్యకిరణాలు సోకి అద్దపు బిళ్లల్లా మెరుస్తున్నాయి. రాత్రి వానదేవత సాంగత్యపు సుఖాన్ని అనుభూతించిన నేలతల్లి పులకరింతల దృశ్యాలు ఎటు చూసినా కోకొల్లలుగా కన్పిస్తున్నాయి.

చేలల్లో నిలిచిన ఎర్రనీళ్ల నిండా తెల్లగా తేలియాడుతూ ఉసుళ్ల రెక్కలు... నీళ్లు పొర్లి చేలగట్లు వొరుసుకుపోయిన దృశ్యాలూ... కోతబడిన గెట్ల వద్ద ఇంకా సన్నగా పారుతూ వున్న నీళ్ల జాలులూ...

రాత్రి గాలివాన తాలూకు బీభత్సపు నీడలు వాతావరణం నిండా ఇంకా కదలాడుతూ ఏదో మార్మిక అనుభూతిని అందిస్తూ...

దారుల్లో చిలపచిలపలుగా నిలిచివున్న నీళ్లల్లో పాదాలు తడుపుతూ ఊర్లోకెళ్లేసరికి తన్ను చుట్టుముట్టిన జనం... పెళ్లి ముచ్చట్లూ... ఎగతాళి పర్వాలూ... వాళ్లను దాటుకొని ఇంటికెళ్లేసరికి, తలస్నానం చేసింది కాబోలు కురులు ఆరబెట్టుకొంటూ కన్పించింది గౌరి. ఈ బీదవాడి మీద దయదల్చి దేవలోకం నించి అప్పుడే దిగివచ్చిన అప్సరసలా వుంది.

కళ్లార్పకుండా తదేకంగా చూస్తూ ఇంట్లోకెళ్లాడు.

ఆడమ్మగారంతా ముచ్చట తీర్చుకొని వెళ్లినట్లుంది. అక్క కూడా లేదు. ఆమె పిల్లలున్నారు. ఏడేళ్ల సుభద్ర. నాలుగేళ్ల రఘు.



"బువ్వ తిన్నాయినా!" లక్షుమ్మ అంది.

"మామా! అత్త కూడా బువ్వ తిన్లే... రహస్యంగా చెప్పింది సుభద్ర. లక్షుమ్మ బైకెళ్లింది.

రాత్రి కొట్టం కప్పు కింద వేలాడగట్టి



వుంటుందేమో!

కప్పు లేచి పోయిన కొట్టం, బురదమయమైన నట్టిల్లు, కుక్కి మంచము, మొండి గోడలూ... ఇంత అనాగరికమైన యింటిని చూసి అసహన పడుతూం టుంది కాబోలు గౌరి. టీవీ, ఫాన్లూ, ట్యూబ్‌లైట్లతో నాగరీకంగా బతికే తన పుట్టిల్లు తల్చుకొని మెట్టినింటితో పోల్చుకొంటోందేమో!

"బువ్వ తిందామా?" పాపను అడిగాడు.

"మేం తిన్నాం... నువ్వూ అత్తే..." చెప్పిందాపిల్ల.

కాళ్లు కడుక్కొని వచ్చి పాత చెక్క పీట వాల్చుకూచు న్నాడు. అన్నపు పళ్లేన్ని తెచ్చి అతని ముందుంచింది గౌరి.

"నువ్వూ పెట్టుకో..." చెప్పాడు.

ఆమె కదల్లేదు.

అతని లోపలున్న అనుమానం పెరిగింది.

పెచ్చేట ఇంకా అలాగే వుంది. నవ్వుకొంటూ దాన్ని లాగి మచ్చు కింద సర్దుతూ వుంటే దొడ్లోంచి వచ్చిన గౌరి ఆ దృశ్యాన్ని చూసి చిన్నగా నవ్వుకొంది.

ఇల్లంతా తడి తడిగా వుంది. పొయ్యి మండించేందుకు ఎన్ని అగచాట్లు పడివుం టుందో అమ్మ! అక్క సహాయం చేసి

"ఇండ్లంతా చూసినావా? ఇట్లాంటి కొంపల్లో కూడా సంసారాలు చేస్తారని నువ్వనుకోనుండవు గదూ!" అన్నాడు. "అదే మరి మా ప్రత్యేకత" ముక్తాయింపుగా చెప్పాడు నవ్వుతూ.

అతనికేసి కళ్లెత్తి రెండుసార్లు రెప్పలు

తాటించింది గౌరి.

ఇంట్లో కెళ్లి అన్నం సెరవా, కూర కుండా తెచ్చి అతని ముందుంచింది.

తనూ ఓ పళ్లెం తెచ్చుకొని కూచుంది.

అన్నం వడ్డించుకొంటూ- "బోద కొట్టాలు కూడా లేక చెట్ల కింద చేసే సంసారాలను కూడా చూసినా..." మెల్లిగా చెప్పింది. "పెచ్చేటను అడ్డుపెట్టి తుపాను వానలో కూడా తడవని మంత్రాన్ని మాత్రం ఈ ఇంట్లోనే చూసినా" అంది నవ్వు కదలాడుతోండగా.



**తనెప్పుడూ పొయ్యి దిక్కూ కుండా, చట్టి వైపూ యింత పరీక్షగా చూసినవాడు కాదు. వాటి పాతదనం తనకెప్పుడూ యింత మొరటుగా కన్పించలేదు**

అతను కూడా నవ్వాడు.

వాళ్ల నవ్వుల కేసి ఆశ్చర్యంగా చూడసాగారు పిల్లలు. ఉన్నట్లుండి రఘు బైటకు పరుగెత్తాడు "అవ్వా! అవ్వా!!" అంటూ. వేప చెట్టు కింద కూచుని ఉన్న అవ్వతో చెబుతున్నాడు వాడు- "అత్తా మాయోల్లు బువ్వ దినకుండా నవ్వుకుంటండారు" అని.

"అసాధ్యుడే..." గౌరి అంది.

అన్నం తింటూ తనముందున్న వస్తువుల కేసి చూశాడు శివుడు. పాత సెరవ, పాత పళ్లెం, నొక్కులు పడిన చెంబు, మొర్రిబోయిన కూరకుండ. తనెప్పుడూ పొయ్యి దిక్కూ, కుండా, చట్టి వైపూ యింత పరీక్షగా చూసినవాడు కాదు. వాటి పాతదనం తనకెప్పుడూ యింత మొరటుగా కన్పించలేదు.

వాటి ఆకారాల్ని ఇప్పుడు గమనిస్తోంటే సిగ్గుగా వుంది. ఆమె ఏమనుకొంటుందోనని న్యూనతగా వుంది. అన్నమూ పప్పు - అమ్మ చేతి రుచిని చెబుతున్నాయి.

సన్న బియ్యం కూడు.

ఎక్కడో బియ్యంను బదులుగా తెచ్చినట్టుంది. తమకు అన్నం, పప్పు అపురూపమైన ఆహారమే. టిఫిన్ల తోటి రకరకాల వంటకాల్ని రుచి జూసే గౌరి పరిస్థితిని గురించే ఆలోచించాలి.

పళ్లెం ముందునించి లేచేసరికి సుబ్బారెడ్డి వగైరా మిత్రులొచ్చారు. తనతోటి బేల్దారి పనికి వలస వెళ్లిన మిత్రులు. గౌరి కుటుంబానికి కూడా పరిచయం వుంది వాళ్లతో.

"ఒరే ఒరే! ఏందిరా యిది? " కొట్టం ఎనుగాడికేసి చూసి ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సుబ్బారెడ్డి.

"రేత్రి కొట్టమెక్కి బోదంతా పీకినాలేరా బావా!" చెప్పాడు శివుడు.

"ఎందుకూ? "

"ఇంట్లో అడుగుపెట్టిన కాన్నించీ మీ చెల్లెలు ఒకటే పోరు చేస్తాంది. పగలు ఎండా, రేత్రి ఎన్నెలా వొల్లుకు తగలాలంట. ఇంట్లో పండుకొంటే చుక్కలన్నీ కనబడాలంట."

"ఒరేయ్! నీ ఎచ్చుల కూతలు సాలించు గానీ... మర్యాదగా బైల్దేరు. వరికుంట్లకు పోయి పదిమోపుల బోద తెచ్చి ఎనుగాడి కప్పుదాం."

"నాయిన్నాయినా! ఆ పన్జేసి పున్నెం కట్టుకోండిబ్బీ!" అప్పుడే అక్కడికొచ్చిన శివుని అక్క శివమ్మ అంది.

గౌరికి అక్కను తోడుజేసి మిత్రులతో కదిలాడు శివుడు.

సాయంత్రానికంతా పదిమోపుల బోదగడ్డి తేవటం, ఎనుగాడినంతా శుభ్రం చేసి

# మానవత్వానికి ప్రతిరూపం... డాడీ నిలయం

## ఎదిగే బాల్యం - కరిగే జీవితం



**నాడు**

తల్లి వడిలో జోగారువలసిన బాల్యంలో తల్లికి తల్లి అయి ఆకలి తీర్చడానికి నాలుగు వీధులు తిరిగి బిక్షాటన చేసి తల్లికి ఆ గోరు ముద్దలు తినిపిస్తున్న బిడ్డ ఈ మానవీయ దృశ్యాన్ని చూసి మనస్సు చలించి వారిని అక్కున చేర్చుకొని వారి ఆలనా పాలనా తన వంతు బాధ్యతగా స్వీకరించిన రాజా ఫౌండేషన్ వారికి జోహార్లు అర్పించాలి.



**నేడు**

ప్రస్తుతం ఆ తల్లి రాజా ఫౌండేషన్ అధ్వర్యంలో చికిత్స పొందుతూ, తన బిడ్డను లాలిస్తూ, తల్లి ప్రేమను పంచుతూ కాలగమనంలో పయనిస్తుంది.

## బ్రతుకునిద్దాం - పథకం

★ అనాథ బిడ్డల జీవిత బాధ్యతలన్నీ తీసుకోవడానికి ముందుకువచ్చే మానవతా మూర్తుల కోసం రూపొందించిన ప్రత్యేక కారుణ్య పథకమే 'బతుకునిద్దాం'.

★ దీని ప్రకారం ఒక బిడ్డకు నెలకు 500/- రూపాయలు లేదా ఏడాదికి 6000/- రూపాయలు డి.డి. రూపంలో కాని నగదు రూపంలో గాని "రాజ ఫౌండేషన్" మైలవరం పేరు మీద పంపగలరు.

★ మీరు అందించే సహాయం ద్వారా ఒక అనాథ బిడ్డకు కూడు, గూడు, గుడ్డ, విద్యా, వైద్యం ఆనందమయ జీవితాన్ని డాడి హోం అందిస్తుంది.

★ ఓ అనాథ బిడ్డ కన్నీళ్ళు తుడిచి, చిరునవ్వులు నింపడానికి మీరు చేయదలచుకున్న తదితర సేవలు :

★ మీరు బాధ్యత తీసుకున్న బిడ్డను ఎప్పుడైనా డాడి హోంకు వచ్చి చూడవచ్చు.

★ మీతోటి స్నేహితులను - బంధువులను ప్రోత్సహించి ఇంకొక అనాథ బిడ్డకు వారి ద్వారా చిరునవ్వులు ప్రసాదింపచేయడం.

★ నిత్య అన్నదాన కార్యక్రమం
(మీ పిల్లల పుట్టిన రోజులు, మీ వివాహ వార్షికోత్సవాలు, చనిపోయిన వారి స్మరణ దినోత్సవాల సందర్భముగా అనాథ బిడ్డలను గుర్తుంచుకోండి.)

★ బియ్యం, ధాన్యపు గింజలు దానం చేయడం. ★ వృద్ధులకు, వికలాంగుల పిల్లలకు మంచాలు, పరుపులు, దుప్పట్లు బహూకరించడం.

★ వృద్ధులకు, అనాథ బాలబాలికలకు దుస్తులు అందజేయడం. ★ స్కూలుకు పోయే అనాథ బిడ్డలకు యూనిఫాంలు, స్కూల్ బ్యాగులు, బుక్స్ అందజేయడం.

## డాడీ హోంలోని అనాధ బిడ్డల సహాయ నిధి దాతలు

| | |
|---|---|
| ★ శ్రీ వై.ఎస్.జగన్‌మోహన్‌రెడ్డి గారు | : 9,00,000 |
| ★ శ్రీ మహేంద్ర బలరాం గారు, న్యూఢిల్లీ | : 5,00,000 |
| ★ శ్రీ చిన్నజీయర్ స్వామి | : 1,00,000 |
| ★ శ్రీ అల్లే చిన్నచెన్నారెడ్డి, జడ్పీటీసి - మైలవరం | : 1,00,000 |
| ★ శ్రీ పి.రవీంద్రనాథరెడ్డి, మేయర్ - కడప | : 1,00,000 |
| ★ శ్రీ రామచంద్రారెడ్డి, హైదరాబాద్ | : 1,00,000 |
| ★ శ్రీ ఎ.గోవింద్, కాంట్రాక్టర్, ధన్నవాడ | : 1,00,000 |

## బతుకునిద్దాం పథకంలో మార్గదర్శకులు





శ్రీ ఎం.టి.క్రిష్ణబాబు
జిల్లా కలెక్టర్, కడప





శ్రీ వై.ఎస్.
జగన్‌మోహన్‌రెడ్డి







శ్రీమతి జ్యోతిరెడ్డి
జడ్పీ ఛైర్‌పర్సన్, కడప

"మనం అందంగా పెంచుకున్న మన బిడ్డలకు భద్రత ఉండాలంటే అనాథలు అభాగ్యులు లేని సమాజాన్ని మనమే సృష్టించాలి" .... డాడీ

# రాజా ఫౌండేషన్

మైలవరం (మం॥), కడప (జిల్లా) - 516439

Cell: 9247640641, 9440650619, 9290461055, 08560-73881

కప్పటం కూడా పూర్తి చేశారు.

వాళ్ల ఐకమత్యపు నడతల్ని ముచ్చటగా చూసింది గౌరి.

రెండు రోజులుగా జరిగిన సంఘటనలన్నీ కలగా వున్నాయి ఆమెకు. శివుడు రావటం, తను ఫలానా అని చెప్పటం, బంధుత్వం కలపటం, పెళ్లి ప్రతిపాదన తీసుకురావటం అంతా స్వప్నం లాగా అనిపిస్తూవుంది.

తన మేనమామ వీరారెడ్డి దుర్మార్గుడు. భార్యను కిరాతకంగా చంపాడు. తన జీవితాన్ని కూడా బుగ్గిపాలు చేయాలని చూశాడు. అతన్ని అడ్డుకొనే శక్తి తమకు లేదు. శివుడు రాకుంటే తన బతుకు రౌడీల కాళ్ల కింద నలిగిపోయి వుండేది.

కడప విషయాలు గుర్తొచ్చేసరికి తల్లి కళ్ల ముందు మెదిలింది.

వీరారెడ్డి ఇబ్బంది పెడుతున్నాడేమో!

తన ఆచూకి గురించి వేధిస్తున్నాడేమో!

తనను బైటపడేసి ఆమె ఇరుక్కుపోయింది.

తల్లిని గురించిన ఆలోచనలు దుఃఖాన్ని తెప్పించాయి.

ఫోన్ చేద్దామనుకొంటే ఊళ్ళో ఆ సౌలభ్యం లేదట. ఎవరో ఒకరిద్దరి వద్ద సెల్‌ఫోన్లున్నాయిగాని వాళ్లెప్పుడూ బైటే తిరుగుతుంటారట.

రాత్రి భోజనాల వద్ద శివుడు చెప్పాడు "నిన్నా యీరోజూ మీ యింటికి పోయిండంట వీరారెడ్డి" అని.

"ఆ... నిజమా? "

వీధెక్కి చిందులేసిండంట. మీ అమ్మను తిట్టినాడంట. నిన్నెక్కడికి పంపిందో చెప్పమని సతాయిస్తాండంట. నాకేమీ తెల్దని యేడ్చిందెంట మీయమ్మ. పిల్లను లేవదీస పోయినోడు ఊరు పేరు జెప్పుతాడ్రా అన్నెదంట. ఆమెక్కాడా తెలీకుండా మనం లేచొచ్చినామని అందరికీ చెబుతాం దెంట. మా ఊరి పేరన్నా జెప్పమని బలవంతపెడ్తే చివరకు చెప్పిందంట."

గుండెలు గుబగుబలాడాయి ఆమెకు.

"ఇప్పుడెట్లా? " అంది.

"ఏమీ? "

"అయప్ప వస్తాడేమో!"

"ఎవురు? యీరారెడ్డా...! రానీ... రాళ్లతో కొట్టి తరుముతాం..." అన్నాడు. అతనిలో ఎలాంటి ఆందోళనా కన్పించలేదు ఆమెకు.

"అవునూ! నీకీ సంగతులు ఎట్లా తెలిసినయి? "

"పక్కూరికి పోయి ఫోన్‌జేసి వొచ్చినా.." చెప్పాడు.

అతనికేసి ప్రేమగా చూసింది ఆమె.

అతనే కాదు... తన క్షేమం పట్ల మేనత్త పడిన తాపత్రయం కూడా ఆమెను కృతజ్ఞతా భారంతో కుంగిపోయేలా చేస్తోంది. తాము తీరని కష్టాల్లో ఉన్నామని తెలిసి తన్నక్కడి నుంచి బైటకు తీసుకురమ్మని కొడుకును పంపించిన సంగతి కన్నా - తను బావకు నచ్చకుంటే మరొక వరుణ్ని చూసయినా పెళ్లి చేసి పంపాలని ఆమె భావించటం ఆమె గొప్ప మనసుకు ప్రతీకగా వుంది.

ఆ రోజంతా తన పట్ల ఎంత ఆప్యాయత చూపించిందనీ! అనుక్షణం తనకేసే చూస్తూ, తన్నేదో అపురూపమైన వస్తువుగా అనుభూతించే ఆమె చూపులు తనకు గిలిగింతలు పెట్టాయి.

తనింకా శివుణ్ణి బావగా సంభోదించటం లేదు.

వరసలు పెట్టి పిలవటం లేదు.

మగనికంటే ముందు అతను రక్త సంబంధీకుడైన ఆత్మీయుడు కదా!

రాత్రి శివుణ్ణి "బావా!" అంటూ సంబోధి



# స్వయంభు శ్రీ కాణిపాక వరసిద్ధి వినాయక స్వామి దేవస్థానము

కాణిపాకం, ఐరాల మండలం, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.
ఫోన్: (08573) 281540, 281747.
ఫ్యాక్స్: 281960. విచారణ కార్యాలయం ఫోన్: 281640

## శాశ్వత పూజలు వివరములు

| | | | |
|---|---|---|---|
| ★ శాశ్వత ఉచిత ప్రసాద స్కీము | రూ.1,116/-లు పైన | ★ శాశ్వత నిత్యార్చన | రూ.1,516/-లు |
| ★ శాశ్వత నిత్యాన్నదాన పథకము | రూ.1,116/-లు పైన | ★ శాశ్వత నిత్యపూజ | రూ.1,516/-లు |
| ★ శాశ్వత గణపతి హోమము | రూ.7,500/-లు | ★ శాశ్వత కళ్యాణోత్సవము | రూ.15,116/-లు |
| ★ శాశ్వత అభిషేకము | రూ.7,500/-లు | ★ శాశ్వత ఊంజల్‌సేవ | రూ.7,500/-లు |

## శాశ్వత నిత్యాన్నదాన పథకం

పవిత్ర కాణిపాకక్షేత్రంలో స్వయంభువుగా వెలసిన స్వామివారి సన్నిధానంలో అన్నదానం చేసి అనంతమైన ఫలాన్ని పొందండి. జన్మ తరింపచేసుకోండి. రూ.1,00,116 చెల్లించినవారిని మహా రాజపోషకులుగాను, రూ.50,116 చెల్లించిన వారిని రాజపోషకులుగాను, రూ.25,116 చెల్లించినవారిని మహాపోషకులుగాను, రూ.10,116 చెల్లించినవారిని పోషకులుగాను మరియు రూ.1,116 చెల్లించినవారిని సాధారణ సభ్యులుగా గౌరవించబడుదురు. దాతలు చెల్లించు విరాళాలకు సెక్షన్ 80 (జి) ప్రకారము ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

## బంగారు రథము నిర్మాణ పథకము



దేవస్థానమువారు నూతనముగా శ్రీ స్వామివారి బంగారు రథము నిర్మాణము చేపట్టుటకుగాను దేవస్థానమునందు బంగారురథము హుండీ ఏర్పాటు చేయడమైనది. ఈ బంగారురథమునకు కావలసిన విరాళములు ధన రూపేణా, బంగారు రూపేణా, నగదు, డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లు ద్వారా దేవస్థానమునకు చెల్లించవచ్చును. ఈ మహోత్తర ప్రణాళికను చేపట్టుటకు భక్తుల చేయూత చాలా అవసరం. ఈ బంగారురథము నిర్మాణమునకు పంపు విరాళములు కార్యనిర్వహణాధికారి, శ్రీ వరసిద్ది వినాయకస్వామివారి దేవస్థానము, కాణిపాకం, చిత్తూరుజిల్లా వారి పేరున పంపి రశీదు పొందగలరు. దాతలు చెల్లించు విరాళాలకు ఆదాయపుపన్ను మినహాయింపు కలదు.

వంద గదుల నిర్మాణమునకు భక్తుల నుండి విరాళాలు స్వీకరించబడును. ఒక్కొక్క గది నిర్మాణమునకు రూ.1.50 లక్షలు అంచనా, పై మొత్తం మూడు సమాన కంతులలో కూడా చెల్లించవచ్చును. విరాళాలు డి.డి., ఎం.ఒ.లు ద్వారా కార్యనిర్వహణాధికారి, శ్రీ వరసిద్ది వినాయకస్వామివారి దేవస్థానం, కాణిపాకం చిత్తూరుజిల్లా వారి పేరున పంపి రశీదు పొందవచ్చును.



శివాజి,
బి.కాం., బి.ఎల్.
కార్యనిర్వహణాధికారి
మరియు
ఉప కమిషనరు

స్తేనేగాని ఆమె మనస్సు కుదుటబడలేదు.

లక్షుమ్మను "అత్తా!" అంటూ తీయగా పిలిస్తే గాని ఎద నెమ్మదించలేదు.

* * *

మరుసటి రోజు గౌరిని వెంటేసుకొని టౌనుకు ప్రయాణమయ్యాడు శివుడు.

అతణ్ణి పక్కకు పిల్చి ఏదో చెప్పింది లక్షుమ్మ.

టౌనుకు వెళ్లగానే అతను చేసిన మొట్ట మొదటి పని ఆమె చేత కడపకు ఫోన్




చేయించి తల్లితో తృప్తిగా మాట్లాడించడం.

సరోజమ్మ కూతురికి ధైర్యం చెప్పింది.

వీలు చూసుకొని త్వరలో తనా పల్లెకు వస్తానంది.

గౌరి కుదుటబడింది.

ఆమెను సినిమాకు తీసికెళ్లాడు శివుడు.

కావలసిన వస్తువులు కొనిచ్చాడు.

ఇంట్లో సరైన అద్దం కూడా లేదు.

ఆమె వద్దంటోన్నా వినుకోలేదు. వ్యవసాయ పెట్టుబడులకు డబ్బు తక్కువవుతుందని జాగ్రత్తలు చెబుతోన్నా చెవినేసుకోలేదు.

బియ్యం బస్తా కొనుగోలు చేశాడు.

వంటపాత్రలు కొని సంచిలో కట్టేదాకా మనస్సు ససేమిరా సర్దుబాటు కాలేదు అతనికి.

తర్వాత అమ్మ సూచించిన మేరకు అక్క కుటుంబానికి బట్టలు తీసుకొన్నాడు.

సాయంత్రం బస్సుకు ఊరు చేరారు.

కొడుకు తెచ్చిన అదనపు వస్తువుల్ని చూసి లక్షుమ్మ బుగ్గలు నొక్కుకొంది. బియ్యాన్ని అరచేతిలోకి తీసికొని పట్టి పట్టి చూస్తూ ఆలోచనల్లో మునిగిపోయింది.

శివమ్మ మాత్రం తమ్మునికే వత్తాసిచ్చింది.

సాయంత్రం ఎదురింటి రమణమ్మ గౌరితో మాటలు కలిపింది. "మా మరిదిని మనుసుల్లోకి తెస్తాండవు గదమ్మా!" అంది.

గౌరికి అర్థం కాలేదు.

"వీల్లంతా మొరటు గుంపులేమ్మా! ఒక మంచి లేదు. ఒక సెబ్బర లేదు. లోకం దిక్కు పారజూసేది లేదు. పెండ్లయినాన్నుంచీ యీల్లలో యేగలేక సస్తాండననుకో. ఒక్క రోజుకే నువ్వా పిల్లోన్ని మార్చినావంటే- ఆ కిటుకేందో మాకూ సెప్పరాదా!" అంది.

ఏమీ మాట్లాడలేదు గౌరి.

అప్పుడే పరిచయం కావటం. అంతంత పెద్ద ప్రశ్నలు అడగటంతో ఆమెకు దిక్కుతోచలేదు. అందులోనూ తను పట్టుబట్టి శివుణ్ణి ఏం మార్చిందో అర్థం కాలేదు. కొత్త వస్తువులు కొనమని తను ఒక్కమాట కూడా అభ్యర్థించలేదు. వాస్తవానికి తను వద్దనే చెప్పింది.

రమణమ్మ తనను పొగిడిందో, నేరస్థురాల్ని చేసిందో ఒక పట్టాన తెలిసిరాలేదు.

అశ్లేష కార్తె జంటగా శ్రావణమాసం వచ్చింది.

ఇప్పటికే వరినారు పక్వానికొచ్చి ఇవాళో రేపో నాట్లు బడాల్సింది.

అదను తప్పింది. ఆలస్యమైంది. అయినా తప్పదుగదా! చెరువు నిండా నీళ్లు ఓలలాడుతున్నాయి.

చెరువుకింద పొలాలన్నంతా వరి మాగాణి

ఓం శ్రీసాయిరాం

# పెట్టుబడి ఒకింత..
# సంతృప్తి నాలుగింతలు...
# రాబడి పదింతలు!





**ప్లాట్ రిజిస్ట్రేషన్ కలదు**

విజయవాడ, గుంటూరు, హైదరాబాద్ లలో
మా రన్నింగ్ వెంచర్స్

- **సాయి కామాక్షి** కంకిపాడు నుండి గన్నవరం రోడ్‌లో ఉప్పలూరు గ్రామ పంచాయితి పరిధిలో, విజయవాడ
- **సాయి వెంకట్ (రివైజ్డ్)** గుంటూరు-2 రైల్వేడివిజన్ దగ్గర, అగతవరప్పాడు గ్రామానికి ఆనుకొని, గుంటూరు.
- **సాయి బృందావనం** పాయకపురం నుండి ముస్తాబాద్ వెళ్ళేరోడ్‌లో, నున్న గ్రామ పంచాయితి ఏరియాలో, విజయవాడ
- **సాయిపురం** అమరావతి రోడ్‌లో, గోరంట్ల గ్రామానికి అతిసమీపంలో, గుంటూరు.
- **సాయి విహార్** హైదరాబాద్, శ్రీశైలము హైవేలోని కందుకూరు నందు, కందుకూరు మండలం, రంగారెడ్డి జిల్లా.
- **సాయి బాలాజి** నెడునూరు విలేజి, బచ్చుపల్లి, జైత్వారంరోడ్, హైదరాబాద్
- **సాయి నగర్** దండుమైలారం గ్రామపంచాయితీ పరిధి, ఇబ్రహీంపట్నం మండలం, రంగారెడ్డి జిల్లా

KALYANI ADS / JCH-07

**బుకింగ్స్ జరుగుచున్నవి**

# జనచైతన్య హౌసింగ్ లిమిటెడ్

**ఇండ్ల స్థలములు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ**

- సెకండ్ ఫ్లోర్, సీతారామ మాన్షన్, వెంకటేశ్వరపురం, బందరు రోడ్, విజయవాడ-10. ఫోన్ : **0866-2484101**
- సెకండ్ ఫ్లోర్, మామిడి మాన్షన్, అలంకార్ సెంటర్, గాంధీనగర్, విజయవాడ-3. ఫోన్ : **0866-2577041**

---

- రిజిష్టర్డ్ ఆఫీస్: పసుమర్తి కాంప్లెక్స్, 5/1 అరండల్‌పేట, గుంటూరు-522 002. ఫోన్స్: 0863-2232634, 2358043
- సెంట్రల్ ఆఫీస్: రూమ్ నెం: 203 టు 206, సెకండ్‌ఫ్లోర్, వంశీ ఎస్టేట్స్-3, అమీర్‌పేట, హైదరాబాద్-500 016. ఫోన్స్: 23417612, 13 • బ్రాంచీలు: • హైదరాబాద్-1:ఫోన్: 23212445 • హైదరాబాద్-2:ఫోన్: 23411383 • హైదరాబాద్-3:ఫోన్: 23212446 • సికింద్రాబాద్:ఫోన్: 23704757 • హైదరాబాద్-5:ఫోన్: 23704767 • విశాఖపట్నం-1: ఫోన్: 2549530 • విశాఖపట్నం-2 : ఫోన్: 2517346 • విశాఖపట్నం-3: ఫోన్: 2565852 • రాజమండ్రి: ఫోన్: 2420103 • కాకినాడ: ఫోన్: 2375992 • తిరుపతి: ఫోన్: 2262653 • నెల్లూరు: ఫోన్: 2343718

చేయాలనే నిర్ణయించారు రైతులు.

అందరూ మడికయ్యల్లోకి అడుగులేస్తున్నారు.

శివునికి కూడా తప్పలేదు.

మూడు రాత్రులు ముగిసీ ముగియక ముందే, పసుపు బట్టల కరకు తగ్గకముందే, కొత్త పెళ్లాంతో పరిపూర్ణమైన చనువు ఏర్పడక ముందే- బురదమళ్లల్లోకి దిగవలసి వచ్చింది.

అన్నం క్యారియర్ తీసుకొని, గౌరిని వెంటబెట్టుకొని, భుజాన సలికె, పారతో చెరువుకింది పొలం వద్దకెళ్లాడు.

మళ్లల్లో పన్జేసికొంటోన్న జనమంతా వాళ్లకేసి కొత్తగా చూసి తిరిగి తమ పనిలో మునిగారు.

గౌరిని గట్టుమీద నల్లతుమ్మ చెట్టు నీడలో కూచోబెట్టి తాను మడిలోకి దిగాడు శివుడు.

పొలంలోని కంపచెట్లన్నింటినీ కుళ్లగించటం మొదలెట్టాడు.

అతని పనికేసి తదేకంగా చూస్తోన్నదల్లా చాలా సేపు కూచోలేకపోయింది గౌరి. మెల్లిగా చేలోకి దిగి పెరికేసిన కంపచెట్లను కుప్పగా వేసేందుకు ప్రయత్నిస్తోంటే అతను అడ్డుకొన్నాడు. ససేమిరా పని చేయొద్దన్నాడు. కంప గుచ్చుకొంటుందంటూ ఆమెను చేని గట్టుదాకా తీసుకెళ్లి వదిలాడు. చెట్టు నీడనుంచి బైటకి రావద్దంటూ కట్టడి చేశాడు.

చుట్టూ పొలాల్లో మగాళ్లకు ధీటుగా ఆడాళ్లు కూడా శ్రమిస్తూండటం, తను చేతులు ముడుచుకొని చెట్టు నీడన కూచోవటం... కొంత ఎబ్బెట్టుగా అన్పించింది ఆమెకు.

తిరిగి తను చేలోకి దిగాలని ప్రయత్నించటం... అతను అడ్డుకోవటం...

ఆ దృశ్యమంతా ఇరుగుపొరుగు చేలల్లో పనిచేస్తున్న వారి కళ్లబడటం...

పక్క చేలోంచి ముసలి గోవిందమ్మ అప్పుడే అటుగా వచ్చింది. "ఏందమ్మే నీ సంబడం? " అంటూ.

"ఎండనకా వాననకా పన్జేసి సేసి



వొళ్లు కాయలు గాసినోళ్లకే ఎట్టెట్టనో వుంది. ఈ కంపసెట్లల్లో నువ్వేం జేస్తవే! సెప్పుల్లేకండా తిరిగితే తమలపాకు తొడిమె గూడా అరికాళ్లల్లో గుచ్చుకొనేంత నాజూగ్గా పెరిగినావంట గదమ్మే! సదూకొన్నె పిల్లన్దెచ్చి తాంబులంలో తమలపాకట్లా కసాపిసా నములుతే వానికి మరియాదేనా? " అంది

ఆమెకేసి తదేకంగా చూసింది గౌరి.

"ఊరకుండ బుద్ధి కాలేదవ్వా!" చెప్పింది



"అవ్వను కాదు. జేజిని" సవరించింది గోవిందమ్మ. "యీ శివగాని అమ్మ మా అక్క కూతురే. నేన్నీకు జేజిని గావాల్నే... జేజిని..." వివరించింది.

"నేనూరక లేనూ..." అంటూ ముక్తాయించింది.

ఓరగంట శివుని కేసి చూసింది గౌరి.

అతను ముసిముసి నవ్వుల మీదున్నాడు.

గౌరితో చెప్పినట్లు ముసలామె పనేమీ లేకుండా కూచోలేదు. పని చేయని మాత్రమైతే ఇంటి వద్దే వుండక పొలానికెందుకొచ్చినట్లు?

ఈ వయస్సులో పొలానికి వెళ్లాలని ఆశ పడటం కూడా పని కిందే లెక్కగదా!

తనను కూడా ఊరకుండమంది ఆమె లాగే... అంటే ముసలి వగ్గులాగా.

శివుడు లోలోపల నవ్వుకొంది ఈ ఉపమానానికేనేమో. చదువుకొన్న పిల్లనే తాంబూలంలో ఆకులా నమలకూడదుట. తనను లేత తమలపాకును చేసింది.

నమలకుంటే నోరెట్లా పండాలి?

తనను ముసలామెతో పోల్చటం భరించలేకపోయింది గౌరి.

కుచ్చెళ్లు ఎగజెక్కి మడిలో దిగింది.

రెండో అడుగు వేయబోయి "అమ్మా" అంటూ కాలు పైకెత్తింది.

రెండంగల్లో ఆమె వద్దకు చేరాడు శివుడు "ఏమైంది!" అంటూ.

"ముల్లు" అంది.

మెల్లిగా ఆమెను గట్టుపైకి చేర్చాడు.

తుమ్మచెట్టు నీడలో కూచోబెట్టి ఆమె కాలును తన చేతుల్లోకి తీసుకొన్నాడు.

ఉలికిపాటుకు గురయింది ఆమె.

అటు ఇటు పారజూసింది.

శివుని మొహంలోకి చూసింది.

అతని మొహంలో ఎలాంటి కొత్త భావాలూ కన్పించలేదు.

తన మోకాలు మీద ఆమె పాదాన్నుంచి వేళ్లతో బురద తడుస్తూ సున్నితంగా రాపాడిస్తూ ముల్లుకోసం వెదుకుతున్నాడు.

అరికాలులో కూడా చర్మం కింది నెత్తురు అటు ఇటు పారాడటం అద్దం వెనక దృశ్యంలా స్పష్టంగా కన్పిస్తోంది. తమ అర చేతులంత కఠినంగా కూడా లేవు ఆమె అరికాళ్లు.

కండరం లోపలికి దిగి నల్లగా కన్పించే ముల్లుకోసం జాగ్రత్తగా వెదకితే, ఎడమ మడమ వద్ద ఎర్రని చుక్కలాంటిది కన్పించి, అది రేగుముల్లు గాయంగా అర్థమై కిసుక్కున నవ్వాడు.

అతనికేసి ప్రశ్నార్థకంగా చూసింది.

"నేనేదో కలివె ముల్లో, చీకుతుమ్మ కంప ముల్లో యిరిగుంటదనుకొంటిలే..." చెప్పాడు

"రేగుముల్లా..."

మొలతాటికున్న పిన్నీసు తీసి ఆమె పాదాన్ని తన మొహం దగ్గరగా తెచ్చుకొని సున్నితంగా చర్మాన్ని తొలవసాగాడు.

అంతలో గోవిందమ్మ మళ్లీ అక్కడికొచ్చింది.

"నోటబట్టి పీకుతవా యేందిరా నా బట్టా!" అంది శివుని భంగిమ చూసి.

"అంతలావు ముల్లు కాదులే... రేగు ముల్లు..." చెప్పాడు.

"అంటే... లావు ముల్లయితే పళ్లతో పీకుతాడేమో!" ఒళ్లు జలదరించింది గౌరికి.

పిన్నీసు మొలికి చర్మంలోకి గుచ్చుకొంటోంది.

కొంత చురుకు మనిపించినా ఏదో పారవశ్యం.

ఒక నెత్తుటి బొట్టు కారినా మరేదో తన గుండెల్లోకి చేరిన అనుభూతి.

"అందుకేవ్వా! మల్లల్లేకి దిగొద్దని సెప్పిందీ" శివుడన్నాడు.

"దించగాకు దించగాకు. గోముగా సాక్కొవాల్లే...." గోవిందమ్మ అంది.

ఆమె మామూలుగా అందో, వ్యంగ్యంగా అందో అర్థం కాలేదు గౌరికి.

చుట్టుపట్ల పొలాల్లో జనాలకు యీ తతంగమంతా కనిపిస్తూనే వుంది. పని వదిలేసి వాళ్ల వద్దకు ఎవరూ రాలేదు గాని- అలసట ఎరుగకుండా పని జరిగేందుకు వాళ్లకో హుషారైన కథ దొరికింది. దాన్ని గురించి తమాషా కథనాలూ... ఎగతాళి మాటలూ... ఎకసెక్కపు వ్యాఖ్యానాలు...

మామ వరసైన తోటాకు రామయ్య చేని గట్టుదాకా వచ్చాడు... శివుణ్ణి పరామర్శించడానికన్నట్లుగా "ఏమోయ్ మల్లల్లో కంపసెట్లు పీకడాని కొచ్చినావా? మాయమ్మి కాల్లో కంపముల్లులు యేరడానికి వొచ్చినావా? " అన్నాడు.

"ఏం జెయ్యాల మామా! నీ బిడ్డ పరమ సుకుమారి అయ్యే..." అన్నాడు శివుడు నవ్వుతూ.

"తెలుసుగదంటరా నాయాలా! అట్టాంటి

పిల్లన్దెచ్చి కంపసెట్లల్లో దించుతావు గదా! జాగర్తగా సూసుకోవాలోయ్" అన్నాడు రామయ్య.

గౌరికేసి చూస్తూ "సదుకున్నెమ్మ. టౌన్లో పుట్టి సుకుమారంగా పెరిగిన మాయమ్మని బురద మల్లల్లో దించడానికి బుద్ధిలేదంటరా, నీయ్యక్క" అని నవ్వుతూ వెళ్లాడు.

శివుడు కూడా నవ్వాడు.

అరికాలిలో జివ్వు జివ్వు మంటూ ముల్లు గాయం సన్నగా లాగుతూనే వుంది గౌరికి.

మధ్యాహ్నమయ్యే లోపే పేగుల వెంట రవరవ ఆకలి మొదలైంది.

**అన్నం పంచుకు తినటంలో గల అపురూపమైన మధురానుభూతి ముందు ముల్లు బాధ ఎప్పుడో ఆవిరైంది**



ఒంటిగంట దాటిందేమో అనుకొంది.

ఎండను చూసి పన్నెండు గంటలు కూడా కాలేదని శివుడు చెప్పటంతో ఆశ్చర్యపోయింది.

ఇంత తొందరగా ఆకలవటం వింతగా వుంది.

తుమ్మచెట్టు నీడలో ఎదురెదురుగా కూచున్నారు ఇద్దరూ.

క్యారియర్ విప్పి చెరో గిన్నె తీసుకొన్నారు.

"ఇంత అన్నమా! కొంత తీసుకో బావా!" అంది గౌరి.

నవ్వాడు అతను, "ఎక్కువ కాదులే..." అంటూ.

"తినలేను..."

"మిగిల్తే నేను తింటాలే..."

కళ్లెత్తి అతనికేసి తదేకంగా చూసింది.

మాటల సందట్లో క్యారియర్ అన్నమంతా ఎప్పుడయిపోయిందో ఆమెకే అర్థం కాలేదు.

ఎక్కువవుతుందనుకొన్న అన్నం కాస్తా తనకు చాలదన్నట్లుగా తోస్తోంది. కడుపులో మరికొంత ఖాళీగా వుంది.

మూడో గిన్నె అన్నాన్ని కలిపి పిడచలు చేసి, మొహమాటం కొద్దీ ఆమె వద్దంటోన్నా అందించాడు.

సిగ్గుపడి అటుఇటు చూసి చేత్తో అందుకొంది.

రెండవ పిడచ ఆమె చేతికి అందించలేదు.

నోటికి అందించాడు.

భయంభయంగా చుట్టూ చూసి గబుక్కున నోరు తెరిచింది.

చుట్టు పక్కల వాళ్లు ఎవరైనా చూస్తారేమోనని బిడియంగా వుంది. అతణ్ణి గేలి చేస్తారేమోనని చింతగా వుంది. ఓ మధురానుభవం చేజారిపోతుందేమోనని మరోవైపు దిగులుగా వుంది.

ఇన్ని భావాల మధ్య మరో పిడచను నోటితో అందుకొంది. "ఏయ్... వేలు... వేలు..." శివుడు చిన్నగా అరిచేసరికి ఉలిక్కిపడుతూ నోరు తెరిచింది.

ఇద్దరూ ఒకటే నవ్వులు

అన్నం పంచుకు తినటంలో గల అపురూపమైన మధురానుభూతి ముందు ముల్లు బాధ ఎప్పుడో ఆవిరైంది.

"ఎంత అన్నం తిన్నాను బావా!" ఆశ్చర్యంగా అంది.

"అంతా నువ్వు తినలేదులే..."

నొసలు ముడేసి చూసింది.

"పొలం గెట్లమీద కూకొని మనం మింగిన తిండిలో సగమే మనం తిన్నెట్టు లెక్క. మిగతా సగం ఈ గాలీ, ఎండా, చెట్టు నీడా తినుంటాయి" అన్నాడు. "చేలగెట్లమీద ఎవురికైనా కడుపెక్కువైతది..."

నిజమేననిపించింది గౌరికి.



శుభప్రదమైన

వస్త్రాలకు...

పెట్టింది పేరు

# "తుమ్మిడి బ్రదర్స్"

వివాహ వేడుకల

కంచిపట్టు,

హై ఫ్యాన్సీ,

గద్వాల్ చీరలపై

## గొప్ప తగ్గింపు ధరలు







**తుమ్మిడి వస్త్రాలు - సౌభాగ్య చిహ్నాలు**

---

అన్ని రకముల రాజస్తాన్ మార్బుల్స్
మరియు గ్రానైట్స్ అతి తక్కువ ధరలకు
లభించే ఏకైక మార్బుల్ వరల్డ్



చతుర 30 వసంతాలు

అందుకనేనేమో తను వద్దంటోన్నా మరోగిన్నె అన్నం ఎక్కువ పెట్టిం చాడు. కండువా నేల మీద పరచుకొని వెల్లకిలా పడుకొన్నాడు శివుడు. తనూ చెంగు పరచుకోబోతుంటే తన పక్కకు ఆహ్వానించాడు. అతని పొట్టలో వొదుక్కొని పడుకొంది గౌరి.

చుట్టుపక్కల చేల వాళ్లు చెట్టు నీడకు వద్దామనుకొన్నారు గాని చెట్టుకింద దృశ్యం వాళ్లకు కొత్తదిగా అన్పించి, అక్కడికి వెళ్లేం దుకు సిగ్గుగా తోచి మరో చోటికి సర్దుకొ న్నారు.

అర్ధగంట తర్వాత లేచి కూచున్నాడు శివుడు.

ఎదురుగా కర్ర వూతేసుకు నిల్చుని ఉంది గోవిందమ్మ.

శివుడు తనకేసి చూడగానే మూతి మూడు వంకర్లు తిప్పి తల ఓ వైపుకు విసరి వెనుదిరిగింది ఆమె.

శివునికి అర్థమైంది.

నవ్వులోంచే ఓ నిట్టూర్పు నిగిడించి గౌరి కేసి చూశాడు.

హాయిగా నిద్రిస్తోంది ఆమె.

మెల్లిగా లేచి పంచె ఎగగట్టి మడిలోకి దిగాడు.

ఓ గంటసేపు హుషారుగా పన్జేసింత ర్వాత ఏదో అనుమానమొచ్చింది అతనికి.

గౌరికేసి పరిశీలనగా చూశాడు.

అతనూహించినట్టే ఎండపొడ ఆమె మీదకు పాకుతోంది. పొద్దు పడమటికి వాలటం వల్ల చెట్టు నీడ ఆమె మీంచి మెల్లగా తొలగిపోతోంది.

కాళ్లు కడుక్కొని గట్టెక్కాడు.

మొలకగడ్డి మీద పడుకొని ఆదమరచి నిద్రబోతుంది ఆమె. రాత్రి నిద్రలేమి, అల సట తాలూకు నీడలు మొహమ్మీంచి ఇంకా కరగిపోలేదు.

అతనికి సిగ్గుతో కూడిన జాలేసింది.

వంకదాకా వెళ్లి నాలుగు వాయిల మండల్ని విరిచి, రెమ్మల్ని చెలగి పొడవాటి మెల్లెలుగా చేశాడు.

తడిచి నానిన నేలలో ఆమె చుట్టూ మెల్లెలు దిగజెక్కాడు. కట్టుకున్న అడ్డపం చెను విప్పి నాలుగు కోపుల్ని మెల్లల చివ ర్లకు ముడేశాడు.

ఆమె పైన ఇప్పుడు నీడనిచ్చే పందిరి తయారైంది.

తృప్తిగా చూసి తన పనిలోకి వెళ్లాడు.

మరో గంటగ్గానీ గౌరికి మెలకువ రాలేదు.

ఏవో మాటలు సన్నగా చెవుల సోకిన ట్లయి కళ్లు తెరిచింది. తనపైన దోమ తెర లాంటిది కన్పించి ఒక్కక్షణం అయోమ యంగా చూసింది తనెక్కడుందో అర్థంగాక.

"ఇదో...యీ గొంగడి తీసప్పో నాయినా!"

"ఎందుకూ? "

"సెట్టు కొమ్మకు ఉయ్యాల గట్టు. ఆయ మ్మను ఉయ్యాల్లో ఉండబెట్టు. పెద్ద పగ్గం దెచ్చి ఉయ్యాలకూ నీ నడుముకూ కట్టుకో. పనిజేస్తా నువ్వొంగి లేసినప్పుడంతా ఉయ్యాల ఊగుతుంటాది..."

మాటలతోటి తనమీద రెపరెపలాడే నిర్మాణం కూడా అర్థమైంది గౌరికి.

లేచి కూచుంది.

పక్క చేలల్లో రైతులు గేలి పట్టిస్తున్నారు శివుణ్ణి. బనియన్ డ్రాయర్ మీద వరిమ డిలో పన్జేసుకొంటోన్న అతని మీద వ్యంగ్యా స్త్రాల్ని ప్రయోగిస్తున్నారు.

వాటి కేంద్ర బిందువు తనే కావటం ఆమెకు సిగ్గుగా అన్పించింది. రైతులు తమ తమ పొలాల్లోకి వెళ్లగానే గట్టు మీదకొచ్చి కూచుని శివుని కేసి అదేపనిగా చూడసా గింది.

సాయంత్రం వీధిలో కనబడగానే కాలు దువ్వుతూ మీద మీదకు వచ్చాడు సుబ్బా

# నమ్మకమైన సంస్థలో ఓ ఇంటిస్థలం!



గుంటూరు, విజయవాడ, హైదరాబాద్‌లలో అభివృద్ధి చేయబడుతున్న అభినందన హౌసింగ్ వారి నూతన వెంచర్లలో సభ్యులు కండి!!

- **సాయి రాఘవ - II (సర్ ఆర్థర్ కాటన్ నగర్)**
  ఇబ్రహీంపట్నం - మైలవరం, చత్తీస్‌గడ్, యన్.హెచ్-221 రోడ్, కొండపల్లి ఇండస్ట్రియల్ పార్క్ సమీపములో, విజయవాడ.
- **సాయి గిరి (అయ్యప్ప నగర్)**
  గుంటూరు - హైదరాబాద్ స్టేట్ హైవే, వెంగళాయపాలెం సమీపాన, కైలాసగిరి దగ్గర, గుంటూరు.

త్వరలో అభినందన రియల్టర్స్ ఆధ్వర్యంలో ప్రారంభంగానున్న

* **అభినందన హోమ్స్**, లాం, గుంటూరు.

* **గోల్డెన్ రెసిడెన్సీ** * **డైమండ్ రెసిడెన్సీ** * **ప్లాటినమ్ రెసిడెన్సీ**

గొల్లపూడి, విజయవాడ.

**బుకింగ్స్ జరుగుచున్నవి**

మీ పెట్టుబడికి భద్రతతోపాటు
అనేక రెట్లు ఆదాయం పొందండి!!

KALYANI ADS, 98499 83669, 95



## అభినందన హౌసింగ్ ప్రైవేట్ లిమిటెడ్

* బసవరామ కాంప్లెక్స్, 8/2, అరండల్‌పేట, గుంటూరు-2. ఫోన్స్ : 0863-6641177, 6647799
* నవదీప్, చర్చి ఎదురుగా, బెంజ్ సర్కిల్, విజయవాడ. ఫోన్స్ : 0866-6628668, 6628778
* బందరు లాకులు దగ్గర, గవర్నర్‌పేట, విజయవాడ-2. ఫోన్స్ : 0866-6642428, 6642468
* 3వ అంతస్తు, యన్.వి.ప్లాజా, సాయిబాబాగుడి వీధి, పంజాగుట్ట, హైదరాబాద్. ఫోన్స్ : 040-66367441/43, 66825777

రెడ్డి- "చెట్టు నీయబ్బని సొమ్మా? - ఎవుర్నీ రానీ కుండా చేసినావంట..." అంటూ.

"నేనా...? నేనెందుకు రానియ్యనూ!" అయోమయంగా చూశాడు శివుడు.

"ఎట్ల వస్తరు? పట్ట పగలు మిట్ట మద్దేన్నం మీ ఆలుమొగుండ్లిద్దరూ కర్సుకొని పండుకొంటే ఎవురొస్తారూ? నీ కంటే సిగ్గు లేదు... వొచ్చేవాల్ల కన్నా సిగ్గుండదా?"

విషయం అర్థమైంది అతనికి

సిగ్గుతో కుంచించుకు పోతూ తలదించు కొన్నాడు.

సుబ్బారెడ్డి అదే ఊపు మీద రెచ్చిపోతోం టే - చుట్టు పక్కల జనం ఒకటే నవ్వులు.

అప్పుడు కలుగజేసికొన్నాడు శివునికి పెద నాన్న వరసైన రేగ్గాయల దుగ్గయ్య. "టౌను పిల్ల.... మాంచి బిగుమీదుంది.. వొచ్చి పైన బడ్తాంటే మావోడేం వద్దం టాడా? మొగుడు గాదూ!" అని.

"ఇదో మామా! మాయమ్మిని ఏమైనా అన్నేవంటే నేనొప్పు కోను. కడపలో మేం సూల్లేదా? ఇంట్లోంచి బైటకొచ్చేది గాదు. మాంచి సాంప్రదాయికు రాలు... యీ నాయాలి లోగుట్టు తెలీక నువ్వు మాట్లాడ్తుండావు. లోకుల ముంచే నాయాలు..." అన్నాడు సుబ్బారెడ్డి.

కొంతసేపు సుబ్బారెడ్డికి, దుగ్గయ్యకూ వాదన. దాని ముఖ్య ఉద్దేశ్యం కూడా శివుణ్ణి గేలి పట్టించటమే.

జనమంతా ఒక్కటే నవ్వులు.

* * *

వంచిన తలెత్తకుండా, అలుపు సొలుపు లేకుండా పనిచేసే శివుణ్ణి చూస్తోంటే ముచ్చ టేస్తోంది గౌరికి. అతని కండరాల మీద చెమట బిందువులు పొంగి ఎండకు చిరుమె రుపులు ప్రతిఫలింపజేస్తోంటే- అదేపనిగా చూడబుద్ధవుతోంది. శ్రమ ఎక్కువయ్యే కొద్దీ మెలిదిరిగి రాటుదేలే అతని కండరాల్ని అర చేతుల్తో తాకి తరించాలనిపిస్తోంది.

సాయంత్రం స్నానం చేసేటప్పుడు వీపు రుద్దుతూ అప్రయత్నంగానే జబ్బ కండరాల పైకి, ఎదలపైకి అరచేతుల్ని పాకించి కండ రాలతో ఆడుకొంటోంటే, అతను నిటారుగా అయి ఆమె కళ్ళల్లోకి కొంటెగా చూస్తూ



రెండు చేతులూ పైకెత్తి శరీరాన్ని అప్పగిం చేసరికి, ఆమె తేరుకొని సిగ్గుపడి ఇంట్లోకి పారిపోయింది. తనెందుకు అట్లా ప్రవర్తిం చానా అని ఆలోచిస్తే- స్వేద బిందువులు పొంగిన అతని వొంటి కండరాల నిగనిగలు ఆమె కళ్ల ముందు కదలాడి... అతని కండ రాల మీద తను వ్యామోహం పెంచుకొంది. తనకు తెలీకుండానే వాటిమీద మరులు పెంచుకొంది. కండరాలు పొంగిన అతని శరీరాకృతి తన ఎదలో బలమైన ముద్రే వేసింది. శరీరంలో ఎక్కడా అనవసరపు కొవ్వు పెరుగుదల లేకుండా ఎక్కడ పొంగా లో అక్కడ పొంగి, ఎక్కడ కృశిం చాలో అక్కడ కృశించి లోతుకు అతుక్కు పోయి గ్రీకు శిల్పంలా వున్న అతని శరీ రాన్ని అదే పనిగా చూడాలనిపిస్తుంది. 'మగాడి అందమంటే అదేనేమో' అని కూడా అన్పిస్తుంది.

ఆమెను బురద మళ్లల్లోకి అడుగు పెట్టనీ యటం లేదు శివుడు. పనిలో వేలు కూడా పెట్టనీయటం లేదు.

బురద మళ్లల్లోంచి గట్టెక్కగానే చెరువులోకి దిగి వొళ్లు కడు క్కొంటాడు అతను. ఆ సమయంలో పది బార్ల దూరం ఈది వస్తాడు కూడా.

ఆమె గట్టు మీద కూచుని అతనికేసి కళ్లార్ప కుండా చూడటం, ఈదేటప్పటి శరీర విన్యా సాల్ని తిలకించటం, ఒడ్డెక్కేటప్పుడు చేయ అందించటం, కండువా యివ్వటం, చుట్టుపట్ల ఎవ్వరూ లేకుంటే వొంటి తేమ తుడవటం చేస్తుందామె.

రెండవరోజు ఆమెను కూడా నీళ్లలోకి రమ్మని పిల్చాడు.

"నాకు ఈత రాదు"

"నేన్నేర్పుతా గదా!"

ఆమె సిగ్గుపడి పోయింది.

పొలాల్లోంచి ఎవరో వొకరు చెరువు కట్ట ఎక్కుతారని భయం ఓవైపూ, అతని చేతు ల్లో ఈత నేర్చుకోవాలనే తహతహ మరో వైపూ. ఆమె ఆలోచనల్ని పసిగట్టాడు శివుడు.

"ఎవ్వరూ రాని తావుకు పోదాం రా!" అంటూ ఆమెను వెంట బెట్టుకొని చెరువు కట్ట చివర అలుగు వద్దకు తీసికెళ్లాడు.

అలుగు ఇంకా పొర్లుతూ వుంది.

అక్కడ నీళ్లు లోతుగా లేవు.



అతని వెంట నీళ్లల్లోకి దిగబోతూ వుంటే వారించాడు. "చీరకట్టుతో ఎవరూ ఈత నేర్చుకోలేరు" చెప్పాడు.

"మరి... స్విమ్ సూట్ కావాలా!" ఆశ్చర్య పోయింది.

"చీర కాళ్లకు చుట్టుకుంటుంది."

"మరెలా? "

"చీర విప్పు..."

ఉలిక్కి పడుతూ అటు ఇటు చూసింది.

తనే చొరవగా ఆమె బొడ్డులో చేయి దూర్చి చీర కుచ్చెళ్లు వూడ్చాడు. చీర విప్పి కుప్పబెట్టాడు. లంగాను దోపి చెక్కాడు.

శరీరాన్ని అతనికి అప్పగించటం మినహా ఏమీ చేయలేకపోయింది. వివశురాలై అతని చేతుల్లో వాలింది.

"ఇక రా..." ఆమెను నీళ్లల్లోకి తీసికెళ్లాడు.

ఒళ్లంతా గిలిగింతలు పెట్టినట్లుంది.

శరీరమంతా అతని చేతుల్లోకి వదిలి నీళ్ల మీద కాళ్లు చేతులు ఆడించటం గమ్మత్తుగా వుంది.

"ఇంకాసేపు.... ఈ కొద్దిదూరం...." అంటూ బాగా చీకటి పడే దాకా నీళ్లల్లోనే వుండిపోయింది.

చీకట్లు వాళ్లకు సువిశాలమైన ఏకాంతాన్ని కల్పించాయి.

ఎవ్వరికీ దొరకని, ఏ అలజడీ లేని పురాతన మార్మిక ఏకాంతం. స్వర్గానుభవంతో రెండు శరీరాల్ని ఒకే శరీరపు అనుభూతిని ప్రసాదించే ఏకాంతం.

ఆ ఏకాంత ప్రశాంత జలకాలల్లో...

నీళ్లే హంసతూలికా తల్పంలా, తూగుటుయ్యాలలా, నులక మంచంలా, పచ్చిక పరుపులా, నీటి తుంపర్లతో తడిసే ఇసుక దిబ్బలా... ఆనంద లోకాలకు తెరచుకొనే రహస్య మార్గం వాళ్ల వశమైనట్లుగా తోస్తూ... అలసి సొలసి గట్టెక్కి... పారవశ్యపు అనుభూతితో బరువెక్కిన తలను అతని భుజాల మీద వాల్చి సగం దారి గడిచే దాకా తప్పటడుగులు వేస్తూ... ఆ అనుభవం తాలూకు మధురిమ రాత్రంతా అగరు ధూపంలా వెంటాడుతూ...

సాయంత్రమైందంటే చాలు చెరువుకేసి ఎగజూడటం, చీకటి పడేదాకా ఈత నేర్చుకోవటం, చీకటి పడిం తర్వాత శరీరాల్ని నానబెట్టి ఆరబెట్టుకోవటం...

మడి కయ్యంతా కంపచెట్లు పీకి ఏరేసి, కయ్యలో ఓ మూలగా కొద్దిపాటి నేలను పారతో తిరగేసి నారుమడి తయారుచేసి, విత్తనాల వడ్లు తెచ్చి నారుబోయటం వగైరా పనులన్నీ ముగిసే సరికి ఆమె బాగా ఈదటం నేర్చుకొంది.

మెట్ట చేలు ట్రాక్టర్‌తో సేద్యం చేయించాడు.

మరో పదనుకు కంది, మిరప విత్తాలని అతని ఆలోచన. వేరుసెనగకు అదను తప్పింది. అందులోనూ దాని పెట్టుబడి జాస్తి. ఫలితం కళ్ల జూడటమంటే జూదంలో గెల్చినట్లే. వేరుసెనగ విత్తేంత ధైర్యం లేదు.

ఆరోజు సాయంత్రం చీకటి పడేముందు చెరువులో ఒక్కతే యీదుతోంది గౌరి. లోతు నీళ్లల్లోకి చొచ్చుకుపోయింది. అక్కడ పూటి మట్టి తెచ్చేందుకు మునకలు వేస్తోంది.

నీళ్లలోకి కాళ్లు చాపి దరి మీద కూచుని ఆమెకేసి తదేకంగా చూస్తున్నాడు శివుడు.

ఎక్కడో కడప టౌన్లో నైటీలు, పంజాబి డ్రెస్సుల వెనక శరీరాన్ని దాచుకొని గడప దాటి బైటకు రాకుండా ఇంట్లోనే మగ్గుతూ, దిగ్భ్రాంతిని గొలిపే చలనశీలత ఒక్కటి కూడా లేకుండా జీవించే ఆ పిల్ల ఇప్పుడు బర్రెపడ్డలా చెరువు నీళ్లన్నిట్నీ అల్లకల్లోలం చేయటం... అతనికే వింతగా అన్పిస్తోంది.

ఎంత సులభంగా యిమిడి పోయిందనీ

మహబూబ్‌నగర్ జిల్లా ప్రజలకు 2007
నూతన సంవత్సర శుభాకాంక్షలు

# SVS

హాస్పిటల్ మెడికల్ కాలేజ్
డెంటల్ హాస్పిటల్ కాలేజ్
మహబూబ్‌నగర్ - 270036, 270603






అందరికీ అందుబాటులో

## అతి తక్కువ ఖర్చుతో అత్యాధునిక వైద్యసేవలు

★ 24 గం॥లు అత్యవసర సేవలు ★ అన్నిరకముల ఆరోగ్య పరీక్షలు ★ బ్లడ్‌బ్యాంక్ మరియు అంబులెన్స్ సౌకర్యం కలదు ★ మానవతా దృక్పదముతో నైతిక విలువలతో కూడిన నిరంతర వైద్య సేవలు అనుభవజ్ఞులైన వైద్య నిపుణులచే అందించబడును.

చూస్తుండగానే 'చతుర'కు ముప్ఫైఏళ్లు రావటం, నవలల పోటీ నిర్వహించటం ముదావహం. రెండు వడపోతల్లో ఎంపికయిన నవలల్ని ముగ్గురం పరిశీలించి బహుమతులు ఏకగ్రీవంగా నిర్ణయించాం. ముగ్గురమూ 23 నవలలు సంపూర్ణంగా చదివాం.

# వాస్తవిక చిత్రణకు అందలం

– కొలకలూరి ఇనాక్

పాత కథ, పాతగా పాత్రలు, పాత పద్ధతులు ఉన్న నవలలు ప్రాధాన్యం పొందలేదు.

వానల్లేని, పంటలు పండని భూములున్నా రైతు జీవితం కడగండ్లు యధాతథంగా, ప్రత్యామ్నాయంగా, కష్టాలకతీతంగా చూపుతూ వచ్చిన నవలలు ఆసక్తికరంగా ఉన్నాయి. నిరాశా నిస్పృహల రైతు, స్త్రీ, దళిత, గిరిజన జీవితాలలో ఆశను, చైతన్యాన్ని కలిగించే నవలలు మేలుగా కనిపించాయి.

స్త్రీ, దళిత, గిరిజన జీవితాన్ని విభిన్న కోణాలలో చిత్రించిన నవలలు అభ్యుదయకరంగా కనిపించాయి.



నవలల పోటీ న్యాయనిర్ణేతలు డి.వెంకటరామయ్య, కొలకలూరి ఇనాక్, కాత్యాయని విద్మహే

వాస్తవికతా దృష్టితో జీవిత యధార్థ్యం చిత్రించిన, నూత్న ఇతివృత్తంతో ఉన్న నవలలు ముందుకు వచ్చాయి. రచన ఆసక్తికరంగా, సరళంగా, సాఫీగా ఉండటం మేలగుణంగా కనిపించింది. పాత కథే అయినా రచన కొత్తగా పాత్ర చిత్రణ నూతనంగా, ఆహ్లాదకరంగా ఉన్న నవలలు ప్రముఖంగా నిలిచాయి.

రచన ఎంత బాగున్నా పాత వస్తువు, ఆదర్శ ప్రేరణం, ఆశయ ప్రతిఫలనం కంటే వాస్తవికతా దృష్టి ఉన్న నవలలు పటిష్టంగా కనిపించాయి.

అభూతకల్పనలు, అసహజ సంఘటనలు, సన్నివేశాలు, పాత్రలు కథనం ఉన్న నవలలు బహుమతుల పరిధిలోకి రాలేదు. రాయలసీమ, తెలంగాణా జీవితం చిత్రించిన నవలలు నూత్న దృష్టికోణం ప్రతిబింబించాయి. ఈ మాండలికాలు నవ

చతుర 30 వసంతాలు

లల్లో బలంగా అభివ్యక్తమై వాస్తవికతను సంతరించుకొన్నాయి.

ఈ పోటీలో మేం చదివిన వాటిలో సగానికి పైగా మంచి నవలలున్నాయి. నాలుగైదు గొప్ప నవలలున్నాయి. కాని నాలుక్కాలాల పాటు నిలిచే విశిష్ట నవలలున్నాయని చెప్పే వీలు లేకుండా పోయింది.

చతుర నిర్వహించిన పోటీ కారణంగా కొన్ని మంచి నవలలు చదివే అవకాశం పాఠకులకు కలగటమే శుభపరిణామం. ✦

# వస్తు రూపాలకు సమన్వయం అవసరం

*-డి. వెంకట్రామయ్య*

తుది పరిశీలనకు వచ్చిన నవలలన్నీ ఆసాంతం, ప్రతి అక్షరం చదివాను.

చదివి తీరాల్సిన వస్తు ప్రయోజనం, చదవకుండా వదల్లేని శిల్ప నైపుణ్యం- ఈ రెండు లక్షణాలూ సమతూకంలో ఉన్న రచనలు చాలా తక్కువగా ఉన్నాయి.

ఈ మధ్య అంతో ఇంతో బాగా రాస్తున్న వాళ్లలో చాలా మంది ఎంతో కొంత ప్రయోజనం కలిగిన వస్తువునే ఎంచుకుంటున్నారు. ప్రజల్లో అధిక సంఖ్యాకుల సమస్యలనీ, కష్టాలనీ, కడగళ్ళనీ, బాధల్నీ, భయాలనీ, ఆవేదనలనీ, ఆక్రోశాలనీ, ఆకలినీ, అశాంతినీ చిత్రించే విషయాలే రాస్తున్నారు... మంచిదే. అయితే- సాహిత్య రచనకి, ముఖ్యంగా సృజనాత్మక సాహిత్య రచనకి పరిపూర్ణత కలగాలంటే వస్తువు ప్రయోజనం ఒక్కటే సరిపోదు. ఆ వస్తు ప్రయోజనాన్నీ ప్రాధాన్యాన్నీ పాఠకుడు అర్థం చేసుకోగల, అవగతం చేసుకోగల, ఆస్వాదించగల రీతిలో ఆ రచన సాగాలి. అందుకే రచయితకి శైలి, శిల్పంలాంటివి అవసరమౌతాయి. వస్తువు ఎంత ముఖ్యమో రూపమూ అంతే. కావాలంటే వస్తువుకి కాస్త పెద్దపీట వెయ్యొచ్చు. అంతమాత్రాన రూపానికున్న ప్రాధాన్యాన్ని పట్టించుకోకుండా ఉండలేం. వస్తువుకీ రూపానికీ సరయిన సమన్వయాన్ని సాధించగలిగినప్పుడే అది అన్నివిధాలా మంచి రచన అనిపించుకుంటుంది. అదిగో అటువంటి నైపుణ్యాన్ని సక్రమరీతిలో సమర్పించగలిగిన రచనలు తక్కువగా ఉన్నాయి.

ఉన్నవాటిలో తరతమ భేదాలను బట్టి 'ఇది బాగుంది', 'ఇది మరికాస్త బాగుంది' అనుకోవటమే తప్ప, 'ఇది అన్నివిధాలా బాగుంది', 'ఇది చాలా గొప్ప నవల' అని ఢంకా బజాయించి చెప్పగలిగిన రచన ఏదీ ఈ పోటీలో నాకు కనిపించలేదు. ఇది నాకు బాధ కలిగించిన విషయం.

ఆకలి, అవిద్య, అణచివేత, వెనకబాటుతనం ఎక్కడ ఎక్కువగా ఉంటాయో ఆ ప్రాంతంనించే మంచి రచనలు వస్తాయనేది నా నమ్మకం. ఈ పోటీ నవలలు నా నమ్మకాన్ని బలపర్చాయి.

రాయలసీమ, తెలంగాణ ప్రాంతాల్లోని రైతులు, రైతు కార్మికులు, చేనేత కార్మికుల వంటి బలహీన, బడుగువర్గాల దుస్థితిని చిత్రించే రచనలే తుది పరిశీలనకి వచ్చిన

నవలల్లో అధిక భాగంగా వున్నాయి. అయితే వస్తు ప్రయోజనంతోపాటు వస్తు వైవిధ్యం కూడా అవసరమే. బహుమతుల నిర్ణయంలో ఈ అవసరాన్ని కూడా దృష్టిలో ఉంచుకోవడం జరిగింది. ఈ నవలలన్నీ చదవటంలో నన్ను బాధ పెట్టిన మరో అంశం... భాషా దోషాలు. ఈ నవల బాగుంది అనుకున్న సందర్భాల్లో కూడా ఈ దోషాలు తప్పలేదు. మంచి రచన అనిపించుకోడానికి భాషా పాండిత్యం అక్కర్లేదు. మామూలు భాషలోనే మామూలు మాటలే తప్పుల్లేకుండా రాయగలిగితే చాలు. ✦

# సంక్లిష్ట జీవన చిత్రణ

**– కాత్యాయనీ విద్మహే**

చతుర నవలల పోటీలో తుది తీర్పు కొరకు నిలిచిన ఇరవై మూడు నవలలను పరిశీలిస్తే- సమకాలీన సామాజికార్థిక రాజకీయపరిణామాల నేపథ్యంలో ఆటుపోట్లకు గురి అవుతూ విధ్వంసానికి లోనవుతూ సాగుతున్న మహా మానవ జీవన సంగ్రామాన్ని ఇతివృత్తంగా చేసుకొన్న నవలలు ప్రధానంగా కనిపిస్తాయి. ఈ సంగ్రామానికి యుద్ధభూమి ఈనాడు రాయలసీమ, తెలంగాణ, ఆదివాసి ప్రాంతాలు. అభివృద్ధి విధానాల వెలుగు నీడల తత్త్వాన్ని పట్టుకొనగలిగిన నిశిత పరిశీలన, సూక్ష్మ దృష్టి, ముఖ్యంగా బాధిత ప్రజాసమూహాల పట్ల రచయితలకు ఉన్న ఆర్తి ఈ నవలలను శక్తివంతం చేశాయి. ప్రాంతీయ వర్గ భాషాభివ్యక్తిరీతులు వీటికి సహజ సుందరతను చేకూర్చాయి.

జీవితమే ఒక పోరాటం. పోరాటాలే మనిషిని రాటు దేల్చి వజ్ర సదృశం చేసి విలువను పెంచుతాయి. అదే సమయంలో మహా సున్నిత మానవీయ సంస్పదనతో గొప్ప సంస్కారంతో ఎదిగేలా చేస్తాయి. జీవన సౌందర్యాన్ని ఆవిష్కరిస్తాయి. అందు వల్లనే ఈ నవలల్లో మనుషులందరూ అసహాయ శూరులుగానే కనిపిస్తారు.

ప్రేమ పేరుతో స్త్రీలపై జరుగుతున్న మారణకాండ సమకాలీన సందర్భంలో ఒక ముఖ్యాంశం. దానిని కేంద్రంగా చేసుకొని ఉరిశిక్ష గురించి చర్చలు కూడా జరిగాయి. దళిత ఉద్యమం ఇచ్చిన ఆత్మగౌరవ చైతన్యం ఒకటి ఉన్నది. ఈ అంశాలపై నవలేతివృత్తాలను నిర్మించారు రచయితలు. దళిత నవలలు రెండు వచ్చాయి కానీ దళిత జీవన వైరుధ్యాలను, సంఘర్షణలను విం గి లి న సామాజిక పరిణామాలతో కలిపి చూచి విలువ కట్టగలిగిన కృషి నవలారంగంలో ఇంకా జరగవలసే ఉంది. స్త్రీవాద చైతన్యంతో ఒక నవల అయినా రాకపోవటం లోపంగానే ఉంది.

జీవితం ఎంత సంక్లిష్టమైందో, సమగ్రమైందో, వైవిధ్యభరితమైందో నవలలో జీవితం కూడా అంత సంక్లిష్టం, అంత సమగ్రం, అంత వైవిధ్యభరితం అయివుండాలి. అలా అయితేనే ఆ నవల ఇతిహాస స్థాయిని అందుకొంటుంది. 'చినుకుల సవ్వడి,' 'ఆకుపచ్చని గాయం', 'జీవన శోధన' నవలలు ఆ వరుసలో ఉన్నాయి. ✦

యీా పల్లె వాతావరణంలో! ఎంత గమ్మత్తుగా అతుక్కుపోయిందనీ యీ బీద జీవి తంలో!

ఆలోచనల్లో ఉండగానే సన్నగా మేకల అరుపులు. కట్ట కిందుగా వెళుతున్నాయి కాబోలు.

తలను నీళ్లపైకి తెచ్చి ఊపిరి పీల్చుకొని మళ్లీ మునుగుతోంది ఆమె.

అలసిపోకుంటే పూటిమట్టి తెచ్చేట్టే వుంది.

తను వెళితే గాని ఆమె ప్రయత్నం ఆపదు.

తన చేతుల్లోనో, వీపు మీదో కొంతసేపు సేద దీరితేగాని నీళ్లల్లో విద్యుత్తును పుట్టించే హుషారు రాదు.

నీళ్లల్లోకి జారాలని పూనే లోపలే...

ఉన్నట్టుండి గావుకేక..

"ఓయమ్మో సచ్చెనే... సెర్లో దూకిం దర్రో... మునిగిపోతాందే.. ఓర్నాయనో... కర్రెడ్డులోల్ల కోడలు సెర్లో దూకింది రాండ్రో..."

ఉలికిపాటుగా తలెత్తాడు శివుడు.

మేకల గురయ్య కొడుకు కేకలేసికొంటూ కట్టమీద అడ్డంగా పరుగెడుతున్నాడు.

తను చెట్టు చాటున కూచోవటం వల్ల వాడికి కన్పించలేదు కాబోలు.

గౌరి ఒక్కతే నీళ్లల్లో మునుగుతూ తేలుతూండటం చూసి నిజంగానే చెరువులో దూకి చచ్చేందుకు ప్రయత్నిస్తోందని అపోహ పడ్డాడు.

అప్పటికే బిత్తరపోతూ దరికేసి ఈదుకొచ్చింది గౌరి.

ఆమెకు చేయందించి గట్టెక్కాడు.

ఆమె ఒంటిమీదనే లంగా పిండుతూ "పిల్లనాకొడుకు బెదిరినట్టుండాడు. నువ్వు నిజంగానే చచ్చేందుకు చెర్లో దూకినావనుకున్నెడు. వాడు ఊరిదాకా అరచుకొంటానే పోతాడు" చెప్పాడు.

దానివల్ల ప్రమాదమేమిటో ఆమెకు అర్థం కాలేదు. పరాయి మగాడొకడు తన్ను చూశాడనే బెరుకు మాత్రమే ఉంది ఆమెలో.



"ఈ సంగతి ఊర్లో వాల్ల చెవినబడితే ఇబ్బందే..."

"ఏమీ?"

"నిన్ను చెరువులోంచి ఎల్లేసేందుకు అందరూ కట్టగట్టుకని వస్తారు" చెప్పాడు.

"నిజమా!" నమ్మలేనట్లుగా చూసింది.

ప్రమాదం తాలూకు దృశ్యాలు కొంతలో కొంత అర్థమవుతున్నాయి

"ఇప్పుడెట్లా బావా?" అంది.

"ఎదురెక్కి పోవాల్సుందే..." చెబుతూ ఊరికేసి చూశాడు.

ముసురుతోన్న చీకట్లలోంచి కుర్రాడి కేకలు ఊరికేసి ఎగిసి పోతూనే వున్నాయి.

ఆదరాబాదరా చీర చుట్టుకొంది ఆమె.

కుర్రాడు వదిలేసిన మేకల్ని ఇంటి దారికి మళ్ళిస్తూ వూరికేసి కదిలారు వాళ్లు.

అంతలో జువ్విమాను చేలల్లోంచి గొంతు చించుకొనే కేక. "ఒరే అనుమంతూ! శివుని పెండ్లాం సెర్లో దూకిందెంట. బెన్నే కట్టెక్కరా!" అంటూ

"ఏ పక్క దూకిందెంట పెదనాయినా?"

ఏ పక్కనోరా! సెరువంతా పారజూడు..."

ఇంకా ఇళ్లకు వెళ్లకుండా అక్కడక్కడా పొలాల్లోనే వున్న జనం ఒకర్నొకరు హెచ్చరించుకొంటూ చెరువుకేసి పరువెడుతున్నారు.

జరగబోయే సన్నివేశాన్ని ఊహిస్తోంటే సిగ్గుగా అన్పించింది గౌరికి. వాళ్లకు ఎదురుపడి సంజాయిషీ ఇచ్చుకోవటం లజ్జగా తోచింది.

"ఇంకోదారిన ఊర్లోకి పోతే..." ప్రశ్నార్థకంగా చూసింది.

"ఊర్లో మొగోల్లంతా సెర్లో దూకుతారు. ఆడోల్లంతా లైట్లు పట్టుకొని చెరువు కట్ట

మీద ఏడుస్తా కూకుం టారు..."

"ఎందుకూ?"

"నువ్వు సెర్లోబడి మునిగిపోయినావని... నీ శవం కోసం చెరువు నీల్లన్నీ తిరగెయ్యందిగాని యింటికి రారు..."

మరేమీ మాట్లాడలేదామె.

అంత పెద్ద సంఘటన జరుగుతుందని ఆమెకు నమ్మకం కలగటం లేదు.

తామున్న వీధికి అటుఇటు రోడ్డు మీద ఎన్నో ప్రమాదాలు జరిగుంటాయి. వాటిని గురించి వినటం తప్ప గడప దాటి పోయిన వాళ్లు చాలా తక్కువే.

శివుడు కొంత కల్పించి చెబుతున్నాడు కాబోలు.

పదిబారలు కూడా నడవక ముందే వగరుస్తూ పరుగుల మీద కట్ట ఎక్కుతోన్న హనుమంతు కన్పిం చాడు.

"ఒరే ఒరే... చెర్లో దూక లేదు. బావిలో పడలేదు లేరా! కాళ్లు కడుక్కోవడా నికి చెరువులో దిగి కాలుజారింది. గుడ్డలు తడిసినాయి. నేనక్కడే వున్నాన్రా! నన్ను చూడక పిల్లనాయాలు కేకలేస్తా పోయిం డుగాని... కట్టదిగి రారా..." అరచి చెప్పాడు శివుడు.

హనుమంతు ఆగిపోయాడు.

తన కళ్లెదురుగా వున్న ఆలుమగళ్లను చూసి నిర్ధారణ చేసికొన్నాడు.

"గాడ్దె కొడుకు. ఊరంతా గందరగోలం జేస్తాడే..." అంటూ మేకల పిల్లోన్ని తిట్టి "మీరు బెన్నే ఎదురెక్కి పొండి..." చెప్పాడు.

ఊరి గమిల్లోకి వెళ్లేసరికే గలగలమని శబ్దం.

ఒకర్నొకరు హెచ్చరించుకోవడాలూ, ఏడుపులూ, మూలుగులూ, గూ...బే...లు, పరుగెత్తే అడుగుల చప్పుళ్లు... టార్చిలైట్ల, చార్జింగ్ లైట్ల వెలుతుర్లూ...

హనుమంతు కేకలేసి చెప్పాడు.

అయినా వస్తూనే వున్నారు జనం.

శివుణ్ణి, గౌరిని చూసింతర్వాత ఆగిపోయారు.

అంతమంది జనాన్ని చూసి గుండె జల దరించింది గౌరికి. నోట మాట రాలేదు. వాళ్లంతా తనకోసమే. తన క్షేమాన్ని ఆశించే



వస్తున్నారనే విషయం ఆమె ఎదను కరిగించింది. తోటి మనిషి పట్ల అంతగా స్పందిస్తోన్న వాళ్ల హృదయ నైర్మల్యం ఆమెలో అంతులేని భావావేశాన్ని కలిగించింది. వాళ్ల మధ్య ఇంకా సజీవంగా నిలిచివున్న మానవ సంబంధాల్ని చూసి చలించిపోయింది. ఆమెకు తెలీకుండానే గుండెగోడలు జల్లుమన్నాయి. ముక్కుపుటాలు వొరుసుకుపోయాయి. కళ్లు ధారాపాతమయ్యాయి.

ప్రమాదం జరగనందుకు అందరికీ సంతోషంగా వుంది.



ఏడుస్తూ వచ్చిన ఆడవాళ్లు కాస్తా తమ ఏడుపుల్ని మేకల పిల్లాడిపైకి తిట్లుగా మార్చారు.

ప్రమాదమనుకొన్నది కాస్తా ప్రమోదంగా మారటం వల్ల అందరి హృదయాలు తేలికయ్యాయి. విషాదంగా వచ్చిన జనం వినోదంగా వెనుదిరిగారు. జరిగిన సంఘటనను హాస్య ప్రహసనంగా మలచుకొన్నారు.

రేత్రికే అదో పెద్ద నవ్వులాటగా మారిపోయింది.

ఎవరినోట విన్నా అదేమాట... అదే కథ... చర్చించుకోవటం, నవ్వుకోవటం... ఊరందర్నీ అమాయకుల్ని చేసిన ఆ సంఘటన నవ్వులాటగా మారింది.

ఊరిమొత్తాన్ని ఎర్రిబాగులోల్లను చేశాడు మేకల పిల్లాడు.

గౌరికయితే మొదట సిగ్గుగా అన్పించింది.

తనకోసం అన్ని హృదయాలు చలించటం



చతుర 30 వసంతాలు

చూసింతర్వాత కదిలిపో యింది.

ఏడ్చుకొంటూ పరుగె త్తారుట.

మొగోల్లను తొందరగా వెళ్లమని తిట్లకు తీసికొంటూ చీర కుచ్చెళ్లు కాళ్లకు అడ్డుపడు తోంటే కింద పడబోతూ పరుగెత్తారుట.

అత్త ఏడుపయితే వర్ణనాతీతమట. "నా కోడలే... ఓ యమ్మో! ఇంగెట్లనే... కోడ లే..." అంటూ గుండెలు బాదుకొని నేలబ డిందట.

ఆమె దగ్గర ఉన్న మరికొందరూ ఏడుపు లేనట.

గౌరికి ఓ వైపు ఇంకా సిగ్గరితనంగానే వున్నా, మనుషుల పట్ల పెరిగిన వ్యామో హం... మనిషితనం పట్ల ఏర్పడిన తిరుగు లేని నమ్మకం...

వీళ్లంతా నా వాళ్ళనే దగ్గరితనం.

నా కోసం కన్నీరు కార్చారనే ప్రేమ తత్వం.

ఆ సంఘటన జరిగిన తర్వాత ఊర్లో ఏ మనిషిని చూసినా తన రక్త సంబంధీకు ల్లాగా, తన యింటి వాళ్లుగా అనుభూతి. వీళ్లంతా తనకున్నారనే గుండె నిబ్బరం.

ఓ వారం రోజులపాటు ఆ సంఘటన ఊర్లో అందరి మధ్య నానుతూనే ఉండిపో యింది.

మాటల సందర్భంలో ఎవరైనా అబద్ధాలు చెప్పినట్లుగా తోస్తే "నువ్వు చెప్పేదంతా కర్రె ద్దులోల్ల కోడలు చెర్లో దూకినట్టుంది" అంటూ కొట్టివేయటం మొదలైంది.

అదో సామెతగా ఊర్లో బలపడసాగింది.

## 3

ఇంటి ముందర పేడనీళ్లు చల్లింది లక్షుమ్మ.

ఇంట్లోకెళ్లి టెంకాయ చిప్ప నిండా ముగ్గు పిండి తెచ్చి కోడలి చేత బెట్టింది. "ముగ్గు కర్ర బెయ్యిమ్మీ!" అంటూ.

అర్ధగంట కష్టపడి చుక్కల ముగ్గేసింది గౌరి.

ఇరుగు పొరుగు అమ్మలక్కలు వచ్చి ముచ్చటగా చూశారు.

ఒక బొక్కెడు సద్దికూడు తాగి బర్రెను విప్పుకొని పొలం వద్దకెళ్లింది లక్షుమ్మ.

బర్రె సూడిదయ్యింది. నెలరోజులకు అటో యిటో ఈనుతుంది. మంచి కులంగల్ల బర్రె. సొక్కమైన నారు. రెండేళ్లు పాలి స్తుంది. గత ఈత తాలూకు దున్న చింతపి క్కలా బలిసి ఉంది. దొంగ చేతికిచ్చినా రెండువేలమ్ముతుంది.

శివునికి కూడా పొద్దున్నే సద్దన్నం తినే అలవాటు.

గౌరికోసం దాన్ని కాస్తా మానుకున్నాడు.

గోధుమ రవ్వతో ఉప్మా చేయించటమో, బొరుగులతో ఉగ్గాని కలిపించటమో, పెసర బేడలు కలిపి పులగం వండించటమో, పూరీ... చపాతీ... దోసె... ఏదొక టిఫిన్ అమరేలా చూస్తున్నాడు.

టిఫిన్‌కూ పొలం పనికీ లంకె కుదరదనే విషయం రెండో రోజున్నే గ్రహించింది గౌరి.

టిఫిన్ చేస్తే తను ఇంటివద్దే వుండి అన్నమో, సంకటో చేసికొని మధ్యాహ్నానికి పొలంవద్దకు వెళ్లాల్సి వస్తోంది. ఉదయమే అన్నమూ కూర వండితే అతనితోటే వెళ్లా చ్చుగదా!

పులగమన్నం చేసున్నా బావుండేది. మధ్యాహ్నానికి అదే సర్దుకుపోయేవాళ్లు. బొరుగుల ఉగ్గాని చేసింది.

ఇంట్లో ఒంటరిగా కూచుంటే తల్లి గుర్తొ స్తోంది.

అమ్మను చూడాలనిపిస్తోంది.

తన్ను గురించి ఆమె ఎంత ఆందోళన పడుతోందో!

"మనవరాలా!" అంటూ వచ్చింది గోవిం దమ్మ.

# కృష్ణా, గుంటూరు జిల్లాల పట్టభద్రుల నియోజకవర్గం అభ్యర్థి



**Ln. మాజేటి పాపారావు,** క్రేన్ గ్రూప్

- భారతీయ జనతాపార్టీ రాష్ట్ర ట్రేడ్ & కామర్స్ సెల్ కన్వీనర్
- ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యమహాసభ పూర్వాధ్యక్షులు
- ఆచార్య నాగార్జున యూనివర్శిటీ సెనెట్ మెంబర్
- లయన్స్ క్లబ్ ఇంటర్నేషనల్ డిస్ట్రిక్ట్ 324-డి3 మాజీ గవర్నర్

---

**కృష్ణా, గుంటూరు జిల్లాల పట్టభద్రుల నియోజకవర్గం నుండి** త్వరలో జరుగబోవు శాసనమండలి ఎన్నికల సందర్భంగా మీ వద్దకు వచ్చినప్పుడు మీరు నాపట్ల చూపిన అభిమానం, ఆత్మీయతకు మీ అభ్యర్థిగా నన్ను ప్రోత్సహిస్తున్నందులకు, ఎంతోమంది పట్టభద్రులు పేరు నమోదు చేసుకొనుటకు సహకరించిన వారందరికి ***నా కృతజ్ఞతాభివందనాలు***

నిరుద్యోగ యువత ఉపాధికల్పనకు, అనునిత్యం ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి, కృష్ణా డెల్టా మోడరైజేషన్‌కు, కృష్ణా, గుంటూరు జిల్లాల సాంస్కృతిక, చారిత్రక ప్రాధాన్యతను పెంపొందించుటకు అవిశ్రాంతంగా కృషిచేయాలనే ధృడసంకల్పంతో **మీముందుకు వస్తున్న 'నన్ను' ఆశీర్వదించండి. నా ఆలోచనలకు స్ఫూర్తినివ్వండి**

-మీ **మాజేటి పాపారావు**

KALYANI ADS

SPACE DONATED BY



## క్రేన్ బెటల్ నట్ పౌడర్ వర్క్స్ ఏజెంట్స్ అసోసియేషన్

"ఏమవ్వా!" అన బోయి నాలిక్కరచుకొని వరసలు గుర్తు జేసుకొంటూ "ఏం జేజీ!" అంది.

"అత్త ఎల్లబారిపోయిందే? "

"ఆ..." అంది గౌరి.

"శివుడో..."

"బావ కూడా..."

"మరి నువ్వేమే? "

"అన్నం జెయ్యేద్దూ!"

"అన్నమా! అదేంది? " అమాయకంగా చూసింది.

"అదే... బువ్వో... సంగటో..."

"ఆ మాట జెప్పమ్మా! అన్నమో సున్నమో... అది మేం తినేది కాదులే..."

ఆమె వ్యంగ్యానికి నవ్వొచ్చింది.

"మరి... పొద్దున్నే ఏం తిన్నేరే? "

ఇంట్లోకెళ్లి ప్లేటులో బొరుగుల ఉగ్గాని పెట్టుకొచ్చి "ఇదో... ఇదీ... తిను.." అంటూ అందించింది.

పళ్లెంలో వస్తువుకేసి పరిశీలనగా చూసింది ఆమె. మునివేళ్లతో పట్టుకొని నలిపి "పురుగులు పురుగులు... ఎట్ట తింటారమ్మే? " అంది హాస్యంగా

కొంతసేపు నవ్వుకొన్న తర్వాత ఉగ్గాని నోటవేసుకొంది గోవిందమ్మ. చప్పరించి లొట్టవేసింది. "బాగుందే మనవరాలా! నువ్వే చేసినావా...? నువ్వే చేసింటవులే... మీయత్తకు ఈ వంటలన్నీ యాడ దెలుస్చయిలే- నాలుగుంటలు సంగటి గెలకడం తప్ప. కమ్మగా చేసినవమ్మా!" అంటూ మాటిమాటికి పెద్ద చప్పుడయ్యేలా చప్పరించి లొట్టలు వేస్తూ తన మెప్పుదల ప్రదర్శించింది.

ఆమె లొట్టల విన్యాసం గౌరికి ముచ్చటగా అన్పించింది.

"ఇంట్లో కొస్సా చూసినా. ముగ్గు బాగేసినవు. ముగ్గు నిండా పిట్టలే..." అంది ముసలామె.

"పిట్టలా? " అర్థం కాలేదు గౌరికి.

తను వేసింది చుక్కల ముగ్గేగాని బొమ్మల ముగ్గు కాదుగదా!

ముసలామెకు చూపులానక పలుకుతోందేమో!

వాకిలిదాకా అడుగులేసి బైటకు చూసింది.

చుక్కల ముగ్గే.

చూపులు తిప్పుకోబోతూ ఏదో దృశ్యం తన్నాకర్షించి...

నిజమే... ముగ్గునిండా పిచ్చుకలున్నాయి. ఊరబిచ్చుకలు... ముగ్గుపిండిని ముక్కులతో పొడుస్తూ... కిచకిచలాడుతూ... అందంగా ఆహ్లాదంగా...

అయినా ముగ్గుపిండిలో తినేందుకేముందని?

ఆమెకు అర్థంకాలేదు.

రాళ్లను పిండిగొడితే తయారైందే గదా ముగ్గుపిండి!

"ముగ్గు పిండికి ఏం కలిపినావే? సొద్ద పిండా? రాగిపిండా? " అడిగింది గోవిందమ్మ.

అప్పుడు తెలిసి వచ్చింది గౌరికి. పిచ్చుకలు ముగ్గును ఎందుకు పొడుస్తున్నాయో! ఏం ఏరుక తింటున్నాయో!

పిచ్చుకల కోసమే ముగ్గుపిండిలో రాగి పిండో, సజ్జపిండో కలపటం ఆమె హృదయాన్ని పులకరింపజేసింది.

ఉదయం లేచి కళ్లాపి జల్లి ముగ్గులేసినారంటే పిచ్చుకలకు ఆహారం అందించినట్లే లెక్క.

ఎంత గొప్ప అర్థముందనీ ఆ చర్యలో!

మరొక జీవి ఆకలి గురించిన స్పృహనే ఒక సాంప్రదాయిక అలవాటుగా చేసుకోవటంలో ఎంత దైవత్వముందనీ! ఎంతటి జీవకారుణ్యముందనీ!

మధ్యాహ్నానికి అన్నమే వండింది గౌరి.

# ఈ నవలను ఎందుకు ఎంపిక చేశామంటే...

క్షామభూమి కడప మండలంలో రైతు జీవితం చిత్రించిన నవల 'చినుకుల సవ్వడి'.

ఇది స్త్రీ పురుష సంబంధాలలో ప్రేమ ఆంతర్యం, మానవీయ దృష్టికోణం, దాంపత్య జీవన మాధుర్యం, వాస్తవికంగా, ఆరాధనాత్మకంగా, సుకుమారంగా చిత్రించిన నవల.

దీని రచన సరళంగా, ఆసక్తిజనకంగా, ఆహ్లాదకరంగా సాగి ఉత్సాహం, ఉద్వేగం కలిగించేట్టుగా ఉంది. మంచి భాష, పాత్ర చిత్రణ, అభివ్యక్తి, సన్నివేశాలున్న రచన ఇది. సౌజన్యం, సౌకుమార్యం, సహజీవన తాదాత్మ్యం గుండెలో ప్రతి ధ్వనులు చేసే నవల ఇది.

రాయలసీమనీ, ముఖ్యంగా ఆ సీమలోని పల్లె ప్రాంతాలనీ నేపథ్యంగా ఎంచుకున్న ఏ కథయినా, ఏ నవలైనా కరువు బాధల్నీ, కడుపు మంటనీ కన్నీటి వానల్నీ లేదా ఫాక్షనిజాల వికృత గాథల్నీ వినిపిస్తాయి. అవన్నీ నిజాలే అయినా, నాలుగేళ్ళ కరువు తర్వాతయినా నాలుగు వానచుక్కలు రాలకపోవు. ఏళ్ళతరబడి ఎండి నెర్రలు కొట్టిన నేల తల్లి గుండెలు చల్లారకపోవు. ఆ తల్లినే నమ్ముకుని బతికేవాళ్ళకి పంచభక్ష్య పరమాన్నాలు కాకపోయినా పచ్చడి మెతుకులైనా దొరక్కపోవు. అదిగో అటువంటి అరుదైన 'మంచిరోజు'ల్లో మామూలు రైతు కుటుంబాల జీవనరాగాలు ముఖ్యంగా కొత్తగా పెళ్ళయిన ఒక జంట అన్యోన్యానురాగాల అపూర్వగాథ ఇది. పల్లెలోని ప్రతి ఒక్కరికీ మట్టితో, పశువుతో, పక్షితో, ప్రకృతి అంతటితోనూ గల ప్రగాఢమైన బంధాన్ని సహజ సుందరంగా వర్ణించిన నవల ఇది.

డి. వెంకట్రామయ్య

సంకటి పక్వంగా గెలకటం ఆమెకు చేతకాదు. కడపలో వున్నప్పుడే ఒకటి రెండుసార్లు ప్రయత్నించిందిగాని ఉంటగట్టడమో, అనుకనుగ్గా కావటమో జరిగింది.

అందుకే దాని జోలికి ఇప్పుడే పోదల్చుకోలేదు.

అన్నాన్ని క్యారియర్‌లో సర్దుతోంటే శివుడే ఇంటికొచ్చాడు.

"యీ ఎండకు నువ్వంత దూరం ఏమొస్తావనీ..." అంటూ కారణం చెప్పాడు.

అతనికేసి అదోలా చూసింది ఆమె.

అన్నంలోకి మటిక్కాయ పులుసు రుచిగానే వుంది.

ఇద్దరూ భోంచేస్తూ వుంటే- "ఒరే శివుడూ!" అంటూ వాకిట్లోకొచ్చింది ఓ ఆడ మనిషి.

"బువ్వ తింటాంద్రా!" అంటూ చొరవగా లోపలికొచ్చి "ఏం కూర? " అంది.

భూమి మీద ప్రేమగల రైతు తన భార్య తననే గాక తన పనిని, తన నేలను, పంటను, పశుపక్ష్యాదులను ప్రేమించేట్లు చూసుకొనటంలోని అవసరాన్ని చెప్పిన కథ- ఆ క్రమంలో తన గ్రామాన్ని, తన జీవితాన్ని భార్యకు పరిచయం చేయటానికి పురుషుడు భార్యను ఎంత ప్రేమించి, లాలించి ఆమె జీవితాన్ని ఆవరించాలో సౌందర్యాత్మకంగా చూపిన నవల. శృంగారం ప్రధానంగా, సరసంగా, వాస్తవ గ్రామీణ జీవన భూమికలో నడిచిందీ నవల. దాంపత్య శృంగారం వ్యవసాయ జీవన తాత్వికతతో ఉదాత్తీకరించబడటం వలన, రైతు వర్గాల వారి ఆశలు, ఆకాంక్షలు, కష్టసుఖాలు, ఆచారాలు, ఆహారపు అలవాట్లు, సమష్టి జీవన తత్వం మొదలైన వాటిని ప్రతిఫలించటం వలన ఈ నవల ఉత్తమంగా వుంది.

వచ్చినామె వాకిట్లో ఎదురుగా కూచుని తన చేతిలోని సంగటి ముద్దలోంచి పిడచ తుంచుకొని అవతలి మనిషి చేతిముద్ద మీద కూరలో పొడిచి నోటబెట్టుకుంది.

"కూర తీసప్పోదు రాక్కా!" శివుడు పిల్చాడు.

"వొద్దులేబ్బీ! సరిపోద్దిలే..."

గరిట నిండా కూర తీసికెళ్లింది గౌరి.

"ఏమమ్మో మరదలా! సంగటి సేతల్లో పెట్టుకుని కూర కోసం ఇండ్లిండ్లా అడక్కతింటాండయి. ఇయ్యేం కాపయా అడక్కతినే జాతా? అనుకునేవు. మేమింతేమ్మా! నలగరమూ ఒకసోట కూకొని కూరలు పంచుకుని తింటేగాని కడుపు నిండినట్టుండదు" చెప్పింది.

అంతలో మరో ఇద్దరు వచ్చారు.

శివుడు కూడా పళ్లెంతో వచ్చి వాళ్ల ముందు కూచున్నాడు.

గౌరికి సైతం తప్పలేదు.

"తిందూ రాత్తా!" పిల్చాడు శివుడు.

"నా సేత సంగటుంది గానీ..." అంటూ "మటిక్కాయ పులుసా?" అని వంగి కుండలోంచి గరిటెడు కూరతీసి తన ఎడమచేతిలోని సంకటి ముద్ద మధ్యనున్న గుంటలో వేసికొని వెళ్లి గడపలో కూచుంది.

ఆశ్చర్యంగా చూస్తూండిపోయింది గౌరి.

"మ్మేయ్! ఓ పిల్లా! ఇట్రా..." సంకటి పిడచను కూర మీద అద్ది నోటబెట్టుకొంటూ వీధిలోకి కేకేసింది ఆమె.

మరో ఆడమనిషి అక్కడికొచ్చింది.

ఆమె చేతిలో కూడా సంకటిముద్ద వుంది.

"కూకో... మా కూతురు కూర రుచిగా చేసింది... నీదేంది? వూరిమిండా..!. ఇదో... అద్దుకో..." చేయి ముందుకు చాచింది.

"పెండ్లయి మూడు పొద్దులు కాలేదు. అప్పుడే రొండు పల్లేలా!" ఓ ఆడమనిషి ఆశ్చర్యంగా చూసింది.

"పిల్లా నీ పల్లెం నాకీ. నువ్వు మావోని పల్లెం లేకి పో..." అంటూ దురుసుగా గౌరి పళ్లెం లాక్కొంది మరొకామె.

సిగ్గులతో మొగ్గయింది గౌరి.

శివుడు నవ్వుతూ ఉండిపోయాడు.

ఒకరి చేతుల్లోని కూర మరొకరు అద్దుకొంటూ, చెతుర్లాడుకొంటూ ఆహ్లాదకరమైన వాతావరణాన్నొకదాన్ని అక్కడ సృష్టించి తిండి తినటం పూర్తిచేశారు.

"ఇంక లెయ్యే మరదలా!" గౌరిని చూస్తూ అందో ఆడమనిషి.

"కూర వేస్తివి. నీ యింటికాడ సంగటి తినిపిస్తివి... మా అరసేతల్నిండా సంగటి



కర్చుకోనుంది. మా యిండ్లకు పోయి కడుక్కోవాల్నా? " అంది.

ఆదరా బాదరా దొడ్లోకెళ్లి చెంబుల్నిండా నీళ్లు ముంచుకొచ్చింది గౌరి.

"నీల్లతో కడగడం కుదర్దే కోడలా! ఏ ఇంటి వాకిట్లో ముత్తయిదువలొచ్చి సంగటి తింటే ఆ యింటి కొత్తకోడలు వాల్ల చేతులు నాకాల. నీల్లతో కడిగితే ఆ యింటి బాగ్గెమంతా కారిపోతది".

"రా... ఎండిపోతే ఊడిరాదు. పండ్లతో గీరాల్సొస్తది. నీకు పండ్ల బలముందో లేదో... ఇప్పుడైతే నాలికెతో నాకితే కడిగినట్టు పోతది... రా... ఇదో..." చేయి చాచింది ఓ ఆడమనిషి.

చెతురాడుతున్నారో, నిజంగా అంటున్నారో అర్థంగాక బిక్కమొగం వేసింది గౌరి.

శివుడు లోలోపల నవ్వుకొంటున్నాడు.

"మా సేతులన్నీ నాకేసరికి నీకూ కడుపునిండుద్దిరా! సిగ్గుతో తిన్నెవో లేదో మరి..."

"వేల్లకు కరచుకొన్న సంగటి ఎంత రుచిగా ఉంటాదనీ!"

వాళ్ల ఎగతాళి మరికొంతసేపు సాగేదేగాని శివుడు రెండు చేతులూ ముకుళించడంతో ఆపారు.

తర్వాత తమను తాము పరిచయం చేసికొని వరసలు కలిపారు. పనుందంటూ వెళ్లిపోయారు.

ఎంత హఠాత్తుగా వచ్చారో అంత గమ్మత్తుగా దాటిపోయారు.

ఎండాకాలపు ఉక్కపోతలో అనుకోకుండా వచ్చి నిలువెల్లా తడిపి వెళ్లిన వానలా ఒక కొత్త అనుభూతినిచ్చి పోయారు.

ఇట్లాంటి సంఘటనల్ని తన జీవితంలో ఎప్పుడూ ఎదుర్కొని వుండలేదు గౌరి. సాటి మనుషుల తోటి ఇలాంటి సన్నివేశాల అనుభవాలు కూడా వుంటాయని ఆమె ఊహించి వుండదు.

"వాల్ల మాటలకు నొచ్చుకున్నావా?" శివుడు అడిగాడు.

"వరసైన వాల్లు ఇంతే. పాతబడినాంక నువ్వయినా అంతే... ఒకర్నొకరు ఎగతాలి చేసుకొని నవ్వుకోకుంటే బతకలేరు..."

"నేనేం బాధపల్లేదు..." అంది గౌరి.

"అమ్మయ్య..." గుండెలమీంచి బరువు దిగినట్లుగా అనుభూతిస్తూ గాలి వదిలాడు.

ఆడాళ్లంతా వచ్చి యింతలావున కోడిగ మాడతారని అతను ఊహించలేదు. ఆ కోడిగానికి పల్లెటూరి పిల్లలాగే గౌరి స్పందించిందంటే నమ్మలేకపోతున్నాడు. వరసైన ఆడాళ్లూ, ముసలాళ్లూ చేసే ఎగతాళి మాటలు తన కొంప ముంచుతాయేమోననే భయం అప్పుడప్పుడూ అతణ్ణి వెంటాడుతుండేది. టౌను మనుషులు పల్లెటూరి ఎగతాళిని ససేమిరా భరించలేరని అతని నమ్మకం.

చతుర 30 వసంతాలు

దానికి కారణం రామిరెడ్డి అల్లుడే.

అతను టౌన్లోనే పుట్టి పెరిగినవాడు. ఏదో ప్రభుత్వ ఉద్యోగం కూడా వెలగబెడుతున్నాడు. అందుకే లక్షల్లక్షలు కట్నంపోసి అతన్ని అల్లుణ్ణి చేసుకొన్నాడు రామిరెడ్డి.

పల్లెటూరంటే అతనికి చిన్నచూపులాగుంది. వీధుల్ని చూసి విసుక్కొనేవాడు. ఇళ్లనుచూసి గొణిగేవాడు. మనుషులతో మాట్లాడేవాడు కాదు. తనేదో ఆకాశం నుంచి ఊడిపడ్డట్టుగా భావించేవాడు.

కొత్త అల్లుణ్ణి రకరకాలుగా ఎగతాళి పట్టించి అల్లరి చేయటం పల్లె జనానికి అత్యంత సహజ లక్షణం. అందులోనూ లక్షలు పోసి కొన్న భారీ ఖరీదు అల్లుడయిపోయే. అతన్ని భారీగానే ఎగతాళి చేయాలనుకున్నారు వరసైన వాళ్లు.

స్నానం చేసేటప్పుడు చాటునుంచి కడుగు నీళ్లు పోసి అల్లరి చేశారు. చక్కెరకు తౌడు కలిపి కజ్జకాయలు చేయించి అతను తింటోంటే ఎకసక్కెమాడారు. ఆముదపు నూనెలో వడలు కాల్పించి కొంటెతనం చేశారు. మంచంకోళ్ల కింద కుండపెంకులు పెట్టి అతను కూచోగానే పటపటమని పగిలి శబ్దం చేస్తోంటే గేలి చేశారు. పౌడరు బదులు సుద్దపొడి డబ్బా అతని ముందుంచి వేళాకోళమాడారు. మొహం నిండా, సబ్బు పూసుకోగానే నీళ్లు అందకుండా చేసి ఏడిపించారు. మంచంమీద కూచున్నప్పుడు చొక్కాను మంచం నులకకు ముడేసి 'బావా అక్క పిలుస్తోంది' అంటూ అతన్ని లేవగొట్టటంతో మంచం కూడా కదిలి జరజర జరగటం... అందరూ చప్పట్లు కొట్టి 'బావ పందెం బండ యీడుస్తాండు' అంటూ గేలిచేయటం... తాడు చివర రాయికట్టి దాన్ని అతని వెనక చొక్కాకు ముడేసి, లేచి నడిచేట్టు చేసి బావకు తోకుంది. ఆంజనేయ స్వామి! అంటూ పరిహాసమాడటం... తనమీద ప్రయోగించబడే ఏ కోడిగపు చేష్టనూ ఆ కొత్త అల్లుడు అత్తగారింటి మధురానుభూతుల కట్నంగా భావించక పోవటం, అవి తనను పరాభవించే చర్యలుగా అనుభూతించటంతో చిక్కొచ్చి పడింది. తనను అవమానించారనే వంకతో అత్తగారింటికి రావటం చాలించాడు.

అంతే... అప్పట్నించి ఇప్పటిదాకా అతనీ ఊర్లో అడుగు పెట్టలేదు. పండుగలకు పబ్బాలకు కూతుర్ని పిల్చుకొస్తాడు రామిరెడ్డి. చీరసారె పెట్టి పంపుతాడు. పరిహాసం చేసిన వాళ్లందర్నీ తిట్టుకొంటుంటాడు.

అందుకే టౌన్ అల్లుడంటే ఊర్లో వాళ్ల పరాచికాలకు గుండెదడ. వాళ్ల కొంటెదనాలకూ, పరిహాసాలకూ, అల్లరి చేష్టలకూ కోడిగాలకూ, ఎగతాళికీ కుంటిదనం.

గౌరి మాత్రం రామిరెడ్డి అల్లునిలా అనుభూతించక పోవటం తన అదృష్టంగా భావించాడు శివుడు.

పొద్దు వాటారింతర్వాత పెళ్లాన్ని వెంటేసుకొని పొలంవద్ద కెళ్లాడు.

నారుమడిలో పాతనీరు తీసి కొత్తనీరు పెట్టాడు.

పారతో కాలువలు చేయటం, గట్లు చెక్కటం, బీళ్లల్లోని వెంపలి, ఉత్తరేణి వగైరా పచ్చిరొట్ట మొక్కల్ని పీకి పోగేసుకోవటం లాంటి పనులు చేశాడు పొద్దుగుంకే దాకా.

శివునితోటి రెండు వెంపలి చెట్లు పీకేసరికి ఆమె అరచేతులు ఎర్రగా కందాయి. నోట ఊదుకొంటూ కూచుంది.

శివుడు మాత్రం అలవోకగా పీకుతున్నాడు.

గుడ్లప్పగించి అతనికేసి చూస్తూండటం తప్ప ఏమీ చేయలేకపోయింది.

చెరువులో ఈదాలని మనస్సు పీకింది గౌరికి. చెరువు నీటి అనుభవం ఆమె తనువులోని అణువణువునూ ప్రేరేపించిందిగాని

మొన్న జరిగిన సంఘటన గుర్తొచ్చి ఆశల మీద నీళ్లు చల్లినట్లయింది.

ఇంటికెళ్లేసరికి బర్రె, దూడ వచ్చి వున్నాయి.

పొయ్యి దగ్గర సందెడు ఎండుపుల్లలు కూడా ఉన్నాయి.

బైట మంచమ్మీద కూచునివున్న అల్లునితో మాట్లాడుతూ ఉంది లక్షమ్మ.

"తలమేత లేకండా పొలంమేత వొక్కటే ఏమైతది? సూడి బర్రెకు బోడగంపెడు



**ఎండు పోచలు ఏం సత్తవ తీ!
ఇంటి ఆడమనిషి గంపనిండా
గడ్డి దెచ్చి దాని మూతికాడ బోల్లిస్తేనే
పొదుగుకాడ కాసేపన్నా
సెయ్యి బెట్టనిచ్చేది...**

పచ్చిగడ్డి అయినా తెచ్చి బేస్తే గాదూ..." అంటున్నాడు అతను.

"ఎండుగడ్డి ఉందిలేబ్బీ! వామి అయిపోలేదుగానీ!"

"ఎండు పోచలు ఏం సత్తవ తీ! ఇంటి ఆడమనిషి గంపనిండా గడ్డి దెచ్చి దాని మూతికాడ బోల్లిస్తేనే పొదుగుకాడ కాసేపన్నా సెయ్యి బెట్టనిచ్చేది..."

"ఎవురు తేవాల?"

ఏమీ మాట్లాడలేదు అల్లుడు.

అతని మాటల వెనక ఉద్దేశం ఆమెకు అర్థమవుతూనే వుంది. కోడలి చేతికి గడ్డి గంప యిచ్చి పంపమంటున్నాడు.

అతను చెప్పే మాటల్లో సత్యముంది.

నెత్తిన మూడిత్తులు బడి అత్తగారింట్లో కాలుబెట్టిన నిమిషం నించే కడవ చేతబట్టి నీళ్లకు వెళ్లటం, గంప రొండిన బెట్టి గడ్డికి పోవటం, పొరక చేతబట్టి కసవూడవటం వంటి పనుల్లో రాయరంపంగా జొరబడే రైతింటి కొత్త కోడండ్లే ఎక్కువగా కనిపిస్తారు. రకరకాల పనుల్లో రకరకాల శారీరక విన్యాసాలు ప్రదర్శించే కోడళ్లే దర్శనమిస్తారు. పనులు చేయటంలోనే వాళ్ల అందం వీధుల్లో దర్శనీయమవుతుంది. దానికి కారణం వాళ్ళంతా సేద్యగాళ్ళ ఇళ్లల్లోంచి వచ్చుంటారు కాబట్టి. తన కోడలి పరిస్థితి అట్లా లేదుగదా! ఆమె కుటుంబంది వ్యవసాయం కాదుగదా!

కోడలి విషయం లక్షమ్మకు కొంత ఆలోచనగానే వుంది. ఒంట్లోని కండరాలన్నీ కరిగించుకొని, నెత్తురంతా ఆవిరి చేసుకొంటేనే రైతులింట్లో పిడచ నోట్లోకి పోయేది.

అన్నిటికీ ఆ భగవంతుడే ఉన్నాడనుకొంది. చీకటిపడి దీపాలు వెలిగించే సమయాన బస్సు శబ్దం విన్పించింది.

ఉదయం ఒకసారి వస్తుంది. పల్లె జనాన్ని తీసికెళ్లి టౌన్లో వదులుతుంది. మళ్లీ సాయంత్రం వాళ్లను మోసుకొస్తుంది. మధ్యన ఇంటికి రావాలనుకొన్నవాళ్లు అడ్డ రోడ్డు వద్ద దిగి నడిచి రావాల్సిందే.

బస్సు వచ్చిన కొద్ది సేపటికే ఎవరిదో కేక వచ్చి చెవుల సోకింది శివునికి. "శివుడూ! ఎవురో సుట్టమొచ్చినట్టుంది. బస్సు కాడికి పో..." అంటూ.

తన్నో కాదో అనుకొన్నాడు మొదట.

"అమ్మ వొచ్చిందేమో!" గౌరి సందేహాన్ని వ్యక్తం చేయటంతో ఒక్కక్షణం కూడా నిలబడలేదు.

ఆమె అనుమానం నిజమే. సరోజమ్మ వచ్చింది.

రెండు ఎయిర్‌బ్యాగ్‌ల బరువుతో దిగింది.

"బాగున్నావా అమ్మా?" అన్న కూతురి కుశల ప్రశ్నలకు నోటితో పొడిపొడిగా సమాధానం చెబుతూనే కళ్లతో ఎన్నో జవా బులిచ్చింది. చూపుల స్పర్శతో మరెన్నో ప్రశ్నల్ని కురిపించింది. ఆ చూపుల్ని శబ్దా లుగా అనువదించేందుకు సమయ సంద ర్భాల కోసం తొందరపడలేదు ఆమె.

పూలు, పండ్లు వగైరాలు దండిగానే మోసుకొచ్చింది.

గౌరి వదిలేసి వచ్చిన బట్టలు తెచ్చింది.

ముందుగా "వదినా!" అంటూ లక్షుమ్మను పలుకరించింది. ఆప్యాయంగా కుశల ప్రశ్నలు వేసింది.

పాత సంగతులన్నీ తడువుకొన్నారు ఇద్దరూ.

తన పుట్టింటి స్మృతుల్ని తవ్వుకొంది లక్షుమ్మ. సరోజమ్మకు ఎదురైన దుఃఖాన్ని సహానుభూతిస్తూ పంచుకొంది.

ఇరుగుపొరుగు ఆడమ్మగారు వచ్చారు.

సరోజమ్మతో మాట కలిపారు. ఆమె వేష భాషల్ని పరిశీలిస్తూ లోకాభిరామాయణా ల్లోకి దిగారు.

వదినెతో మాట్లాడుతున్నా, ఊర్లో వాళ్లతో ముచ్చటిస్తున్నా చూపులు మాత్రం కూతురి మీదే ఉన్నాయి సరోజమ్మకు.

ఇల్లు, వాకిలి, పరిసరాలు... ఇవేమీ ఆమెను ఆకర్షించలేదు. కూతురి కేసి వరద పొంగులా కదులుతున్నాయి చూపులు.

ఒళ్లంతా గుచ్చి గుచ్చి చూస్తోంది.

రంగు మాసిందేమో!

కళ్లు పీక్కుపోయాయేమో!

నవ్వు చెదిరింది కాబోలు.

ఒళ్లు చిక్కిందేమో!

తల సరిగ్గా దువ్వుకొంటోంది గదా! అలం కరించుకొంటోంది గదా! తనమీద బెంగ పెట్టుకొని సరిగ్గా నిద్రబోవటం లేదు గదా!

కరంటు వెలుగులో కళ్లు విచ్చుకొని చూసింది.

కూతురి వొళ్లంతా తడివి తడివి పరిశీలిం చింది.

తనే స్వయంగా స్నానం చేయించింది. జబ్బలు పట్టి చూసింది. అరచేతుల మృదుత్వాన్ని రాపా డించి అంచనా వేసింది. అరికాళ్లను సైతం పరిశీలించింది.

అరచేతులు మునుపటి లాగే సుతిమెత్తగా కన్పించి "అమ్మయ్య" అంటూ ఊపిరి పీల్చు కొంది గాని అరికాలులో ముల్లు దిగిందని తెలిసి కాలు శుభ్రంగా తుడిచి చూసింది. ఆ ముల్లు తన గొంతులో దిగినట్లుగా విలవిల్లా డింది. చెప్పుల్లేకుండా బైటకే వెళ్లొద్దంటూ హితబోధ చేసింది.

ఆమె మాటలు గౌరి చెవుల్లో యీ పక్క దూరినంత వేగంగానే ఆ పక్కనుంచి వెళ్లిపో యాయి.

ముల్లు గాయం మిగిల్చిన నలుపు ఎరుపు రంగు మచ్చ తనకెంత మధురానుభూతిని ప్రసాదించిందనీ!

తల్లి ఆదుర్దా ఆమెకు నవ్వు తెప్పించింది.

కూతురిలో మునుపటి నాజూకుతనం కొంత సన్నగిల్లినట్లనిపించినా మొహంలో ఏదో కొత్త కాంతి కన్పించి తృప్తిపడింది సరో జమ్మ.

భోజనాల వేళ కూతురితో చాలా కబుర్లే చెప్పింది.

రెండుసార్లొచ్చి గొడవ చేసి వెళ్లాడట వీరా రెడ్డి.

కూతుర్ని పట్టుకొని కన్నీళ్లు పెట్టుకొంది ఆమె.

తర్వాత లక్షుమ్మతో చాలా పొద్దు ముచ్చ టించింది.

ఆ వీధి నుంచి శివమ్మ వచ్చింది. ఇంకొం తమంది ఆడాళ్లతో కలిసి.

సరోజమ్మతో మాటలు కలిపారు వాళ్లు. కొత్త దంపతుల గురించి మాట్లాడారు. చివ

రగా తమ అభిప్రాయాన్ని చెప్పారు- 'అప్పచ్చుల సారె కట్టుకొస్తే బావుంటుం'దని.

సరోజమ్మకు కూడా సబబుగా తోచింది వాళ్ల సూచన.

అయితే- తనయింటి వద్దనుంచి సారె కట్టుకురావడం ఇప్పట్లో సాధ్యమయ్యే విషయం కాదు.

సమస్యను వాళ్ల ముందుంచి సలహా తీసుకొంది.

ఆరుబైట వేపచెట్టు కింద మంచమ్మీద పడకేశాడు శివుడు.



పరుపులేని పడకను గురించి బాధపడింది. నవారు మంచమైనా అల్లుకోలేని వాళ్ల బీదరికానికి, అనాగరికతకూ విచారపడింది



ఇంట్లో నులకల మంచమ్మీద పరచిన పాత బొంత, దుప్పట్లను మరోసారి విదిల్చి నడుం వాల్చింది సరోజమ్మ.

అప్పటికే చాలా పొద్దుబోయింది.

గౌరి యింకా ఇంట్లోకి రాలేదు. దీపం ఆర్పలేదు.

కొట్టం వాసాలకేసి చూస్తూ వుంది సరోజమ్మ.

కూతురు రాదేమోనని ఏమూలో సన్నని అనుమానం. మగని వద్దే పడుకొంటుందేమో!

ఆమె తల్లి మనస్సు ఎందుకో సమాధానపడలేకపోతోంది. దొడ్డి వాకిలి తీసివుంది. చల్లటి గాలి సోకుతోంది. ఆహ్లాదకరమైన గాలి... హాయిగా నిద్రను ఆహ్వానించే గాలి. దానికి తోడు ఒక్క దోమ కూడా చెవుల వద్ద రొద చేయకపోవటం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది.

అంతలో గౌరి లోపలికి వచ్చింది.

తడికల వాకిలి లోపల గడియ వేసి తల్లి పక్కలో పడుకొంది.

అప్పటిదాకా మనస్సులో కదలాడుతూ వున్న సన్నపాటి ఏకాకి భావం ఒకటి మెల్లిగా కరిగిపోయింది సరోజమ్మకు.

తన కూతురే... ఇంకా తన ముద్దుల కూతురే... మగణ్ణి వంటరిగా వదలి తన పక్కన పడుకొందంటే- తన బంగారుకొండే! తన వరాల రాసే!

కూతుర్ని దగ్గరకు తీసికొని ఆప్యాయంగా పొదువుకొంది. ఎన్నో తరాల ఎడబాటును అనుభూతిస్తూ స్పర్శించింది.

అప్పుడు మొదలెట్టింది అసలు భాగోతం.

సంసార విషయాల్ని గుచ్చి గుచ్చి అడిగింది. శివుడు ఎలా చూసుకొంటున్నాడో ఆరాతీసింది. ఎండాగాలికి తిప్పుతున్నాడేమోనని అనుమానపడింది. పరుపులేని పడకను గురించి బాధపడింది. నవారు మంచమైనా అల్లుకోలేని వాళ్ల బీదరికానికి, అనాగరికతకూ విచారపడింది. ఉదయం పూట కాఫీ తాగుతోందో లేదోననీ, టిఫిన్లు అబ్బుతున్నాయో లేవోననీ ఆందోళన పడింది. అన్ని అనుమానాలనూ ఖండిస్తూ గౌరి నించి సానుకులమైన సమాధానాలు రావటంతో ఓవైపు తృప్తి పడుతూనే మరోవైపు సందేహంగా చూసింది.

సమస్యలు కాస్త ఉపశమించి వీరారెడ్డి గొడవ సద్దుమణిగితే వాళ్లను కడపకు తీసుకుపోతానంది. ఉన్న వ్యాపారాన్ని ఇంకొంత వృద్ధి చేయించి సుఖంగా బతికేటట్టు చూస్తానంది.

తన కడుపులోకి ముడుచుకుపోయి పడు

**అత్యాధునిక పరికరాలు , విశేష అనుభవంగల వైద్యబృందం**
**సేవాభావం గల నర్సింగ్ సిబ్బంది**

అత్యాధునిక వసతులతో, ప్రతిష్టాత్మక విశ్వవిద్యాలయాలనుండి
ఉత్తీర్ణులైన స్పెషలిస్ట్ డాక్టర్లతో సామాన్యులకి అందుబాటులో
24 గం॥లు సేవలందిస్తూ, కడప, చిత్తూరు, ప్రకాశం, మరియు
నెల్లూరు జిల్లాలకు ఆరోగ్య ప్రధాయినిగా వెలుగొందుతున్నది.




# బొల్లినేని
## సూపర్ స్పెషాలిటి హాస్పిటల్

నెల్లూరు ఫోన్స్ : 0861 2312777,2315835,36,37,38,

HARSHA 9849188889

**పేద ప్రజలు తమ వైద్య ఖర్చుల కోసం ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి నుండి**
**సహాయనిధి పొందు సౌకర్యము. పేదప్రజలకు ఉచిత జనరల్ వార్డ్**

కొన్న కూతుర్ని చూసి చలించిపోయింది సరోజమ్మ.

పైకి చెప్పలేదుగాని తనమీద బెంగపెట్టుకొంది కూతురు. తన దగ్గరితనం కోసం తపించింది. తన స్పర్శ కోసం దప్పిక గొనింది. తన చేతి పిడచ కోసం అల్లాడింది. ఒకే కూతురు... తండ్రి లేని పిల్ల... గుండెలమీంచి దించకుండా పెంచుకొంది. వారం రోజులుగా తన రాక కోసం ఎంతగా ఎదురుచూసిందో బంగారు కొండ!

కూతుర్ని మరింత దగ్గరగా హత్తుకొని ఆ స్పర్శాసుఖాన్ని అనుభూతిస్తూ కళ్లు మూసింది ఆమె. మరో రెండు రాత్రిళ్లయినా ఇక్కడే వుండి కూతురి మనస్సుకయిన ఎడబాటు గాయాల్ని మాన్పుదామనుకొంది.

బంధువులందరి కంటే, తోడబుట్టిన వాళ్ల కంటే, తండ్రికంటే, చివరకు కట్టుకొన్న భర్త కంటే కూడా ఆడపిల్లకు తల్లే గదా అత్యంత ఆత్మీయురాలు.

తెల్లార్లూ ఆమెను తన వొడిలోనే సేదదీర్చుకోనివ్వాలి. తను అటు ఇటు కూడా మసలకుండా ఆమెను సుఖంగా నిద్రబోనివ్వాలి.

ఆప్యాయంగా కూతురి వీపు నిమురుతూ, అంతులేని వాత్సల్యాన్ని ఆలోచనల్నిండా నింపుకొని, తెల్లారిందాకా తన ఒడిలోనే వొదుక్కొని లేవబోని కూతురి అమాయక ప్రేమకు ఉప్పొంగుతూ తృప్తిగా నిద్రలోకి జారింది సరోజమ్మ.

దోమపోటు లేని, ఉక్కపోత తెలీని పల్లె వాతావరణం ఆమెకు ప్రశాంతమైన, ఆహ్లాదకరమైన నిద్రను ప్రసాదించింది.

చందమామ హుషారుగా రాత్రిని కరిగిస్తూ ఆకాశమార్గాన కదలిపోతున్నాడు. మేఘాల మాటున దోబూచులాడుకొంటూ కొత్త ఉత్సాహంతో పరుగిడుతున్నాడు.

ఎంతసేపు ఆదమరిచి నిద్రబోయిందో తెలీదు.

అది ఏ జామైందో అవగాహనకు రాలేదు.

ఏదో సవ్వడి చెవులదాకా వచ్చి ...

అది వంటపాత్రలు దొర్లించిన చప్పుడుగా అర్థమై ...

ఉలికిపాటుగా కళ్లు తెరిచింది సరోజమ్మ.

ఒక్క క్షణం గుండె దడదడలాడింది.

టౌను దొంగతనాలు మనస్సులో మెదిలి నిద్ర ఎగిరిపోయింది. లేచి కూచుని అటు కేసి చూడబోయేసరికి- తెల్లగా దొడ్డి వాకిట్లోంచి బైటకు జారుతూ పిల్లి.

గుండె దడ తగ్గి తేలిగ్గా ఊపిరి పీల్చుకొంది.

లేచి దొడ్డి వాకిలి వేసేందుకు కదలబోతూ ఏదో అనుమానం వచ్చి తన మంచం కేసి చూసింది.

ఆమె కళ్లనిండా ఆశ్చర్యం!

తన పక్కలో గౌరి లేదు. లేచి వెళ్లినట్లుంది.

బిరబిర కదలి వాకిలి తెరవబోయింది.

బైట చిలుకు తగిలించి ఉంది.

తడికల వాకిలి కాబట్టి సందుల్లోంచి వేళ్లు జొనిపి చిలుకు ఎగురగొట్టింది.

తలుపు తెరచి ఇంటి ముందుకు నడిచింది.

శివుని మంచం దిశగా చూసింది.

రాత్రి వాల్చిన చోట లేదు అది.

వేపచెట్టుకు అవల గడ్డివామి దగ్గరగా పశువుల పాక కన్పించింది.

అమె అనుమానిస్తూనే అటుకేసి నడిచింది.

పేడ వాసన ... పశువుల చెమట కంపు.

అడుగులో అడుగేసుకొంటూ వారపాక వద్దకు వెళ్లేలోపల రెండుసార్లు పచ్చిపేడ తొక్కింది.

వారపాక ముందు వేపచెట్టు కొమ్మల



సందుల్నించి జారే వెన్నెల శకలాల కింద మంచం మీది దృశ్యాన్ని చూసి ఆశ్చర్యంతో బ్రాన్పడిపోయిందిది.

నులక మంచమ్మీద సరిగ్గా గుడ్డకూడా పరచుకొన్నట్టు లేదు. శివుని ఎదలమీద తలాన్చి గాఢనిద్రలో ఉంది గౌరి.

సరోజమ్మ తన కళ్లను తాను నమ్మలేక పోయింది.

పరుపుమీద మెత్తగా సుఖంగా పడుకునే పిల్ల, విశ్రాంతిగా హాయిగా నిదురించే పిల్ల - కటిక నులక మీద ఇరుకిరుగ్గా పడుకోవటం...

తనెంత పొరబడింది!

తన డొక్కలో ముడుచుకు పడుకొని యీ వారం రోజుల ఎడబాటు బాధను మరిచి పోతుందని భావించింది.

జాము పొద్దు మొగుని తోటి దూరమైన విరహబాధ ముందు తన తోటి ఇన్ని రోజుల ఎడబాటు విలువలేనిదైంది.

తల్లిప్రేమ తనచేత ఎంత అమాయకంగా ఆలోచింపచేసిందనీ!

వెనుదిరిగింది ఆమె.

చతుర 30 వసంతాలు

దొడ్లోకెళ్లి కాళ్లు కడుక్కొని మంచమ్మీద పడుకొందిగాని నిద్రబట్ట లేదు.

మనస్సులో ఓవైపు ఇంకా తను చూసిన దృశ్యాన్ని జీర్ణం చేసుకోలేకపోతోంది. ఇంకా మనస్ఫూర్తిగా నమ్మలేకపోతోంది. రకరకాల కారణాల్ని అన్వేషించి తనకు కూతురు దూరం కాలేదని సర్దిచెప్పుకొనేందుకు ప్రయత్నిస్తోంది.

బహుశా- రాత్రిపూట అతనొచ్చి లేపుకుపోయాడేమో! బలవంతపెట్టి ఈడ్చుకుపోయాడేమో!

తను చల్లగాలికి మొద్దు నిద్రబోయింది. ఇదంతా గమనించలేకపోయింది.

ఎందుకో మరి అట్లా ఆలోచిస్తోంటే మనస్సుకు తృప్తిగా అన్పిస్తోంది సరోజమ్మకు. తన కూతురు మళ్లీ తనకు దొరికినట్లుగా తోస్తోంది.

కోళ్లు కూసే దాకా ఆమె కంటిమీద కునుకు వాలలేదు. ఒకదాని కూతను మరొకటి అందిపుచ్చుకొని కొక్కొరొకోలతో వీధులన్నిటినీ ప్రతిధ్వనింపచేస్తున్నాయి కోడిపుంజులు.

అప్పుడే వాకిలి వద్ద గుసగుసల సవ్వడి.

ఆపైన మెల్లిగా తలుపు తెరిచిన చప్పుడు.

అడుగులో అడుగేసుకొంటూ నడచివచ్చి తన పక్కగా పడుకొన్న కూతురి స్పర్శ.

తన డొక్కలో ముడుచుకుపోతూ... సందేళ భంగిమను గుర్తుంచుకొని జాగ్రత్తగా అమలుపరుస్తూ... తన్ను ఏమార్చాలని ప్రయత్నిస్తూ...

"ఔరా వగలమారి కూతురా! ఎంత నేర్చినావూ! తలమీద దోసెడు బియ్యపు గింజలు పడి ఏడు పొద్దులు గాలేదు. ఎన్ని చిటకలు నేర్చినావూ! ఎంత కొత్త పెళ్లానివయితే మాత్రం తల్లినే ఏమార్చాలని చూస్తాండవే! మేమూ ఒకప్పుడు కూతుర్లమేనే అమ్మా! నీకంటే మేము రెండాకులు ఎక్కవే చదివింటామే సోకరాని జొన్నగింజా! కూతురి దగ్గర కొచ్చేసరికి మాయమ్మలాగే నేనూ ఏమారినానే! నా కూతురికి నేను తప్ప ప్రపంచం తెలీదని అమాయకంగా నమ్మినాను. నాకు బాగా బుద్ధి జెప్పినావుగదే వగలమారి వంకాయా! నీ సుగానికి నేనెందుకు అడ్డొస్తానే తల్లీ! నీ మొగునికి నువ్వు ఇష్టంగానే ఉండు కూతురా! వచ్చీరాని మాటలట్లా, పేరీపేరని పెరుగట్లా, వేగీవేగని పెసరపప్పట్లా నువ్వెప్పుడూ నీ మొగునికి రుచికరంగానే వుండమ్మా!" సరోజమ్మ హృదయం ఆప్యాయంగా గొణిగింది.

ఉదయం బస్సుకు అల్లుణ్ణి కూతుర్నీ వెంటేసుకెళ్లింది టౌనుకు. అక్కడ స్వీటు షాపులో అప్పచ్చులకు ఆర్డరిచ్చింది. కొంత ప్రత్యేకత వుంటుందని వాటికితోడు మైసూరుపాకు, జాంగ్రీలు కూడా చెప్పింది. అరటి పళ్లు బేరం జేసింది.

కూతురుకూ అల్లుడికీ కొత్తబట్టలు కొంది.

కూతురి సంసారానికి కావలసిన సామాను కొనిచ్చింది. ఆమెకు ఇష్టమైన వస్తువులు తీసుకోమంది.

ఎందుకో మరి సరోజమ్మకు గౌరి కొత్తగా కన్పిస్తోంది. రాత్రి సంఘటన తర్వాత కూతురిలా కాకుండా కొత్త భార్యలా దర్శనమిస్తోంది. దారి పొడవునా ఆమెకేసి కొత్తగా చూస్తూండిపోయింది.

రాత్రి, ఊర్లోని అందరు ముత్తయిదువల్నీ బొట్టుబెట్టి పిల్చి సారె యిచ్చి కూతురికి దీవెనలు అందించేలా దగ్గరుండి కార్యక్రమాన్ని జరిపించింది.

సారె కార్యక్రమం పూర్తయ్యేసరికి బాగా పొద్దుబోయింది.

రాత్రిలాగే తలుపేసి వచ్చి తన డొక్కలో పడుకోబోతోన్న కూతుర్ని అడిగింది సరోజమ్మ "ఇంకో మంచం లేదామ్మా?" అని.

"ఎందుకమ్మా?"

## Graduates

# Let your Heartbeat resonate In Legislative Council



## Elect

Patron of Education and Philanthropist

# K.V.V.Satyanarayana Raju

(Chaitanya Raju)

Founder - Chairman, Chaitanya Group

# as our MLC

Graduates Constituency,
East & West Godavari

**CHAITANYA FRIEND CIRCLE**

KALYANI ADS



"నాకీ మంచం ఇరుగ్గా ఉందిరా! రాత్రయితే బొత్తిగా నిద్రబట్టలేద నుకో. ఒక్కదాన్ని పండు కొంటాను. నువ్వింకో మంచమ్మీదికి పో..." చెప్పింది.

గుండె గొంతుకలోకి వచ్చి టకటకలా డింది గౌరికి.

'రాత్రి జరిగిన తతంగమంతా ఆమెకు తెలిసిపోయింది కాబోలు'. సిగ్గుతో కుంచిం చుకపోతూ గట్టిగా కళ్లుమూసుకొని వాకిలి దాకా నడిచింది. మెల్లిగా గడియతీసి బైట




కెళ్లి చిలుకేసింది. ఒక్క ఉదుటున శివుని వద్దకు పరుగెత్తి అతని మీద అడ్డంగా వాలింది.

తమ రహస్య కార్యకలాపాల్ని తల్లి పసి గట్టిన విషయాన్ని మొగునితో ముచ్చటిం చింది ఎదనిండా పులకరింతలు రేగుతుం డగా.

ఉదయమే ఊరికి ప్రయాణమైంది సరో జమ్మ.

"మామ ఇంటిమీది కొస్తాడేమో! నువ్విక్క డికొచ్చినావని తెలిస్తే నీ పానం దీస్తడు. వొద్దమ్మా! నువ్వు పోవొద్దు.. ఈన్నే ఉండు..." కళ్లనీళ్లు పెట్టుకొంది గౌరి.

సరోజమ్మ ఏమీ మాట్లాడలేదు.

ప్రయాణం మానుకోలేదు.

అన్నిటికీ ఆ దేవుడే ఉన్నాడంటూ కూత రుకి ధైర్యం చెప్పి బస్సెక్కింది.

దారి పొడవునా ఆమె తన గురించీ, కూతురి గురించీ ఆలోచిస్తూ వుండి పోయింది.

కొంతసేపు వీరారెడ్డిని గురించిన ఆలోచ నలు మనస్సును కుదిపేశాయి.

తర్వాత కూతురి గురించీ, ఆమె ఇప్పటి జీవితాన్ని గురించీ, గతరాత్రి జరిగిన సంఘ టనల గురించీ ...

కూతురు పడుకొన్న నులక మంచమే తేప తేపకూ కళ్లముందు కదలుతోంది ఆమెకు.

పగలు చూసింది తను. అది వేపెనార మంచం.

బొంత పరచుకోకుండా పడు కొంటే నులక వొత్తుకొని వీపంతా చారలు చారలుగా, పట్టెలు పట్టెలుగా చారలు ఏర్ప డతాయి.

నేల మీద దించకుండా పెంచిన కూతురు తనను విడిచి...అట్లాంటి గరుకు నులక మంచంపైన...

'వలచిన వాడు తోడుంటే నులక మంచ మైతే నేమి? పలుగురాళ్ల గుట్ట అయితే నేమి? పల్లేరు కాయల పరుపైతేనేమి?'

## 4

సరోజమ్మ ఉన్న రెండ్రోజులూ తన కూతురి కోసం పడిన తపన శివునికి ఇంకా కళ్లకు కట్టినట్లుంది. ఎంత ఆరాట పడిం దనీ- కూతురి బాగోగుల కోసం. ఎంతగా పలవరించిందనీ- కూతురి నాలుక రుచి కోసం. స్వయంగా తనే దగ్గరుండి కాఫీ గ్లాసు నోటికందించటం, అన్నం పిడచలు చేసి నోటబెట్టటం, స్నానం చేయించటం, బట్టలు మార్చటం, తల దువ్వి బొట్టు పెట్టి ఒకటికి రెండుసార్లు సవరించటం, తలనిండా పూలు అలకరించటం. అతనికయితే చాలా వింత గా అన్పించింది. మారాం చేసే చంటిపిల్లను

బుజ్జగించే తల్లిలా ప్రవర్తించింది ఆమె.

సరోజమ్మ వెళ్లింతర్వాత బాధ్యత పెరిగిన ట్లుగా అన్పించింది శివునికి. అది సంసారా నికి సంబంధించి కాకుండా కేవలం గౌరికి సంబంధించి కావటంతో తప్పించుకో రానిదైంది. కొత్త బాధ్యతలన్నీ గౌరి కోసం ఇష్టంగా నెరవేరుస్తూ వుంటే అతనికి ఆశ్చర్యం కలుగుతోంది

ఆమె ఆహారాన్ని గురించిన బాధ్యత, అలంకరణను గురించిన బాధ్యత, తన సమ యాన్ని ఆమె కోసం మాత్రమే వినియో గించే బాధ్యత.

ప్రతిరోజూ నాలుకకు కొత్త రుచుల్ని అందించే కూరలు సంపాదించటం కష్టంగా వుంది.

సమయానికి ఉప్పో, మిరపకాయో రోట్లో కసాపిసా దంచి, ఉడుకుడుకు సంగటి అద్ద కొని గబగబ నాలుగు పిడచలతో ముద్ద మింగి చేయి కడుక్కొని వగరుస్తూ బైటకు పోవటం పల్లె జనాలకు అలవాటు.

గతంలో శివుడు కూడా అంతే.

కాల్చిన ఎండు మిరపకాయ, ఉప్పు చేపల మీద బొటన వ్రేలి దరువేసి, రెండు ముద్దల ఉడుకుడుకు సంగటి అవలీలగా మింగి పొలం పనికి వెళ్ళగలడు అతను.

ఇప్పుడెందుకో తిండి దగ్గరకు వెళ్లేసరికి గౌరి వగరింపు గుర్తుకొస్తోంది.

పచ్చడి పళ్లెంలో కన్పిస్తే చాలు- కన్నీటి ధారల గౌరి మొహం అందులో కన్పి స్తోంది.

అక్కడికీ పప్పుకూర ఎక్కువగా వండేట్టు చూస్తోన్నా, అది కూడా రోజూ మొహానికేసి కొట్టినట్లుంది.

ఈ సీజన్‌లో కూరగాయలు దొరకటం ఇక్కడ కష్టంగా ఉంది. ఉదయం పూట తోటాకు గంప వస్తుంది. చేటలో ఓ మూల గింజలు పోసుకెళ్లి, చేటనిండా తోటాకు కోసం కొసిరే ఆడాళ్లతో వీధి అరుగు గలగల ప్రతిధ్వనిస్తుంది- ఆ చల్లని ఉదయపు వేళంతా.

తోటాకు ఉడకబెట్టి సంకటి బుట్టలో వేసి నీళ్లొత్తి, పప్పులపొడి, కారం కలిపి తిరగమాత వేసి ఉడుకుడుకు సంగట్లో నంజుకు తింటే బోరుచిగా వుంటుంది.

మేకల కాపర్లను ప్రాధేయపడి వాళ్లకో బీడీ కట్ట యిచ్చి బరకల్లోంచి బొద్దెకు తెప్పి స్తున్నాడు శివుడు. గొల్లల్ని కాళ్లావేళ్లాపడి కొండల్లోని దాదిరాకు తెప్పించుకొంటు న్నాడు.

ఈ ఆకులన్నీ తాళింపు చేసికొంటే సంగ ట్లోకి బావుంటాయి. గురువాకు, పాలాకు, పాయలాకు, అటికె మావిడాకు లాంటివి పప్పులో వేసి ఎనిపితే కమ్మని రుచి. వాటికి నాలుగు వంకాయలు, పిడికెడు చింతచివురు చేరిస్తే నాలుక్కి వైకుంఠం కనిపిస్తుంది. సంగటి అద్దుకొనేందుకయినా, బువ్వ కలుపు కొనేందుకయినా, రొట్టె మీదకయినా పసం దుగా వుంటుంది.

పొలంలోకి అడుగు పెడితే చాలు ఇప్పుడ తని కళ్లు కూరకుండలో పెట్టే ఆకుల కోసం వెదకుతున్నాయి.

మంచి వాన కురిసేసరికి ప్రకృతి సాంతం ఆహ్లాదకరంగా మారింది. చెట్లన్నీ చిగురించి ఆకులు తొడిగి కలకల్లాడుతున్నాయి. చెట్ల మీదకు అల్లుకొని ఎండిపోయి ఆకులు రాల్చుకొని చావు బతుకుల్లో ఉన్న బొద్దెకు లాంటి తీగలన్నీ ఇప్పుడు ప్రాణం పోసుకొని పచ్చని పందిరిలా కన్పిస్తున్నాయి. పసిరిక పాముల్లా కంపపొదల మీద పారాడుతు న్నాయి.

ఇప్పుడు ప్రతి మొక్కా చివురించి పసరు చిమ్మే పచ్చి సామ్రాజ్యం యిది. ప్రకృతి తన ఒంటికి హరిత లేపనం పూసుకొనేందుకు పూర్తి సమయం కేటాయిస్తోన్న కాలమిది.

చతుర 30 వసంతాలు

బీళ్లు, బోళ్లు సైతం పచ్చగా మిసమిసలాడుతూ కన్పిస్తున్నాయి. గొర్రెగడ్డి కాస్తా బర్రెగడ్డిగా మారుతూ వుంది.

మేపుకోసం కొండకెళ్లిన గొర్రెల మందలు పల్లెలకు దిగి వస్తున్నాయి. వాన కురిసిన రాత్రి గరుగుల మీద మేట వేస్తున్నాయి. ఉదయానికి వాటి ఉచ్చ, పెంటతో గరుగులన్నీ నిండిపోతున్నాయి.

బోరు బావులకింద చేలల్లో గొర్లు చేర్పించుకొంటున్నారు కొందరు.

అశ్లేష కార్తె వెళ్లడంతో ఆకల్లాడటం లేదు. ప్రకృతి అంతా నరాలు బిగదీసినట్లుంది. ఎప్పుడో రోహిణికార్తెలో మొదలైన పడమటి గాలులు క్రమంగా పుంజుకొని పెద్ద ఆవడి, చిన్న ఆవడి గాలులుగా మారి ఇప్పుడు పూర్తిగా మందగించాయి. గాలికి ఒక స్తబ్దతా గుణం వచ్చింది.

మరొక గొర్రుసాలు పదను వాన కురియటంతో చేలన్నీ కంది, అలసంద, ఆముదాలు విత్తారు.

బోరు బావుల్లో ఒకరిద్దరు మోటార్లు దించి చూశారుగాని ఇంకా భూగర్భ జలం పూర్తిగా పుంజుకోలేదు.

బోరు బావి కింద చేలో మిరప విత్తాడు శివుడు.

ఎకరాకు ఆరుశేర్ల విత్తనాల వంతున విత్తాడు.

సేద్యపు పనులన్నీ చక్క బెట్టుకొనేసరికి మఖకార్తె సగానికొచ్చింది.

సరోజమ్మ కొత్త బట్టలు, తినుబండారాల స్టీలు డబ్బాలు తీసుకొని దిగింది.

ఏవేవో పిండివంటల్ని చేసుకొచ్చింది.

దగ్గరుండి కూతురికి తినిపించింది.

శివునితో కలిసి కూచుందామనుకొంది గౌరి. కానీ తల్లిముందు అది సాధ్యపళ్లేదు.

మొన్న వొచ్చినపుడే ఇక్కడి రుచుల గురించి సరోజమ్మకు బాగా అర్థమైంది.

పొద్దున్నే పచ్చడి దంచుకొని సంగటి గెలుక్కోవటం, ఓ ముద్ద మింగి చేలకాడికి పోవటం. సంతన వున్నవాళ్లు మధ్యాహ్నానికి ఏదొక కూర చేస్తారుగాని చాలామంది ఉదయం పచ్చడితోనే సరిపెట్టుకొంటారు. రాత్రికి, వీలున్న వాళ్లు కందిపప్పు ఎనుపు కొని వరన్నం వండుకొంటారు. చాలా యిళ్లల్లో పప్పు అనే పదార్థం రెండు మూడు రోజులగ్గానీ కళ్లజూసేందుకు లేదు. ఇక పిండి వంటల విషయానికొస్తే అన్ని పల్లెల్లాగే - ఏ పెద్ద పండగలకో ఊరంతాకలిసి ఒకే రకమైన వంటల్ని చేస్తారు. సంక్రాంతికి అప్పచ్చులు, అలసంద వడలూ, ఏకాదశికి సొద్ద పేలపిండి వుండలూ, ఉగాదికి సెనగ పూర్ణపు ఓలిగలూ, శ్రీరామ నవమికి పెసర పప్పు పానకమూ, ముసలమ్మ పండుగకు పులగమన్నమూ కోడి మాంసమూ, గుగ్గుళ్లూ, వినాయక చవితికి సొద్ద కుడుములూ ... ఊరంతా ఒకే రకపు పిండివంటల ఆచారం.

పల్లెలో ఉన్నన్ని రోజులూ తన కూతురు అందరిలోకీ ప్రత్యేకంగా కన్పించాలని సరోజమ్మ తాపత్రయం.

వచ్చిన రోజే ఊరిమీద పడింది ఆమె. తనకు పరిచయమున్న శివుని మిత్రుల్ని కలుసుకొంది. వాళ్ల యిళ్లల్లో తిష్ట వేసింది. శివమ్మ యింటికి కూడా వెళ్లింది. అందరితో ఆమె చెప్పే విషయం ఒక్కటే - గౌరిని తను ఎండ తెలీకుండా సాకాననీ, ఎక్కడ కూడా ఆమెకు ఏ లోటూ రాకుండా చూసుకుంటాననీ, టౌన్లోలాగే మంచి గుడ్డ కట్టిస్తాననీ, మంచి బతుకు బతికేలా చేస్తాననీ, అందుకేవాళ్లకు కావలసిన వస్తువులూ, తినుబండారాలూ తెచ్చి పెట్టాననీ!

'ఆ పిల్లను కాస్త కనిపెట్టుకొని వుండమని; పని చెబుతారేమో, కష్టపెడతారేమో గమనించమనీ చెప్పింది చివరగా.

లేచి వస్తూ సంభాషణకు ముక్తాయింపుగా "ఎన్నాల్లులే నాయనా! ఉగాది దాకా కూడా ఉండను. మా రౌడీ నా కొడుకు పీడ తగ్గ తానే ఇద్దర్నీ టౌనుకు తీసకపోతా. ఆన్నే నా అంగడి సూసుకొంటా సుగంగా బతుకు తారు. ఈడేముంది? ఎన్ని రోజులు మట్టిపిసుక్కొన్నే కూటికి గుడ్డగ్గూడా బరువే గదా" అంది.

ఆమె చెప్పిందే మంచిదిగా తోచింది చాలామందికి.

శివుని బతుకైనా బాగుపడుతున్నందుకు సంతోషించారు. అయితే - కూతురి బాగో గుల గురించీ, ఆమెను శివుడు మంచిగా చూసుకొనేలా చూడమనీ ఆమె కోరినప్పుడు మాత్రం వినేవాళ్లకు నవ్వాగింది కాదు. ఆమె అభ్యర్థనకు వాళ్లు చాటుకెళ్లి పడిపడి నవ్వుకొన్నారు. ప్రస్తుతం శివుడు గౌరిని చూసుకొనే విధానమే ఊళ్లో ఏ మొగుడూ తన పెళ్లాన్ని చూసుకోనంత బాగా వుంది. అదే తమకు పూర్తిగా అరిగి రాకుండా వుంది. 'ఇంకా మంచిగా అంటే - బహుశా ఆమెను మెడల మీదకెక్కించుకొని తిప్పుతూ ఉండాలేమో!' అని వ్యాఖ్యానించుకొంటూ నవ్వుకొంటున్నారు.

శివుడు కన్పించగానే అతని అత్త తమ ద్వారా ఇచ్చిన సందేశాన్ని విన్పిస్తున్నారు.

"ఇంకా బాగంట సూసుకోరా! బుజాల మీదికెక్కించుకో. దించేవు నాకొడకా! చెప్పులిరుగుతాయి" అంటూ గేలి చేస్తున్నారు.

శివునికి కూడా నవ్వొస్తూ ఉంది.

గౌరితో కలిసి మనసారా నవ్వుకొన్నాడు.

నారుకయ్యలో నీళ్లుండాయో లేదో చూసేందుకు చెరువు కిందకి వెళ్లాడు సాయంత్రం.

వరినారు పసరు కక్కుతూ చూడముచ్చటగా వుంది. కళ్లు వక్కలయ్యేలా అందగిస్తూ

వుంది.

దిష్టికుండ పెట్టమని తల్లికి చెప్పాలనిపించింది.

నీళ్లు తక్కువుండటంతో కాలువ వెంట ఎగేసుకొచ్చి కయ్యకు పెట్టాడు.

అక్కడక్కడా గెనిమలకున్న పాత బోరియల్లో ఎండ్రకాయల కదలికలు కనిపిస్తున్నాయి.

నిన్నామొన్నా నారు పోసిన వాళ్లు కొంగలు తొక్కక్కుండా జండాలు పాతారు.

"ఏంబీ! నీ పాటు బావుందిలే" పక్కచేలోంచి రేగ్గాయల దుగ్గయ్య అన్నాడు.

"ఏందయ్యా?"

"గొడ్డొచ్చినయాల... బిడ్డొచ్చినేల... అంటారు పెద్దోళ్లు. పెండ్లాం మొచ్చిన కాన్నుంచి నీకు దశ దిరిగినట్టుందిబ్బీ! సెరువు కింద నారు మడులన్నిట్లో నీది మొగోనాలుంది. అది పండే లోపల పట్నవాసమొస్చది. రాతంటే అట్టుండాల ..."

అర్థం కానట్లుగా చూశాడు ఆయనకేసి.

"మీ అత్త జెప్పిందిలే. మిమ్మల్ను కడప తీసప్పోయి యాపారం పెట్టిస్తాదెంటలే... ఈ మట్టి పిసుక్కొనే దానికన్నా అదే మేలులే.."

మరేం మాట్లాడలేదు. శివుడు.

ఈ విషయాన్ని గురించి సరోజమ్మ ఊర్లో చాలామంది దగ్గర మాట్లాడిన సంగతి అతని చెవిని సోకకపోలేదు.

విననట్లే, పట్టించుకోనట్లే వెళుతున్నాడు గాని మనస్సులో తొలుస్తూనే వుంది. ఏవో ఉపద్రవపు అలలు తనకేసి తోసుకొస్తోన్నట్లుగా అనుభూతికొస్తోంది.

రాత్రి సుబ్బారెడ్డి కూడా అదే మాటన్నాడు.

"మిమ్మల్నందర్నూ విడిచి నేనేడికి పోతానులేరా బావా! నీ పెండ్లి జెయ్యంది ఊరిడుస్తానా?" నవ్వుతూ అన్నాడు తను.

మిత్రుల మధ్య చెతుర్లాడుతూ హుషారుగా కన్పిస్తున్నాడేగాని లోలోపల అలజడిగానే ఉంది. ఎంత తమాషాగా ఉందామనుకొన్నా, ఏవో సంభాషణల్లో మునిగిపోవాలని ప్రయత్నించినా అలజడి తగ్గేట్టులేదు. దాన్ని గురించి తన ప్రాణస్నేహితులతో చెప్పుకోవాలని ఉంది. అత్యంత సన్నిహితుల వద్ద మొరపెట్టుకొని సలహాలు తీసికోవాలని ఉంది.

ఆ సన్నిహితులెవరో ఎంతసేపు వెదకినా మనస్సుకు తట్టలేదు.

ఎద లోపలి అలజడి మాత్రం తగ్గలేదు. భోంచేస్తూ వున్నా, మాట్లాడుతున్నా, పనిచేస్తున్నా ఓవైపు దాని ఉనికి అది చాటుతూనే ఉంది.

ఈ సమస్యను సులభంగా చేత్తో తుడిచేయగల మిత్రులెవరో ఉన్నారు. వాళ్లకోసం అన్వేషణ...

ఉన్నట్టుండి ఒకానొక క్షణంలో హఠాత్తుగా అర్థమైంది- ఆ మిత్రుడు 'గౌరి' అని. ఆమెకు మాత్రమే తనలోని అలజడిని తొలగించే శక్తి వుందని.

మరోవైపు తార్కికంగా ఆలోచిస్తే- ఈ సమస్యను పరిష్కరించేందుకు గౌరి తగదనిపిస్తోంది. ఆ తల్లి కూతురే గదా ఈవిడ! నగరవాసం అలవాటైన ఆడది. తల్లికే వత్తాసిస్తుందేమో! గౌరిమీద అంతులేని ఇష్టంతో తనిట్లా ఆలోచించటం లేదుగదా!

కష్టమైనా సుఖమైనా ఆమెతో పంచుకోవాలనేది తన సిద్ధాంతం. కాబట్టి సమస్యను ఆమె ముందే ఉంచాలని నిర్ణయించుకొన్నాడు చివరగా.

రాత్రికే ఆ ప్రయత్నం చేశాడు.

"తొందర్లో మనల్ను కడపకు తీసప్పోతానని ... మీ అమ్మ అందరితో చెప్పిందంట'' అన్నాడు.

"పోవాలిగదా బావా! మా మామ గొడవ





మాఘమాస పెళ్ళిళ్ళకు..

# వెడ్డింగ్ కలక్షన్స్

సరికొత్త స్టాకుతో...

## కంచిసొసైటీ పట్టుచీరలు, పట్టులంగాలు

# కంచి ధరలకే

- బెనారస్ హై ఫ్యాన్సీ
- హై ఫ్యాన్సీ వర్క్స
- డిజైనర్ వర్క్స
- గద్వాల్ పట్టు
- కొత్తకోట పట్టు
- కోలం పట్టు
- రాజ్‌కోట్ పటోల
- పుట్టపాక శారీస్
- గాగ్రాస్
- డ్రస్ మెటీరియల్స్

నవ్యత, నాణ్యత మరియు
తగ్గింపు ధరలలో ...
అగ్రగామి.

# డి. నాగేశ్వరరావు

శా ✣ రీ ✣ హౌ ✣ స్

1వ లైన్, గాయత్రినగర్, విజయవాడ - 8. ఫోన్ : 2487409

చతుర 30 వసంతాలు

తగ్గుతానే పోవాలిగదా!"

శివుని మొహంలో ఏదో ఉలికిపాటు.

"అత్తగారింటికాడ అల్లెం తినకుండా నువ్వెట్లా అల్లునివౌతావు! పోవాల... అల్లెం తినాల... బలిసి రావాల... ఈ ఊరి గుండెత్తాల..." హుషారుగా చెప్పింది.

నవ్వాడు అతను.

కొద్దిసేపయింతర్వాత మెల్లిగా అన్నాడు "అల్లెం తిని వొచ్చేందుక్కాదంట గౌరి..." అంటూ.

"మరి..."

"మనం అక్కడే ఉండాలంట. ఎన్ని రోజులు దున్నినా ఈ బూముల్లో పంటలు పండవంట- కరువుల్లప్ప. కడపలో అంగడి చూసుకొంటావుంటే సుగంగా బతకొచ్చునంట..."

అతని మొహంలోకి తదేకంగా చూసింది గౌరి.

మాటల బరువు ఆమెకేదో విప్పి చెబుతోన్నట్లుగా అన్పించింది.

కొద్దిసేపు మౌనం తర్వాత అడిగింది, "నీ ఉద్దేశ్యమేంది బావా? నువ్వేమనుకొంటాండవో చెప్పు" అంది.

సమాధానం చెప్పకుండా తలొంచుకొని ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు.

మరోసారి అడిగింది.

కొంత సమయం తర్వాత మెల్లిగా తలెత్తాడు.

అప్పటికే అతని కనుగుడ్లమీద ఏదో మార్పు.

"గౌరీ... గౌరీ... నేనీ పల్లెను విడిచిపెట్టి రాలేను..." అంటూ ఒక్కసారిగా ఆమె దగ్గరకు చేరి ఆమె వొళ్లో తలదాచుకొన్నాడు.

గొంతులోని మార్పు అతని మనోస్థితిని పట్టిచ్చింది గౌరికి. అతని ఎద లోతులు ఆమెకు అర్థమయ్యాయి.

ఈ మట్టిలో పుట్టి, ఈ దుమ్ములో పెరిగి, ఈ నీళ్లు తాగి, ఈ గాలి పీల్చిన తనుటౌను జీవితంలో ఇమడలేనని బలంగా చెబుతోన్న అనుభూతి.

తన్నెవరో బలవంతంగా తీసికెళుతోన్నట్లు, రక్షించమంటూ భార్య వొడిలో శరణు వేడినట్లు ...

బహుశా అతడిని తీసుకెళ్లే శక్తుల్లో తననూ ఒకదాన్నిగా భావించుకోవటం లేదు గదా!

**ఈ మట్టిలో పుట్టి, ఈ దుమ్ములో పెరిగి, ఈ నీళ్లు తాగి, ఈ గాలి పీల్చిన తను టౌను జీవితంలో ఇమడలేనని బలంగా చెబుతోన్న అనుభూతి**



"మా మామ మంచివాడయినప్పుడు గదా బావా! సాధువైనప్పుడు గదా మాయమ్మ మనల్ను తీసప్పోయేది. అప్పటికంతా ఇంకో కరవొస్తాదిలే..." నవ్వుతూ చెప్పింది.

ఆమె ఒడిలోంచి చాలాసేపటిదాకా లేవలేదు అతను.

వీపుమీద రెండు చేతుల్తో తడుతూ కూచుంది- చిన్నపిల్లాడిని జోకొట్టినట్లుగా.

పసిపాపనిలాగే ముచ్చటగా పడుకొని వున్నాడు అతను. తన సమస్యను నివేదించుకొని నిశ్చింతగా ఉన్నాడు.

చంటిపిల్లాణ్ణి తాకినట్లే వుంది ఆమెకు.

ముద్దుగా వుంది. గోముగా వుంది. అతన్ని తల్లిలా తను సముదాయించటం కొత్తగా ఉంది.

అతను శరణాగతి కోరిన కొడుకుగా ...

తను సముదాయించే తల్లిగా ...

ఈ భావనే వింతగా ఉంది.

ఏదో తాదాత్మ్యం కలిగిస్తూ ఉంది.

ఇలాంటి భావనే తనకు గతంలో ఎప్పుడో కలిగినట్లుగా గుర్తు. తనప్పుడు ఇంతగా

పూర్తిస్థాయిలో దాన్ని అనుభూతికి తెచ్చుకోలేదు కాబోలు... రేఖామాత్రంగా మనస్సులో మెదిలి మాయమైంది ... భోజనం వడ్డించి తినమంటూ ప్రాధేయపడటం, ఆకలిగాలేదని అతనంటోన్నా విన్పించుకోకుండా బంగపోవడం... అప్పుడు హఠాత్తుగా తన తల్లి గుర్తుకొచ్చి సిగ్గేసింది ... ఆ సిగ్గు వెనుక అసలు భావన మాతృప్రేమగా అర్థమయ్యే అనుభూతి ఇప్పుడు.

ఒక విధమైన తన్మయ భావనలో మునిగిపోయింది గౌరి.

* * *

మోటార్లు బిగించిన నాలుగైదు బోర్లవద్ద పరిశీలించి చూశాడు శివుడు. బావులు రీచార్జి అయినట్టున్నాయి.

గొంతు పట్టుకొన్నట్టు అప్పుడొక చెంబెడు ఇప్పుడొక చెంబెడు కాకుండా ధారాపాతంగానే దూకుతున్నాయి నీళ్ళు.

తనూ మోటారు దించి చూడాలి.

బోరులోంచి పైకి తీసి ఇంట్లో ఎగబెట్టి రెండేండ్లవుతా ఉంది. అది సరైన స్థితిలో ఉందో లేదో చూడాలి.

మిరప ఇంకా మొలకెత్తలేదు.

సేద్యం చేసిన తువ్వచేలు ఎర్ర తివాచి పరచినట్లు అందంగా ఉన్నాయి.

దూరంగా చెట్ల మీద గోజీత పక్షులు గొంతు చించుకు అరుస్తున్నాయి. వంకదరిని కలివెచెట్లు ఆకర్షించాయి అతన్ని. వాటి రెమ్మల్నిండా పచ్చికాయలు, నల్లని కనుగుడ్ల లాంటి పళ్ళు.

దగ్గరే వున్న మర్రి ఆకుల్ని కోసి దొన్నెగా కుట్టి దాని నిండా కలివెపండ్లు కోసికొని ఇంటిదారిబట్టాడు.

ఉన్నట్టుండి తలమీదుగా విమానం మోత.

తలెత్తి చూసేసరికి నల్లని మేఘం వొకటి తనమీదుగా దూసుకెళుతున్నట్లనిపించింది.

అది తేనెటీగల మందగా అర్థమై పక్కకు తప్పుకొనే లోపలే తనను వొరుసుకొంటూ, ఢీకొడుతూ వెళ్లే ఈగలు...

ఎక్కడో పూవులున్న తావు కోసం... సుంకు మీదున్న సొద్దచేలో, పూతమీదున్న పత్తిచేలో వాటిని ఆకర్షించి వుంటాయి.

గౌరి గుర్తొచ్చింది.

ఈ దృశ్యం ఆమెకు తటస్థపడుంటే ఎంతగా ఆనందించేదో!

చెరువులో ఈదేందుకు ఇష్టపడుతుంది. చేల గెట్లెంట, తిరిగేందుకు ఆనందపడుతుంది. ఉరిమే మేఘాలన్నా, కురిసే చినుకులన్నా, మెరిసే మెరుపులన్నా ఉత్సాహంతో ఉరకలెత్తుతుంది. తనపట్ల ఎంతో ప్రేమగా ఉంటుంది. మరి... ఈ పల్లెను వదిలేందుకు ఎందుకు ఇష్టపడుతోన్నట్లు?

ఆలోచిస్తూ ఇంటిదారిబట్టాడు.

వంక దిగి గట్టెక్కబోతోండగా చెట్ల చాటు నుంచి ఏవో మాటలు.

ఒక్క క్షణం ఆగి చెవులు రిక్కించాడు.

మరో నాలుగడుగులు ముందుకేశాడు.

ఆ మాటలు తనను గురించేనని అర్థమయ్యేసరికి అలాగే నిలబడ్డాడు.

ఆ గొంతు తనకు చిన్నాయన వరసయ్యే పెద్ద మల్లారెడ్డిది.

"చేలనీ, సేద్దెమనీ, బోరనీ,పైరనీ ఎందుకో ఈ పిల్లోడు ఆరాటపడ్తాండుగాని - ఆ పిల్ల ఈన్నీడ ఉండనియ్యదే ... పిట్ట లేచిపోయేట్టే ఉంది. ఈన్ని లేపకపోయ్యేట్టుంది... ఈని మీంద మర్లుబడి వొచ్చింది. మల్లెపువ్వట్టా తల్లో ముడుచుక పోద్ది..."

తన్ను గురించే... తన భవిష్యత్తు గురించే... సరోజమ్మ మాటలు ఆధారంగా జరగబోయేదాన్ని ఊహించి చెబుతున్నాడు.

వినబుద్ధి కాలేదు శివునికి

ఏదో ఆదుర్దా... మరేదో భయం... ఇంకేదో అలజడి...

మనస్సు లోపలి పొరల్లో అన్ని భయాల్ని అణచి వేసేందుకు ప్రయత్నిస్తూ ఆమె పట్ల విశ్వాసం.

తనామెను లేవదీసుకు రావటం వల్ల వాళ్ల కష్టాలు తీరాయని రంగస్వామిలాంటి వారి అభిప్రాయం.

ఆమెను తను లేవదీసుకొచ్చాడనే అనుకొన్నాడు.

ఇదేమిటి? ఇప్పుడు. మళ్లీ తన్నామె లేపుకుపోవటం!

ఆమె తనను టౌనుకు తీసుకపోవటాన్ని వీళ్ల భాషలో లేపుకుపోవటంగా వ్యాఖ్యానించినా - వీళ్లంతా దాన్ని సమర్థిస్తున్నారు. తన జీవితం ఇక్కడ మట్టిపాలు కాకుండాలంటే ఆమె తన్ను లేపుకుపోవటమే మంచిదంటున్నారు.

ఆమె అట్లా చేయదని ఎంత సర్దిచెప్పుకొన్నా లోలోపల సర్దుబాటు కాలేకపోతున్నాడు.

తన మామ సాధువుగా మారడనీ, తమను కడపకు తీసికెళ్లే ప్రసక్తే లేదనీ అంటోంది గౌరి.

ఉన్నఫళాన వీరారెడ్డి సాధువుగా మారకున్నా, ఏదొక నేరం చేసి జైలు పాలయితే- అతని అడ్డంకి లేకుంటే - తాము కడపకు వెళ్లక తప్పదని గదా ఆమె మాటల అర్థం.

'ఈ లోపల మరో కరువొస్తుంది లెమ్మ'ని కూడా అంది. అంటే - కరువొస్తే తాము శాశ్వతంగా వలసపోవలసిందేనని గదా ఆమె మాటలకర్థం.

లోలోపల ఈ కరవు నేలను వదలి టౌన్లో సుఖంగా బతకాలనే ఉంది కాబోలు ఆమెకు.

ఆలోచిస్తూ ఇంటికెళ్లాడు.

కలివె పళ్ల దొన్నె ఆమె ముందుంచాడు.

కాళ్లు మొగం కడుక్కొని వచ్చి పీటమీద కూచున్నాడు.

అన్నం సెరవా, కూరకుండా తెచ్చింది ఆమె.

ఇద్దరూ భోజనానికి కూచున్నారు.

"బోరులో నీల్లొచ్చినట్టుండాయి. మోటారు బిగించాల..." అన్నాడు.

"బిగించి..."

"ఎడగారు పొద్దుతిరుగుడు పైరు పెడదాం."

"ఎన్ని నెలలకు పండుతాది?"

"సంక్రాంతి దాటాల ..."

"అయితే సంక్రాంతిగ్గూడా మా ఊరికి పొయ్యేదుంటదో ఉండదో..." సాలోచనగా అంది.

"మీ అమ్మనే ఇక్కడికి రమ్మంటే సరి..."

అతనికేసి అదోలా చూసింది.

"అల్లుండ్ల పండగ గదా బావా అది!" "కొత్త అల్లుండ్లంతా అత్తగారిండ్లకాడ ఉండే పండగ తెలుసా... నువ్వు మా ఇంటికి రావాల్సిందే..." నవ్వింది.

ఒక్క క్షణం ఆమెకేసి కళ్లార్పకుండా చూసి మజ్జిగ పళ్లెం నోటికెత్తాడు శివుడు.

పండుగకు పుట్టింటికెళ్లిన ఆడపిల్ల తన భర్తతో కలిసి అయిన వాళ్ల ఇళ్ల వద్దకెళ్లి ఆప్యాయంగా చూడబడటం, తనతోటి స్నేహితురాళ్ల వద్ద భర్త పేరు మీద పరాచి కాలు మోయటం, తమ ఈడుజోడుని చెలి కత్తెల దృష్టి కోణంతో కొలత వేయించుకో వటం, చిన్నప్పటినుంచి పెనవేసుకొంటూ వచ్చిన వయస్సుల సాన్నిహిత్యం, తన చుట్టూ కూచుని ప్రశ్నల చూపుడువేల్లతో ప్రణయ రహస్యాల తంత్రుల్ని మీటి మార్మిక సంగీతాన్ని వినటం, తనే కాకుండా



తన సహచరుడు కూడా వాళ్లకు అర్థం కావటం... ఇవన్నీ ప్రతి కొత్త పెళ్లి కూతురూ అనుభవానికి తెచ్చుకొనే అపురూప అవకాశపు బృహద్రూపమే గదా పెద్ద పండుగ!

శివునితో కలిసి సంక్రాంతి పండక్కు పుట్టింటికి వెళ్లే అనుభవాన్ని ముందే ఊహించుకొనేందుకు ప్రయత్నించింది గౌరి. అతన్ని ఎగతాళి చేసే బావమరదులు లేకపోవచ్చు అన్నీ తానే అయి అనుభూతించాలి. తన మామ పీడ ఏదొక విధంగా తొలగిపోతే చాలు.

రుమాలుకు చేయి తుడుచుకొంటూ లేచి బైటకు నడవబోయాడు శివుడు.

"ఎక్కడికి?" అడ్డుకొంది గౌరి. "ఇవెవ్వరు తింటారు?" అంటూ కలివెపళ్ల దొన్నె తెచ్చింది.

సాయంత్రంగా నారుమడి వద్దకెళ్లి తిరిగొస్తోంటే ఊరిబైట ఆశ్రమం వద్ద సాధువు కన్పించాడు. ఎవరో కొత్త వాళ్లతో మాట్లాడుతున్నాడు.

దగ్గరగా వెళ్లాడు శివుడు.

ఏవో పురాణ విషయాల్ని వివరిస్తున్నాడు ఆయన. కాశినాయన చెప్పిన నీతి వాక్యాల్ని ఉటంకిస్తున్నాడు.

"జేజినాయనా, కాశినాయనా ఇద్దరూ ఒక్కటే. అవతార పురుషులు. జేజినాయన భక్తుడు కాలజ్ఞాన తత్వాలు పాడితే, కాశినాయన భక్తులు అన్నం పరబ్రహ్మమని గొంతెత్తి చెబుతారు. ఆ బ్రహ్మమెవరు? జేజినాయనే..." చెప్పుకొస్తున్నాడు.

ఆయన మాటలు క్రమేణా ఆలుమగల మధ్య సంబంధాల మీదుగా మళ్లాయి. వశిష్టుడు, అరుంధతిలాంటి జంటల అనురాగాన్ని ఉదహరిస్తూ మాట్లాడుతున్నాడు.

"సాధయ్యా! నాదో చిన్న డౌటు" వినయంగా ప్రశ్నించాడు శివుడు.

చెప్పు నాయినా!"

"కొంతమంది ఆడోల్లు ముసిలోల్లయ్యే దాకా కూడా పుట్టింటి మాటొచ్చేసరికి 'మా ఇండ్లు మా ఊరు' అంటారే... ఎందుకయ్యా? మొగుడు, కొడుకులు, కూతుర్లూ, మనమండ్లూ అందరూ ఉన్నే ఈన్నే- కట్టె మట్టిలో కలిసే ముందు కూడా పుట్టింటినే మా ఇండ్లంటారయ్యా!" అమాయకంగా మొహం పెట్టి అడిగాడు.

శివుని వంక ఎగాదిగా చూశాడు సాధువు.

కాశినాయన వెంట చాలాయేళ్లు తిరిగిన వ్యక్తి ఆయన. నాయనగారి భావాలు నరనరానా జీర్ణించుకొన్న మనిషి.

"చాలా లోతైన ప్రశ్న నాయినా!" అంటూ కళ్లు మూసికొని కొంతసేపు మౌనం వహించిన తరువాత గట్టిగా గాలి వదులుతూ శివునికేసి చూశాడు.

"మాయ నాయనా! మాయ.. వ్యామోహం... కొంతమంది అమ్మగారు నెత్తిమీంద ఆ మూడు దోసిళ్ల విత్తులు పడగానే పుట్టింటిని మరచిపోతారు. పుట్టిల్లు ఎప్పుడో చుట్టపు చూపు అవుతది. మరికొంతమందేమో కాటికి మోసప్పోయే దాకా కళ్లు చెవులు పుట్టింటికే అంటిస్తారు. పుట్టింటి మీద మర్లు వొదులుకోలేరు... నాయన జెప్పేవాడు. చిలకపాడులో ఒకమ్మ అత్తగారింట్లో అడుగు పెట్టింది మొదలు పొద్దుగూకులూ పుట్టింటి దిక్కే తలదిప్పి సూస్తాండేదంట. అట్లని ఒక్కటే పోదామనిలేదు. మొగుడు తోడుండాల. మొగున్ని గూడ లేపుకుపోవాలి. వాన్ని యిడ్సి ఒక్క నిమిసె ముండలేదు. తన అమ్మగారింటికన్నే ఉండిపోదాం రమ్మని మొగునితో ఒకటే పోరు. మొగుడు పలక్కపోయేసరికి కూడూ నీల్లు గ్గబట్టిందంట. ఇంట్లో వాల్లందరికీ ఏం జెయ్యాల్నో దిక్కుతోచలే. నాయన ఆ దోవన పోతాంటే సెప్పి మొత్తుకుండెలే ఆ

MANAGING BY VALUES

# *Celebrating* 23 *years*

**Career oriented women**

**While celebrating 2007**

**Make a resolution**

**To enter world's**

**Most creative & lucrative**

**Career-Beauty Therapy**

**Empower yourself at**

*mina*

Beauty School

with

**MS.ZARIN EHTESHAM**

CIDESCO (Zurich), L'Oreal (Paris)
City & Guilds (London), ITEC (England)
(Over 22 years exciting professional experience)

In all probability, by 2008, you will be
**A Class Apart-** Professionally,
Economicaly & Socially

**Contact: 10.00 to 7.00 p.m.**
**(All working days)**

"LEARN FROM THE LEADER"

*mina*

BEAUTY CLINIC

BEAUTY SCHOOL

BOUTIQUE

*mina* **BEAUTY CLINIC**

20-13-16, Near Big Mosque, Kakinada-1. **Ph: 0884-2371203, Cell: 98484 64934.**
**Flat -303, 4th Flour, Reliance Krishna Apts., Hill Fort Road,**
**Opp: Public Gardens, Behind Kalanjali Show Room, Hyderabad-500 001**

చతుర 30 వసంతాలు

పిల్ల మామ. అంతా విని సిన్నగా నవ్వింరు నాయన. "ఆ యమ్మి మొగుని మీంద అలివి గాని మర్లు పెంచుకొన్నెది గాని మొగుని సంసారం మీద మర్లు పెంచుకోలేదోయ్! మొగున్ని నావాడని అనుకొంటాంది గాని వాని ఇంటినీ, పొలాన్నీ, బర్రెలనూ, కోళ్లనూ 'నావి' అనుకోవటంలేదు. వాటి మీద మర్లు పెంచుకొనేట్టు జెయ్యండి..." అని చెప్పె. అదీ నాయినా సంగతి. మొగునికి సంబంధించిన సమస్తాన్నీ నాదనుకొంటే పుట్టింటి ఉందన్న మాట గౌరి.

అందుకే - తల్లి భావాలకు అనుగుణంగానే స్పందించగలుగుతోంది.

తనను ఇక్కణ్నించి తీసికెళ్లేందుకే మొగ్గు చూపుతోంది.

పొలంపైన ప్రేమ లేకున్నా పొలాన్ని దున్నిన శ్రమ మీదయినా ప్రేముండాలి. పైరును పెంచే చెమట మీదయినా వ్యామోహం కలగాలి.

ఆలోచిస్తూనే ఉండిపోయాడు అతను.

రాత్రి చాలా సేపటి దాకా నిద్రబట్టలేదు.

అతని ఎదలమీద ఆదమరచి నిద్రబో



**పొలంపైన ప్రేమ లేకున్నా పొలాన్ని దున్నిన శ్రమ మీదయినా ప్రేముండాలి. పైరును పెంచే చెమట మీదయినా వ్యామోహం కలగాలి**

మీద మర్లు చస్తాయి. లేదంటే వాళ్లు చచ్చే దాకా ఆ దిక్కే ఎగమల్లి సూస్తాంటారు..." చెప్పాడు సాధువు.

చాలా సేపు ఆ విషయం మీదనే చర్చ జరిగింది.

చివరగా ఒక మాటన్నాడు సాధువు.

"మొగుడు నా వాడనుకొనే స్వేచ్ఛ ఏ మొగోడయినా తన పెళ్లానికి యిస్తాడు. మొగునికి సంబంధించిన సమస్తమూ నాదనుకొనే స్వేచ్ఛ భార్యకు కలిగించిన మొగోడు చాలా అరుదు నాయినా!" అని

రాత్రి పడుకొన్న తర్వాత కూడ సాధువు చెప్పిన మాటలే అతని చెవుల్లో గింగురుమనసాగాయి.

అంటే... గౌరికి ఈ పల్లెమీదా, ఈ ఇంటి మీదా, పొలం మీదా, పైరు మీదా మర్లు పుట్టటం లేదన్నమాట.

వాటిని చూసి ఆనందించటం వేరు. వాటితో కలిసిపోయి బతకటం వేరు.

చూసి ఆనందించే స్థితిలోనే ఇంకా తోన్న గౌరికి ఎందుకో మెలకువ వచ్చింది. అతను మేలుకొని వున్నాడనే విషయం అర్ధమైంది.

ఎదల మీద చేతులూని తలపైకెత్తింది.

అతని కళ్లల్లోకి నిశితంగా చూస్తూ "నిద్రబట్టలేదా? " అడిగింది.

మౌనంగా వున్నాడు.

"వొల్లు బాగలేదా? "

"అదేం లేదు... నిద్రబట్టలే... అంతే..." అన్నాడు.

"ఉక్కబోస్తాంది గదూ!"

ఔనన్నట్లుగా తలూపాడు. "మోడాలుండాయి గదా! గాలి బిగదీసింది".

మంచం దిగింది ఆమె.

విసనకర్రతో వచ్చి అతని పక్కగా కూచుని విసరసాగింది.

ఆమెకేసి తదేకంగా చూశాడు అతను.

అప్పుడనిపించి- తను అపార్థం చేసుకొన్నాడేమోనని.

ఆమెకింకా పొలం పనులతో పైరుపచ్చ

# సంతానంలేని వారికి శుభవార్త!



- ★ సంతానం లేని దంపతులకు చికిత్స చేయబడును.
- ★ అనేక చోట్ల మందులు వాడి చికిత్సలు చేయించుకున్నా సంతానం కలగని దంపతులు మరియు టెస్టుట్యూబ్ బేబి చేయించుకొని (IVF) ఫెయిలయిన వారు కూడా సంప్రదించవచ్చును.
- ★ వీర్య కణాలు తక్కువగా ఉన్నవారు కణాలులేని వారికి (టెస్టిస్ నుండి అస్పిరేషన్ చేసి) TESA, PESA మొదలగు ప్రక్రియల ద్వారా సంతానాన్ని పొందవచ్చు.

**Facilities:**

IUI, IVF (టెస్టు ట్యూబ్ బేబి) ICSI సెమెన్ బ్యాంక్, లాప్రస్కోపి, హిస్టిరోస్కోపి Hormones సంతాన సాఫల్యతకు సంబంధించిన అన్నిరకాల సదుపాయాలు అందుబాటులో ఉన్నాయి.

సంప్రదించడానికి వచ్చేటప్పుడు పాత రిపోర్టులు ఏవైనా ఉంటే తీసుకురాగలరు.

– డైరెక్టర్

☎ 0878 - 2260348

# సౌమ్య సంతాన సాఫల్య కేంద్రం

రాజా టాకీస్ దగ్గర, కరీంనగర్

సెల్: 93462 41938

లతో సరైన పరిచయం ఏర్పడలేదు గదా! వాటి పట్ల ఆమె నిజమైన స్పందనలు గమనించక ముందే ఒక నిర్ణయానికి రావటం పొర బాటు. అందరు ఆడాళ్లలాగే ఆమె కూడా పుట్టింటిని 'నా యిల్లు' అంది. ఆ ఒక్కమా టను పట్టుకొని ఇంతదూరం ఆలోచించవల సింది కాదు.

ఆ భావన కలగగానే అతని మనస్సులోని మేఘాలన్నీ విచ్చిపోయినట్లుగా అన్పించింది.

ఆమెను తన ఎద మీదకు చేర్చుకొని గాఢంగా కౌగిలించుకొన్నాడు.

**5**

"దేవుడా! నేను కోరుకున్నట్టే నా మేనకో డల్ని కోడలుగా ఇచ్చినావు. దానికింత మంచిబుద్దే ఇచ్చినావు. నా కొడుకు మీంద మర్లు బుట్టేలా చేసినావు. ఇన్ని చేసినోనివి అది నా కొడుకును గద్దలా తన్నుకుపోకుం డా సూడు సామీ! బూమమ్మ ఎదలుమెత్త జేస్తివి. అవి గట్టిబడకముందే నాలుగు కబ ళాల తిండి సంపాదించుకొనేట్టు సూడు తండ్రీ! మమ్మల్ను గింజ గింజా యేరి కూడ బెట్టే చీమల్ను జెయ్యి నాయినా! యీ చెట్టు ఎండిపోతోంది. ఆకులు రాలిపోతండాయి. దీపం ఆరే రోజుల్లో గూడు పాడుబడకుండా సూడు సామీ! పిట్టలు రొండూ గూడు విడి చిపోకుండా సూడు దేవుడా!"

"బఱ్ఱె నాది. పాలు వాల్లకే సామీ! పొదుగు నాది. కోడి పిల్లలు వాల్లకే దేవరా! కాపలా నాది. పంటవాల్లకే అయ్యా! నేను నీల్లు పోసి పెంచుతా. వాల్లను పండ్లు కోసు కొని తినమను. నేను శాపాలు తాపాలు మోస్తా. వాల్లు వరాలంటి పిల్లల్ను కని నా సేతల్లో బెట్టమను. యీ ఒక్క సాయం జెయ్యి మహానుభావా!"

వంక గట్టున ముక్కూమొగం అరిగిపోయిన శిల వొకటి నిలబడి వుంది.

దాని ముందు మోకరిల్లి వుంది లక్షుమ్మ.

వంక గర్భంలో లేత పచ్చిక మేస్తూ వుంది బఱ్ఱె.

చుట్టూ చేలల్లో కంది మొలకలు చాళ్లు చాళ్లుగా కన్పిస్తున్నాయి.

వంక జేడెల మీద పిడికెడంత పిట్టలు 'వుయ్ వుయ్'మంటూ ఎత్తుగా వెళ్లి అక్కడ రెక్కలు ముడిచి 'కీచు'మని ఈలవేస్తూ రాయిలా నేలకు జారి, చివరి క్షణంలో రెక్కలు విప్పి గాల్లోకి ఎగురుతూ వింత క్రీడ సలుపుతున్నాయి.

"బూమమ్మ! నాలుగేండ్లు నువ్వెండినా నిన్ను నేనిడ్సలే... నీలోకి యేర్లు బాతుకొని బతికే గడ్డి గాదమూ, చెట్టూ చేమా నీకు దూరమైనా నిన్ను నేనిడ్సలే. నా కడుపున పుట్టినోల్లు కడుపు సేత బట్టుకొని దూరంగా పోయినా నిన్ను నేనిడ్సలే. సినుకులు రాలి నువ్వు మెత్తనయితే నా వొల్లంతా బురద పూసుకొని సల్లబడితి. కరువులు వాలి నువ్వెండితే ఎదన దుమ్ముగొట్టుకొని నేను వాడిపోతిగాని నిన్నిడ్సిన్నా తల్లీ! నా కోడలు కొడుకు నన్నిడ్సిపొయ్యే సేటుకాలమొచ్చే ట్టుంది. నువ్వు సల్లగుండావు. నా ఎదాన కరువు లెందుకు కొడ్తావే అమ్మా?"

సేద్యం చేసి ఎఱ్ఱబడిన నేలమీద గొంతు క్కూచుని చేతులు ముకుళించి రెండు మోకాళ్లు సందుగా నేలకు చాచి, నుదురు ముంజేతుల మీద ఆనేలా వంగి వేడు కొంటోంది లక్షుమ్మ.

* * *

"ఒరే శివుడూ!" బైట్నించి కేక

ఆ గొంతు గోవిందమ్మదిలాగుంది.

దొడ్డి వాకిట్లోంచే తొంగి చూసింది గౌరి.

"పలకవేంరా నా బట్టా..." ఖంగ్న మోగింది. గోవిందమ్మ గొంతే. "లేడమ్మే వాడూ?" గౌరికేసి చూసి ప్రశ్నించింది.

"లేడు జేజీ! మడి దగ్గెరికి పోయిండు.."

"నా బట్ట వాడు ఎంత పన్జేసెనే!"

ఆమె గొంతు తీవ్రంగా విన్పించినా మాటల వెనక ఎక్కువ పాళ్లు వ్యంగ్యమే ఉంటుందని అనుభవరీత్యా తెలుసు గౌరికి.

అందుకే తొట్రుపడలేదు.

"ఏం జేసిండు జేజీ? " అడిగింది.

"ఏం జెప్పాలమ్మే!" అంటూ గడప దాటి లోపలకి అడుగేసింది." మా కల్లం కట్టవలో ఎన్ని రోజుల్నించి పెట్టుకొనుందో తేనెతుట్టె. మేకపోతు తలకాయంత పెద్దదమ్మే. కట్టవ లోపల కంపమండకు యేలాడ్తా ఉండె. 'పున్నానికి పూజనస్తాది. తేనె దండిగా వుంటాది. అప్పుడు లేపొచ్చు' లేమ్మని రోజూ దాన్ని సూస్తా కనిపెట్టుకోనుంటి. యీ నా బట్ట ఎప్పుడు సూసిండో ఏమో - నేనుండగానే లోపల దూరి తుట్టె వుండే మందను విదిలించి ఈడ్చకపాయమ్మే!

"ఒరే ఒరే అంటాన్నే నిలబడడే... నాకు రొంత తేనెన్నా పెట్టరా నా బట్టా అంటే ఏమంటాడమ్మే వాడు! తేనె నాకను నాకు సేతగాదంట.. మీసాలకు పూసుకుంటా నంట... మీసాలు తెల్లబడి నరుస్తా యంట... మీసాలు గడ్డాలుండటానికి నేనే మన్నా మొగోన్నే? "

నవ్వాగింది కాదు గౌరికి.

అడ్డగోడ అవతలికి వెళ్లి పైటకొంగు చాటు చేసుకొంది.

గోవిందమ్మ ముక్కు కిందా, గెడ్డానికీ అక్కడొకటి ఇక్కడొకటి లావు వెంట్రుకలు పొడుచుకొచ్చి వున్నాయి.

వాటిని చూసే వెక్కిరించినట్టున్నాడు శివుడు.

నవ్వుకొంటూనే తేనెగిన్నె బైటకు తీసింది.

"నువ్వొస్తే తేనె పెట్టమన్నాడు జేజీ! కల్లం కాడ జనమంతా ఉన్నారంట. అందరికీ చాలదని వొచ్చిండంట..." చెప్పింది.

"తేనె సంగతి సరేమ్మే! నా మీసాల సంగతి వానికెందుకంటా? " ఆవేశంతో బుసలు కొడుతూనే ఉంది ముసలామె.

"ఏదీ... అరచేయి చాచు..." అంది గౌరి.

గొణుక్కొంటూనే చేయి చాచింది గోవిందమ్మ. ఆ చేతిలో తేనె పోసింది గౌరి.

నాలుక పొడవుగా చాచి తేనె నాకి చప్పరించి లొట్టవేసింది ఆమె. "ఒరే నా బట్టా! ఎంత రుచిగా ఉందిరా!" శివుణ్ణి తిట్టుకొంటూ, నాలుకతో నాకుతూ, చప్పరిస్తూ, లొట్టలు వేస్తూ గౌరికి కన్నుల పండువు చేసింది.

గోవిందమ్మ వెళ్లిన కొద్ది సేపటికి రమణమ్మ వచ్చింది. శివుని గురించి మాట్లాడింది. అతణ్ణి పెంపుడు పక్షిలా లొంగదీసుకొన్న కిటుకేమిటో చెప్పమంటూ మరోసారి అడిగింది. టౌను సంసారం ఎప్పటినుంచంటూ ఆరా తీసింది.

"ఏం కూర చేసినావూ? " అడిగింది

"పప్పు"

"మునక్కాయ అనుకొన్నాలే .... " అంది రమణమ్మ.

ఆమె కేసి ప్రశ్నార్థకంగా చూసింది గౌరి.

కొంతసేపు మాట్లాడిన తర్వాత రమణమ్మ మాటలకు అర్థం తెలిసి వచ్చింది.

దొడ్లో చెట్టుకున్న మునక్కాయలు ఎవరో కోసుకు పోయారట. ఆమె అనుమానం శివుని మీదుంది.

మునక్కాయల గురించి కూడా కాదట. తను స్నానం చేస్తోండే అదను చూసి కాయలు తెంపుకుపోయాడట. మునగచెట్టు వద్ద దొడ్డి గోడెక్కితే తన తడికల చాటు జలక్రీడ బట్టబయలవుతుందట ...

ఎవరో తన్ను నగ్నంగా చూశారని ఆమె అనుమానం. అయితే ఆ విషయాన్ని బైటకు చెప్పటం లేదు.

ఆమె అవస్థ చూసి గౌరికి నవ్వొచ్చింది.

ఈ రోజు శివుడు మునక్కాయలు తీసుకు రాలేదు గాబట్టి కుదుట బడి నవ్వుకొంది.

ఈ మధ్య తరచు ఇటువంటి ఫిర్యాదులు ఎక్కువవుతున్నాయి అతని మీద.

సరోజమ్మ రెండవసారి వచ్చి వెళ్లింతర్వాత, వాళ్లను టౌనుకు లేపుకపోతానని ప్రకటించిన తర్వాత అతని చర్యల్లో ఏదో మార్పు.

గౌరి సరోజమ్మ వద్ద పడ్డ ఆరాటం చూసి బాగా స్పందించాడు. ఆమె ఆహారపుటలవాట్లు తెలిసిపోయాయి కాబట్టి కొత్త రుచుల కోసం పడరాని పాట్లు పడుతున్నాడు. పొలాల్లో తిరిగేటప్పుడు తినే ఆకు ఏది కన్పించినా కోసుకొస్తున్నాడు. కూరగాయల కోసం పక్కూర్లకు సైతం వెళ్లి వస్తున్నాడు. ఉరుము ఉరిమినప్పుడు కంప కట్టవల్లో మొలిచే పుట్టగొడుగుల కోసం వెంపర్లాడుతున్నాడు. అవి కనిపిస్తే చాలు ఎవ్వరికీ తెలీకుండా పీక్కొని టవల్ లో దాచుకొస్తున్నాడు. 'అక్కా, అత్తా' అంటూ తోటల వద్ద బతిమాలి కాయో కసరో పెట్టించుకొస్తున్నాడు. తేనెతుట్టె ఉందని తెలిస్తే చాలు అది ఎంతదూరమైన సరే నడచిపోతున్నాడు. ఎంత ఎత్తు చెట్టయినా సరే ఎక్కుతాడు. కంపల్లో దూరుతున్నాడు. బండల మీద పాకుతున్నాడు. ఈగల్ని పార దోలి తేనెతుట్టెను పట్టుకొని ఉరుకుల పరుగుల మీద ఇంటికి చేరుకొంటున్నాడు. సావాసగాళ్లు వెంటబడుతున్నా ఎవ్వరికీ అందకుండా ఇంట్లో దూరి గౌరి చేత బెడుతున్నాడు. రొట్టెలు కాల్పించి తేనెలో అద్ది తినటం నేర్పిస్తున్నాడు.



తేనెతుట్టెను పట్టుకొని ఉరుకుల పరుగుల మీద ఇంటికి చేరు కొంటున్నాడు. సావాసగాళ్లు వెంటబడుతున్నా ఎవ్వరికీ అందకుండా ఇంట్లో దూరి గౌరి చేత బెడుతున్నాడు

ఒకసారి తేనెటీగలు ఒళ్లంతా కుట్టాయి. ఎర్రగా కందిపోయి ఉన్న అతని వొంటిమీద చేయి వేసి కన్నీళ్ల పర్యంతమవుతున్న గౌరిని చూసి పకపక నవ్వేశాడు.

దాంతో మరింతగా ఏడుపు పెంచిందామె.

అతనింకా బిగ్గరగా నవ్వేశాడు.

“ఈగలు కుట్టేవి కాదు. కల్లానికి ఆ పక్క నుంచి మనుసులొస్తాండిరి. వాల్లు చూస్తే తేనె ఇంటికి రాదుగదా! అందుకే ఈగల్ను లేపకుండానే కొమ్మతుంచుకొని పరిగెత్తినా. తుట్టెమీది ఈగెలు జమ్మున లేసి నా వొల్లంతా సుట్టుకున్నెయి..” కారణం చెప్పాడు.

“వాల్లకూ కొంత పెట్టొచ్చు గదా! అంత కక్కుర్తి ఏమీ?”

“వాల్లు మస్తులుగా తింటుంటార్లే. నువ్వే ఏమెరగవు. అందుకే నీకోసమే...”

ఆవేశం తన్నుకొస్తోండగా అతన్ని బిగ్గరగా కౌగిలించుకొని ప్రపంచాన్ని మరచిపోయిందామె.

ఊర్లో ఎవరింటింనుంచో పదికిలోల వేరుశెనక్కాయలు కూడా కొనుక్కొచ్చి పెట్టాడు శివుడు- ఎప్పుడైనా మధ్యాహ్నం పూట నోరెండినపుడు వేయించుకు తినేందుకు.

గుగ్గిళ్ల కోసం నాలుగు శేర్ల ఉలవలు తెచ్చాడు. ఊర్లో మునగచెట్ల మీదా, పూల చెట్లమీదా రహస్యంగా దాడిజేస్తున్నాడు.

మొదట ఆశ్చర్యంగా చూసినా తర్వాత ఆహ్లాదంగా స్పందిస్తున్నారు చాలామంది. పెళ్ళాం నోటి రుచికోసం అతను పడే అగచాట్లు చూసి నవ్వుకొంటున్నారు.

"పనెద్దును తెచ్చుకొంటే పర్లేదు. గంగిరెద్దును తెచ్చుకొంటే... అదో... అట్లా శివునిలా అగచాట్లు పడాల్సిందే..." వేలెత్తి చూపుతున్నారు.

మధ్యాహ్నం గానీ, అంబలిపొద్దునగానీ సంగటి ముద్ద చేతబెట్టుకొని ఇంట్లోకొచ్చిన అమ్మలక్కలు కూరకుండ లాక్కుని ముద్ద మీది గుంటలో తలొక గంటెడు కూరేసుకొని "ఇవి సుబ్బన్నోల దొడ్లో కాసిన తంబ కాయలు గదూ! ఎట్ట దూరిండబ్బా ఆ ఇంట్లేకి ఈ పిల్లోడు!" అంటూ పరాచికాలు.

చేలకేసి వెళ్లినపుడు తినదగిన కాయో, పండో, దుంపో- ఏది దొరికినా, అలంకరించదగిన ఏ పూవు దొరికినా దాచుకొని మరీ ఇంటికి తెస్తున్నాడు. కొత్తబండి కట్టి బొరుగులు(మరమరాలు) పప్పులు పంచినా, మొక్కుబడి ఉండి గుడివద్ద గుగ్గిళ్లు పెట్టినా, కొత్త పెళ్లికూతురు కాళ్లకు మొక్కి ఖర్జూరాలూ కలకండ కలిపిన ఆకొక్కలిచ్చినా, పెళ్లిబంతిలో లడ్డు కారేలు వడ్డించినా- చుట్టుపక్కల వాళ్లు ఏమైనా అనుకొంటారే మోననే స్పృహకూడా మరిచి నిస్సిగ్గుగా దాచుకొచ్చి గౌరి ముందుంచుతున్నాడు.

జనాలకు కూడ అర్థమైంది అతని ప్రవర్తన భోజనపు బంతిలో కూచున్నపుడు స్వీటు కారం వగైరాలను వడ్డిస్తూ "ఇది నీకు... ఇదేమో నీ పెండ్లానికి..." అంటూ అదనంగా వడ్డించి అందరూ పగలబడి నవ్వుకొంటున్నా అవేమీ పట్టించుకోడు శివుడు. పేపర్ అడిగి తీసుకుని తనపాలివి కూడా అందులో ఉంచి భద్రంగా దాచుకొని ఇంటికి తీసికెళ్తాడు.

చేలకాడ, చెట్టకాడయినా సరే అతని వంతు వచ్చేసరికి రెండు కుప్పలు పెట్టి ఎగతాళి చేస్తూ నవ్వుకోవలసిందే.

"వానికి రొండు భాగాలెందుకూ?" అని ఎవరైనా ప్రశ్నిస్తే- "పోనీలేరా పాపం ... పెండ్లామున్నోడు ..." అంటూ నవ్వులు.

చతుర 30 వసంతాలు

ఏదో ఒక అపురూప మైన పూవును తెచ్చి, అది ఎక్కడ వడలిపోతుందో నని అరచేతులు అడ్డుంచి కాపాడుకొంటున్నట్లుగా ఉంది- గౌరికోసం శివుడు పడే అగచాట్లు చూస్తోంటే.

"రేపు ఆ పిల్లకు కడుపైనా యీ నా బట్టే నొప్పులు బడ్తాడేమో!" వరసైన ముత్తయిదు వల ఎగతాళి.

"పెండ్లానికి యీపు గూడా తోముతండా వాయేందిరా నా బట్టా!" మరో అత్త వరసైన ఆడమనిషి వేళాకోళం.

"సెప్పులు బాగుండాయని మెడకేసుకొం టామా సిన్నోడా! యాడుండాల్సినయి ఆన్నే వుండాలబ్బీ!" పాతకాలపు ముసలాయన ఉవాచ.

"వీడు పెండ్లిజేసుకొన్నపటినుంచి మా పెండ్లాల పోడు పల్లేకుండాము. ఎదురెదురు కూకోవాలంట. ముద్దలుజేసి తినిపించుకోవా లంట. ఇద్దరూ పక్కపక్కన నడుస్తా పోవా లంట... యాడ నేర్చుకొన్నెవురా నాకొడకా!" స్నేహితుల ఎద్దేవా.

"అక్కడికీ చెబుతానే ఉండాము- ఆ పిల్లను వాడు లేవదీసకొచ్చిండే! అంత గో ముగా సాక్కొంటేగాని ఈ పల్లెకొంపలో ఆమె నిలబడదే" అని. "ఇనుకుంటే గదా. మీరు గూడా మమ్మల్ను లేవదీసకొచ్చిం టేనేం? అంటాండ్రు. ఎట్ల జెయ్యాల్రా? " ఓ స్నేహితుడి ఏడుపు అభినయం.

"శివన్నట్లాంటి మొగుడు అందరికీ దొర కొద్దూ..." ఓ కొత్త పెళ్లాం మరో కొత్త పెళ్లాంతో గుసగుసలు.

అన్నీ వింటున్నా చిరునవ్వే సమాధా నంగా ముందుకు నడుస్తున్నాడు శివుడు. తన కర్తవ్యానికి ఆ వ్యాఖ్యానాలన్నీ ప్రోత్సా హకాలుగానే కన్పిస్తున్నాయి.

గౌరికి మాత్రం ఆశ్చర్యంగానే వుంది. ఇంతమంది గేలి చేస్తోన్నా అతను స్పందించకపోవటం వింతగా వుంది.

పల్లెలో ఏ ఆడపిల్లకూ లభించని ప్రత్యేకత శివుని ద్వారా తనకు లభించటం పట్ల మనస్సు లోపలి పొరల్లో గర్వంగానే వున్నా తన వల్ల అతను మాటలు పడటం కొంత బాధగానే వుంది. జనమంతా తనకేసి అదోలా చూస్తున్నట్లనిపిస్తూ సిగ్గుగా కూడా ఉంది.

అందుకే రాత్రి సన్నని స్వరంతో చెప్పింది. "నువ్వు బైటికి పోయినపుడు అందరి ముందూ నన్ను మర్చిపో బావా! వాళ్లతో కలసిపో..." అంటూ.

అర్థంకానట్లుగా చూశాడు.

"నీ మీద నా ఇష్టాన్నీ, నామీద నీ ఇష్టాన్నీ ఇంట్లో చూపుకొంటే చాలదా? "

మరింత అయోమయంగా చూశాడు.

"పెండ్లి బంతిలో కూచుంటే నా పాలి లడ్డు, కారేలు అడిగి పెట్టించుకొని ప్యాక్ చేయించుకు రావాల్నా? ఎవ్వరైనా వాళ్ల భార్యల కోసం అట్లాంటి పన్జేస్తాండారా- నువ్వు దప్ప? నిన్ను అందరూ నవ్వుతాన్నే నీకేమనిపించదా? " అంది.

తేలిగ్గా గాలి పీల్చి వదిలాడు శివుడు.

"ఓస్... ఇంతేనా!" అన్నట్లుగా చూశాడు.

"నీకో భాగం నీ పెండ్లానికో భాగం అంటూ రెండు భాగాలూ నీ ముందుంచి ఫ్రెండ్స్ ఎగతాళి చేస్తొంటే నీకేమనిపించదా బావా"? అతని కళ్లల్లోకి చూస్తూ అంది.

ఆమెకెదురుగా మంచమ్మీద పద్మాసనం వేసుక్కూచున్నాడు శివుడు. కళ్లు మూసికొని ఆమె ధోరణిని సాంతం విన్నాడు. అంతా అయింతర్వాత ఆమె కళ్లల్లోకి చూపులు సారిస్తూ గుంభనగా అన్నాడు "ఒకరితో మనకెందుకు చెప్పు? " అని.

ఆమె చూపుల్లోకి లోతుగా చూస్తూ "తీప యనా చేదయినా ఇద్దరం కలిసి తింటేనే తిన్నెట్టుంటాది. నవ్వే వాళ్లకేం తెలుసు?




పాసిపండ్లోల్లు..." అంటూ ఆమె తలను తన రెండు చేతుల్లోకి తీసికొని దగ్గరగా లాక్కొన్నాడు. "నువ్వా లడ్డు, కారేల మొగం ఎప్పుడూ చూల్లేదని కాదు. కలివెపండ్లు, మేడిపండ్ల రుచి చూడలేదని గాదు. నాకొక్క నికీ తినబుద్ధి కాకనే గౌరీ! ఇద్దరం కలిసి తింటేనే తిన్నెట్టుంటాది. అందుకే ఇంటికి తెస్తాండ. మనమే సెడ్డపని జేస్తాండమా నవ్వుకోడానికి? అంతగా నవ్వితే నవ్వ నీలే... నవ్వి నవ్వి వాళ్లే అలిసిపోతారు... ఎవురు నవ్వినా ఏడ్చినా ఎందుకో మరి... నీకు పెట్టకుండా ఏమీ తినబుద్ధి కాదు గౌరీ! ఏదైనా... కష్టం వచ్చినా నీతో కలిసే అను భవించాల. సుఖం వచ్చినా ఇద్దరం కలిసే ..." చెబుతున్నాడు అతను.

ఆమెకు నోట మాట రాలేదు.

తనకు తెలీకుండానే కళ్లు తడిగావటం చాలా సేపటికి గాని ఆమె గమనించలేకపో యింది.

అప్రయత్నంగానే అతని ఎదమీద వాలి పోయింది-భావోద్వేగాన్ని అణచిపెట్టుకో లేక.

ఈ ఒక్క సంఘటన ఆమె హృద యంలో అతని సాన్నిహిత్యాన్ని మరింత గాఢంగా కోరుకొనేలా చేసింది. ఒక్క గంట సేపు అత ను కన్పించకున్నా ఆరాట పడేలా చేసింది. ఎక్కువ సమయం అత నితో ఏకాంతంగా గడపాలని తహతహలా డసాగింది. ఇరుగు పొరుగు అమ్మగార్లు తనవద్ద చాలా సేపు తిష్టవేసినా భరించలే కపోతోంది- తమ ఏకాంతానికి ఆటంకం కలిగిస్తున్నారని.

అతన్ని ఆట పట్టించేందుకు ఊర్లో జనా లకు రోజుకో కొత్త వస్తువు అందిస్తున్నారు ఆలుమగలిద్దరూ.

శివుడు వీధిలోకెళ్ళి అర్ధగంట కూడా గడ

చతుర 30 వసంతాలు

వకముందే ఏదో పను న్నట్లుగా అట్లా వీధెంట నడిచేది గౌరి. అరుగు మీది జనాల మధ్య అతను కన్పించగానే పురమాయించి పిలి పించుకొనేది. ఆమె పిలుపు అందిన తర్వాత ఒక్క నిమిషం కూడా అక్కడ ఉండేవాడు కాదు శివుడు.

తర్వాతర్వాత అందరికీ అర్థమైంది- వీధి లోకి వచ్చి అటు ఇటు ఆమె చూపులు తారాడాయంటే భర్తకోసమేనని.

"పిలుపొచ్చింది నాయినా! లోకానికి విరుద్ధంగా నీకొక్కనికే పెండ్లాముంది. ఆమె యింట్లోంచి బైటకొచ్చేతలికి నువ్వు యీధిలోంచి ఇంట్లేకి అడుగుబెట్టాల... మేం మాత్రం మా పెండ్లాల కాడ తిట్లదినాల" ఒకరి దెప్పి పొడుపు.

"మా పెండ్లాలు యిక్కడిదాకా వొచ్చి మేకలట్లా అరుస్తాన్నే మేం కదలం. నీకెం దుకురా అంత భయం? పెంటి నాయాలా!" మరొకరి అదలింపు.

అవేమీ పట్టించుకోడు శివుడు.

నవ్వుకొంటూ ఇంటికెళతాడు.

గౌరిని పల్లె పరిసరాలకు హృద్యంగా మచ్చికచేసే ఒక పెద్ద ప్రయత్నంలో శివుని చేష్టలు వూర్లో చర్చనీయాంశమయ్యాయి. పెళ్లాం కోసం అతను పడే అగచాట్లు అందరికీ నవ్వు తెప్పిస్తున్నాయి.

మిరప మొలక చాళ్లు చాళ్లుగా మొలిచి అందంగా వుంది.

కంది అయితే పుబ్బకార్తె వచ్చేసరికి జానెడెత్తున పెరిగి నవ నవ లాడుతూ చూడముచ్చటగా కన్పిస్తోంది.

వరినారు పరువానికొచ్చింది.

మడి తయారు చేసి నాటడమే ఆలస్యం.

శివుని బావకు కాడెద్దులూ బండి వున్నాయి.

ఆ ఎద్దులతోనే ఇద్దరి మడికయ్యలూ తయారుచేసికొంటున్నారు. బండి కట్టి ఎరువు తోలారు. దాన్ని మడికయ్యల్లో చల్లారు.

బావ పొలంలోకి కూడా వెళ్లి పని చేయాల్సివస్తోంది శివునికి.

దాంతో గౌరికి యింటివద్ద ఏకాంతం తప్పటం లేదు.

ఏమీ పొద్దుబోదు.

ఊర్లో ఎవరూ ఇళ్లకాడుండరు.

శివుని వద్దకు వెళ్లాలని ఉబలాటం వుంటుందిగాని అతనెక్కడో బావగారి పొలంలో ఉంటాడు. తను వెళితే అతని పని చెడగొట్టినట్లు.

రెండు ఊరపిచ్చుకలు కొట్టం కప్పులో గూడు పెట్టుకొంటున్నాయి. వాసాలకు బోదకు మధ్య పరచిన వాయిల మెల్లల సందుల్లో గడ్డి గాదంలో గూడు కట్టుకొం టున్నాయి. బైట్నించి ఎండుగడ్డిని తెస్తు న్నాయి. మూలనున్న పొరక పుల్లల్ని ముక్కున కరచుకుపోతున్నాయి. గూటి నిర్మాణ ప్రయత్నంలో సగం గడ్డి కింద రాలిపడుతోంది. తేపతేపకూ దాన్ని ఊడ వాలంటే విసుగ్గా వుంది ఆమెకు. భాద్ర పద మాసం వచ్చింది మొదలు ఈ గొడవ ప్రారంభమైంది. వినాయకచవితి పండుగ రోజయితే పత్రిలోని గరికను కూడా మోసుకపోయాయి అవి.

మధ్యాహ్నం రమణమ్మ వచ్చింది పళ్లెంలో సంకటి పెట్టుకొని.

"ఏం కూరాకూ? " అంటూ మంచమ్మీద కూచుంది. "నువ్వు తిన్నెవా!... పెట్టుకో మరి..." అంది.

తనూ సంకటి పెట్టుకొని ఆమె కెదు రుగా నేలమీద కూచుంది గౌరి. "యీపూట పొలం మీదికి పోయినట్టు లేవు. పనేం లేదా? " అడిగింది రమణ మ్మను.



# ఉభయగోదావరి జిల్లాల పట్టభద్రులకు విన్నపం

జ్ఞానానికి ఖజానా, విజ్ఞానానికి చిరునామా,
మహిళాశక్తికి నమూనా



ఎం.ఎల్.సి.గా నేనెందుకు పోటీచేస్తున్నానంటే...

* సమగ్రమైన విద్యని అందరికీ అందేలా చేయడం కోసం
* పేదలు, అణగారిన సామాజిక వర్గాలు విజ్ఞాన వంతులయ్యే హక్కుకోసం
* మహిళలకు శక్తినిచ్చి ఆత్మవిశ్వాసంతో బతికే అవకాశం కోసం
* యువతకు ఉపాధి, ఉద్యోగ భద్రతతో భవిష్యత్తుపై భరోసా కలిగించడం కోసం
* పట్టభద్రులకు గౌరవ ప్రదమైన జీవనం కోసం
* ధనం, కులం, అన్యాయం, అవినీతి - మన విలువలను నాశనం చేయకుండా పోరాటం చేయడం కోసం
* ప్రపంచీకరణ నేపథ్యంలో పోటీని తట్టుకునేలా విజ్ఞానవంతమైన సమసమాజాన్ని నిర్మించడం కోసం

నా అభ్యర్థిత్వాన్ని బలపరచి నా విజయానికి
సహకరించవలసిందిగా వినమ్రంగా కోరుతున్నాను.


## డాక్టర్ పి. చిరంజీవినీ కుమారి

M.A., Ph.D.,

(ఐడియల్ కాలేజీ విద్యార్థుల ఆత్మీయ ప్రిన్సిపాల్
నేటి కరస్పాండెంట్ మరియు పి.జి.కోర్సుల డైరెక్టర్, కాకినాడ)

**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనమండలి ఉభయగోదావరి**
**జిల్లాల పట్టభద్రుల నియోజకవర్గం ఎం.ఎల్.సి. అభ్యర్థిని**

**Cell: 98481 60230, Off: 0884-6450667**
**Fax: 0884-2368104**

"తీట గలవానికీ తోట గలవానికీ తీరికుండద న్నెట్టు కాపోల్ల కెక్కడ తీరికె!"

"మరి...? "

"నువ్వొక్కదానివే ఇంటికాడుండాల. ఇంగెవురూ ఉండగూడదా? "

"అట్లని కాదక్కా! నాకీ పొలంపని అల వాటు లేదుగదా!"

"నాకున్నెట్టూ..." దీర్ఘం తీసింది. "మాయమ్మ పనే జెప్పకుండా సాకిందెమ్మో నన్నుగూడా. ఈ మొరటు గుంపులో వొచ్చిపడి ఇప్పుడు నలిగిపోతాండగానీ! కూలి పనికి పొయ్యోల్లయినా వారానికొక రోజు సెలవు దీసుకొని ఇంటికాడుంటారు. ఇదో... ఈ ఎద్దుముడ్డి పొడుచుకుండే వాల్లే- 'గడియ తీరికుండదు దమ్మిడీ ఆదా యముండదు' అన్నెట్టు ఎప్పుడూ పనే. అందుకే ఇయ్యేల తలనొస్తాందెని పండు కున్నె..."



గడియ తీరికుండదు దమ్మిడీ ఆదాయముండదు అన్నెట్టు ఎప్పుడూ పనే. అందుకే ఇయ్యేల తలనొస్తాందెని పండుకున్నె...

"మరి... చేనికి సంగడెవురు తీసప్పో యిరి? "

"ఇంగెవురు! మా ఆయనే..." చెప్పింది. ఉడుకుడుకు సంగటి గంపనిండా బేసుకొని నెత్తిన బెట్టుకొంటే మాడు చర్రున కాల్తాది. గంపదించే దానికి లేదు. మెల్లగా నడిచే దానికి లేదు. పునికె బొబ్బలెక్కి ఏడుపొస్తా దనుకో... అందుకే సాకుబెట్టి ఇంటికా డుండా. ఒక్కదాన్నయ్యింటే పొద్దుబోక సచ్చుండేదాన్ని. నువు తోడుండావులే..."

ఆమెకేసి కొంతసేపు తదేకంగా చూసింది గౌరి.

ఏవో ఆలోచనలు మెదడునిండా కమ్ము కొన్నాయి.

అంతలో "అక్కా!" అంటూ బైట్నించి పిలుపు.

తలెత్తి చూసింది రమణమ్మ.

నెత్తిన సంకటి బుట్ట, చంకలో పిల్లాడితో ఓ ఆడమనిషి.

"ఈన్ని రొంత సంకనేసుకుంటావా అక్కా! సేనికాడికి పోయి సంగటి పెట్టొ స్తాలే..." పిల్లాణ్ణి చూపిస్తూ అడిగింది రమణమ్మను.

"మాకేం పన్లేనెట్టూ..." పళ్లెం కడిగి దొడ్లో చల్లుతూ చెప్పింది రమణమ్మ.

"అక్కా అక్కా!" అంటూ బంగపోతోన్నా విన్పించుకోలేదు.

పిల్లాణ్ణి చంకలో ఎగేసుకొంటూ "పనీ బాటా లేకుండా ఇంటికాడుండాది. కాసేపు ఎత్తుకొంటే కండలు కరిగిపోతాయేమో!" అని విసుక్కుంటూ వెళ్లిందామె.

"కాసేపు ఊరకుంటే కండ్లు మండు తాయి ముండలకు" తనూ గొణుక్కొంది రమణమ్మ.

గౌరి వింటూండి పోయింది.

సాయంత్రం పొద్దు గలుగ ఇంటికొ చ్చింది లక్షుమ్మ.

"నీల్లకు పోదాం రా వొదినా!" పెరుగోల్ల సుభద్ర బిందెతో వచ్చింది. లంగా జాకెట్ల మీద పైట చుట్టి యవ్వనం ప్రసాదించిన అందాల మిసమిసల్తో ఎగిరే పావురంలా వుంది.

అంతలో మరో నలుగురు ఆడవాళ్లొచ్చారు బిందెలతో.



# స్వల్ప పెట్టుబడితో ఊహించని రీతిలో ఆర్జించగల లాభాలు






అధునాతన పద్ధతిలో ఆనందకరమైన జీవనశైలితో హాయిగా నివాసం ఉండేందుకు ప్రణాళిక బద్ధంగా రూపుదిద్దుకుంటున్న ప్రెస్టీజియస్ వెంచర్స్

## స్టార్ సిటి

కందుకూరునుండి శ్రీశైలం హైవే దగ్గరలో, అంతర్జాతీయ విమానాశ్రయానికి, రాజీవ్ నానోటెక్ పార్క్, ఐ.టి. పార్క్, ఫ్యాబ్‌సిటి, ఇన్‌ఫోసిస్, ఔటర్ రింగ్ రోడ్‌లకు సమీపమున.

## గ్రేటర్ సిటి

మహేశ్వరం, అంతర్జాతీయ విమానాశ్రయం, రాజీవ్ నానోటెక్‌పార్క్ ఫ్యాబ్‌సిటి, హార్డ్‌వేర్ పార్క్ అప్పేరల్ పార్క్ ఔటర్ రింగ్‌రోడ్‌లకు దగ్గరలో

## సాయి గణేష్ టౌన్‌షిప్ (ఎక్స్‌టెన్షన్)

యన్‌హెచ్-5 ప్రక్కన, ఆర్‌విఆర్ ఇంజనీరింగ్ కాలేజి దగ్గర, ట్రిప్లార్ స్కూలు, కాటూరు మెడికల్ కాలేజీల దగ్గర, గుంటూరు.

ప్రత్యేకతలు : • 100% వాస్తు • గ్రావెల్ & బ్లాక్ టాప్‌రోడ్స్ • విద్యుత్ • భూగర్భ డ్రైనేజి సదుపాయం • గెస్ట్ హౌస్ • అవెన్యూ ప్లాంటేషన్ • ఓవర్ హెడ్ మంచినీటి ట్యాంకు • ట్రీ గార్డ్స్ • బ్యూటీఫుల్ గార్డెన్ • మంచినీరు • పార్కు • కరెంటు • టెంపుల్ • ఆటస్థలం • స్కూలు • కమ్యూనిటీ హాల్ తదితర అవసరాలకు స్థలం కేటాయింపు

**బుకింగ్స్ జరుగుచున్నవి**

**స్పాట్ రిజిస్ట్రేషన్**

KALYANI ADS, 98499 83669, 95



# సాయిచైతన్య హౌసింగ్ ప్రై. లిమిటెడ్

• హెడ్ ఆఫీస్ : ఫ్లాట్ నెం.311, అన్నపూర్ణ బ్లాక్, ఆదిత్య ఎన్‌క్లేవ్, అమీర్‌పేట, హైదరాబాద్- 16. ఫోన్స్ : 040-66847889, 66846899
• బ్రాంచి ఆఫీస్ : 9-132, 3వ అంతస్తు, సాయివిజయ టవర్స్, సాయిబాబా గుడి దగ్గర, దిల్‌షుఖ్‌నగర్, హైదరాబాద్. ఫోన్స్: 24151729, 24151739
• బ్రాంచి ఆఫీస్ : స్వర్ణప్రభ కాంప్లెక్స్, 11/2, అరండల్‌పేట, గుంటూరు-522 002. ఫోన్స్: 0863-2213636, 2261414

గౌరిని మొహమాట పెట్టి లాక్కుపోయారు.

ఇప్పటిదాకా తనచేత ఒక్క బిందె నీళ్లుకూడా మోయించలేదు శివుడు. చీకట్లో లేచి ఇంట్లో పాత్రల నిండా నీళ్ల పోస్తాడు. రాత్రికి మళ్లీ బిందె చేతబడతాడు.

బోరింగ్ కొట్టటంలో సుభద్ర సహాయప డింది.

వరసైన వాళ్లమీద నీళ్ల చిందేలా బిందెను విసురుగా రొండికి చేర్చుకోవటం, అత్త వరసైన ఆడాళ్లు వెంబడించి తరిమితే కన్నె పిల్లలు పడ్డదూళ్లలా వీధెంట పరుగె త్తటం హృద్యంగా అన్పించింది గౌరికి.

బిందె నీళ్ల కొట్టుకు రావటం శ్రమగా తోచలేదు - ఆనందం తప్ప. ఇంట్లోకి వెళ్లేస రికి నేలమీద కూచుని ఏవో ఏరుకొంటూ వుంది అత్త.

"ఏంటివత్తా?" అడిగింది.

"బియ్యపు గింజల్లే..."

ఆశ్చర్యపోయింది గౌరి.

తను బియ్యాన్ని చేటలోపోసి రాళ్లేరేట ప్పుడో, చెరిగేటప్పుడో రాలివుంటాయి. వాటిని యేరి చిన్నగిన్నెలోకి ఎత్తుతోంది ముసలామె.

"పొరకతో దోస్తానులే..." గౌరి అంది.

ఆమెకేసి ఎగాదిగా చూసింది లక్షుమ్మ.

"తప్పమ్మే... తినే బియ్యం పొరకతో దోసి పారేస్చురా? ఆ బియ్యపు గింజ ఉడికితేనే అన్నం మెతుకు నాయినా! అన్నం పర బ్రెమ్మ రూపమంట. ఈ బియ్యపు



చతుర 30 వసంతాలు

గింజ విలవ నీకిప్పుడు తెల్దమ్మా! నీకెప్పుడూ కరువులు ఎదురుగాలే. ఇప్పుడు పొదుపుగా బత కడం నేర్చుకొంటే రేపు కరువుల్లో ఊరిడ్సెల్లి నపన్లే..." చెప్పింది.

మరో నాలుగు బిందెలు నీళ్ల తెచ్చేసరికి చీకటి పడింది. చివరి బిందె బోరింగ్ వద్ద ఉండగానే ఊర్లోకి వచ్చాడు శివుడు.

"ఒరే నాయినా!" పిల్చింది గోవిందమ్మ.

"ఏమవ్వా?"

"నీ పెండ్లాం లేవలేనంత యిక్కట్లుబ డ్తోంది. నెల దప్పకుండానే పిల్లను కనే ట్టుంది. ఎదురుగా పోరా!" అంది.

అతనికి అర్థంకాలేదు.

బిందె రొండిన పెట్టుకొని బోరింగ్ వద్ద నించి వస్తోన్న గౌరిని చూసేసరికి ముస లామె వ్యంగ్యం తెలిసిపోయింది.

పెద్దపెద్ద అంగలేసుకొంటూ వెళ్లి గౌరి రొండినున్న బిందెను ఒంటిచేత్తో అందుకొని భుజానికెత్తుకొంటూ ఇంటికేసి వెళ్లాడు.

కొడుకుకేసి అదోలా చూసింది లక్షుమ్మ.

"బిందె నీల్లకే వొడిబడిందే నాయినా!" మెల్లిగా గొణిగింది. విన్పించనట్లుగా వెళ్లాడు శివుడు.

లేచి గొడ్లపాక వద్దకు నడిచింది ఆమె. బర్రెముందు గడ్డివేసి, అది నములుతూ ఉంటే ఎదురుగా మంచమ్మీద కూచుంది.

ఏవో ఆలోచనలు ఆమెను వెంటాడుతూ ఉన్నాయి. వాటిని ఒకచోట గుదిగుచ్చేం దుకు ప్రయత్నిస్తూ బొడ్లోని అడపం విప్పి వక్కాకు తీసి నోటబెట్టుకొంది.

కొడుకు ప్రవర్తన ఆమెకేమీ నచ్చలేదు.

'ఊర్లో ఇంతమందికి పెళ్లయింది. తన హయాంలో ఎన్నో పెళ్ళిళ్లు చూసింది. ఎంత మందో పెళ్ళికొడుకుల్ని చూసింది. తన కొడుకులాంటి వాణ్ణి తనెప్పుడూ ఎరగదు.

పనెరగని పెళ్ళాన్ని తెచ్చుకొన్నాడు, సరే- పని నేర్పుకోవాలి గదా! అందమైన పిల్లను తెచ్చుకొన్నాడు, సరే- దానితో కలిసి పొలంలో వొళ్లొంచుతేనే గదా అందరికీ అందంగా కన్పించేది!

తొలకరింపులొచ్చేసరికి కోస్తా జిల్లాలకు వెళ్లి లేత కోడె దూళ్లను తెస్తారు రైతులు. తల్లి పొదుగునించి బైటపడి కూడా చాలారో జులు గడిచి వుండదు. వీధుల్లో చెంగలిం పులు కూడా మరచి వుండవు. అయినా... నేల పదనయ్యి అదనొచ్చేసరికి వాటికి కూడా అర్రుచేస్తున్నారు గదా! మెల్లిగా పని నేర్పుతు న్నారు గదా! అంతకంటే అందమైందీ, సుకు మారమైందీ కాదుగదా వీని పెండ్లాం!

పెళ్ళానికి పని నేర్పుకోకపోవటమొక్కటే కాదు కొడుకు పట్ల లక్షుమ్మకు ఉండే భయం.

మరో భయం కూడా వెంటాడుతూ వుంది.

అది దుబారా ఖర్చుకు సంబంధించింది.

ఊర్లోకి ఏ పండూ రాకూడదు. ఏ కాయా అమ్మకూడదు. ఎగమల్లి కొంటున్నాడు. అర మూటెడు సెనక్కాయలు రైతుకాడ కొన్నే డంటే తనకు సిగ్గుగా వుంది. ఎవురన్నా ఆ సంగతి ప్రస్తావిస్తారేమోనని లజ్జగా వుంది. కేవలం తినేందుకే అర్థమూట చెనక్కాయలు కొన్న రైతును తనెప్పుడూ చూడలేదు. విత్త నాలకు కొంటారు. తప్పదు... కాయలు వొల్చి పప్పులు తయారుచేసేటప్పుడు పగి లిన బేడల్ని యేరి దాచుకొని కూరకు వాడు కొంటారు. బెల్లపు పాకంలో కలిపి ముద్ద లుగా పిసికి దాచుకుతింటారు. అంతేగాని తినేందుకు సెనక్కాయలు కొనటం రైతుకు లాయకీగాదు. చంటిపిల్లలయితే నోరుండక ఏది చూసినా కొనుక్కుతింటారు. పెద్దవా ళ్లకేం పొయ్యేకాలం!

మొన్నటిదాకా క్షయవ్యాధిలా పట్టి పీడించి వదలిన కరువు గుర్తొచ్చింది ఆమెకు. దాని బాధ తట్టుకోలేకే గదా ఊరిడిచి కూలిపను

తూర్పుగోదావరి జిల్లా ఆథరైజ్డ్ డీలర్స్

టాటా స్టీల్, వైజాగ్ స్టీల్ ప్లాంట్

TATA TISCON
Trusted steel for your home



# కంటిపూడి స్టీల్స్ (ప్రై)లి

H.O. షాప్ నెం. 25, మున్సిపల్ కాంప్లెక్స్,

కంబాల చెరువు వద్ద, రాజమండ్రి,

Ph: 2463413, 2465346,

Cell: 98491 30066, 98661 37793

---

బ్రాంచిలు:

మోరంపూడి జంక్షన్, రాజమండ్రి, Ph: 3254099

# 24-1-47/1, కోరుకొండ రోడ్, రాజమండ్రి, Ph: 2471478.

లకు పోయింది. అప్పుడే మరచిపోతే ఎట్లా?

దేవుడు చల్లగా చూడబట్టి ఈ యేడాదైనా మంచి కాలమొచ్చింది. రేపు కూడా ఇలాంటి కాలమే వస్తుందని నమ్మకం లేదు గదా! మల్లా కరువు రావొచ్చు- కరువొచ్చినప్పుడంతా ఊరిడిచి పోవటం రైతు లక్షణం కాదు గదా!

రైతంటే కలబంద చెట్టులాగా వుండాలి. ఒక్కసారి కడుపు నిండా నీళ్లు తాగితే వాటిని ఏమాత్రం ఖర్చుబెట్టకుండా నాలుగేండ్లయినా ప్రాణం నిలబెట్టుకొని వుండాలి. వరిటించి వరిటించి ఎముకల్లో పానాలుంచుకొని బతకాలిగాని కలరా వచ్చిన వాడిలాగా ఒక్కసారిగా ఈడిగిలబడి చావకూడదు.

దేవుడు మంచి కాలమిచ్చిన యేడాది, మంచి దారి చూపిన యేడాదిన ఆ దారెంట జాగ్రత్తగా నడవాలి. నేల తల్లిని మంచి చేసుకోవాలి. మట్టిలో కాళ్లు బాతుకొని వేర్లు దించి దాని సారాన్ని పొట్టలోకి పీల్చుకోవాలి.

ఒళ్లంతా కాళ్లు చేతులు చేసుకొని జనమంతా మట్టిలో దిగబడుతున్నారు.

పెండ్లాం మోజులో పడి వీడు ఏమారడు గదా!

ఇప్పుడు ఏమారితే- ఈ ఒక్క అదను సోమరిగా వుంటే, రేపు ఎదురయ్యే కరవుల్లో మలమల మాడిపోవలసిందే. ఒక్క అదను మట్టిని మరిస్తే ఒక్క యేడాది కరవును ఎదుర్కొనే శక్తిని పోగొట్టుకున్నట్లే!

'ఎట్ట జెయ్యాల్రా దేవుడా!' లక్షుమ్మ హృదయం మూగగా ఆక్రోశించింది.

'దుబారా ఖర్చు చేస్తాండు. పనికొస్తాడా?' అనుకొంది.

పెండ్లాన్ని బాగా సాకు ... నోటికి రుచిగా తినిపించు. ఆ రుచిలోనే మెడ అర్రయ్యేటట్లు జెయ్యాలగదా! కాడి మెడ మీద బెట్టి పని అలవాటు జెయ్యాలగదా! ఊరకే మేపుతే ఎట్లా?

* * *

కొండ్లు వరిమళ్లల్లో దిగాయి. బురద నేలను దమ్ము చేస్తున్నాయి. చెరువు కట్ట కిందంతా కోలాహలంగా వుంది. బురదలో కాళ్లు పీక్కొని వేగంగా నడవలేని ముసలి ఎద్దులమీద రైతులు వేసే కేకలూ, దున్నపోతు సేద్యగాళ్ల అరుపుల అగచాట్లూ, పక్కమడికయ్యల్లోని వరసైన వాళ్లతో చెతుర్లూ... ఆహ్లాదకరంగా వుంది వాతావరణమంతా.

నాగలితో దమ్ము చేసిన వాళ్లు ఆకో అలుమో మడినిండా పరచి గిలక తిప్పుతున్నారు.

ముడి మురిగింతర్వాత పోకమాను తోలి మిట్ట పల్లాలు లేకుండా చేసి ఫ్రేం కట్టి బిగించిన అద్దంలా సవరించారు నీళ్లు కట్టిన మడికయ్యను.

ముందురోజు నారు పీకి కట్టలు కట్టి కయ్యల్లో ఒడ్డారు. మళ్లీ రోజు ఉదయమే కూలీల్ని పిల్చుకొచ్చి నాటుకు వంగింది శివమ్మ.

ఇంటి వద్ద లక్షుమ్మ సంకటి చేస్తూ వుంది.

గౌరి మడి వద్దే వుంది.

గెట్లు పెట్టి మట్టితో పామటం, కాలువలు సరిజెయ్యటం మీదున్నాడు శివుని బావ బాలయ్య.

శివుడు మాత్రం నారు కట్టలు అందిస్తున్నాడు.

"రామ్మా! నాలుగు నాట్లు దిగజెక్కుదూ రా!" ఓ కూలి మనిషి పిల్చింది గౌరిని.

ఆదుర్దాగా అటుకేసి చూశాడు శివుడు.

"రా మరదలా! మే రమ్మంటే రావాల. పొమ్మంటే పోవాల. ఆడపడుచులం మేం-అర్ధమొగుండ్లం. వాడు నీకు సగమే మొగుడు. మిగతా సగం మేమే. రచ్చబండ కాడ



రాజు వాడయితే పెచ్చేటల మీది పెద్ద మాసులం మేము. మేం జెప్పిందే వాడింటాడు. మేం పెట్టిందే వాడు తింటాడు. వాడు జెప్పింది నువ్వినాల. వానెంగిలి నువ్వు తినాల... మేం నీకు అర్దమొగుండ్లం... రా... వొంగూ... నీకూ నీ కొడుక్కూ సరిపోయేన్ని తిండి గింజలకు నాటుకో మరదలా!" వరినారు కట్టను చేతబట్టి నిల్చుని అదోరకమైన దీర్ఘం తీస్తూ అంది మునెమ్మ.

అందరి మొహాల మీదా పరిహాసరేఖలు కదలాడాయి.

"పెండ్లయి మూడు పొద్దులు గడవలేదు. అప్పుడే కొడుకెక్కన్నించి వొచ్చెనే మునిపిల్లా? " సుబ్బమ్మ అంది.

"ఎంతసేపు రావాల? ఉగాదికంతా కేర్ మని అరుస్తా బూమ్మీద దూకడా...! ఏం తమ్ముడా? " శివునికేసి చూసింది మునెమ్మ.

"కనేవాల్లనడుగు. మా యన్ననడుగుతా

వెందుకూ? " ఓ పడుచు అంది.

అప్పటికే సిగ్గులతో మొగ్గయింది గౌరి.

"దిగు దిగమ్మా! సెల్లెలా! మడిలో దిగు... నువ్వూ వొక మునం పట్టుకో... ఏ సేత ఎంత బాగ్గెముందో! నారు కట్ట తీసుకో... యేల్లతో దిగజెక్కితే ఏడడుగులు పెరగాల. రాజనాలు పండాల. రత్నాలు రాలాల. ఎన్నుకు ఏదుం గింజలు కాయాల. ఎకరాకు ఏడూర్ల గాదెలు నిండాల ... రామ్మా ... రారా..." సుబ్బమ్మ పిల్చింది.

ఇక తప్పలేదు గౌరికి.

అందరిలాగా కోకను గోచిలా ఎగజెక్కాలని ప్రయత్నించింది గాని కుదరలేదు. అడ్డ పంచెలా కట్టాలని చూసింది. సాధ్యపళ్ళేదు. అలాగే బురద మళ్ళల్లోకి దిగితే చీరను బురదలో తొక్కుకొని ఊడలాక్కొనేందుకు చేత గాక గిలగిల్లాడాల్సి వస్తుంది.

ఆమె అవస్థ గమనించింది కాబోలు, సుబ్బమ్మ వచ్చి చీరను గోచీ చెక్కింది.

గౌరి బురద మడిలోకి దిగింది.

బురదలో కాళ్ల లేపి అడుగేయడం కష్టంగా వుంది. ఇరుక్కొన్న కాలును లేపేటప్పుడు రెండవ కాలు బురదలో జారకుండా నిలదొక్కుకోవటం ఇబ్బందికరంగానే వుంది. బ్యాలెన్స్ సరిచేసికొనేందుకు రెండు చేతుల్ని గాల్లో ఆడించాల్సి వస్తోంది.

వాళ్లందరికీ ఆ సమస్య కనిపించటం లేదు. అలవాటు లేకపోవటం వలన తనే కష్టపడుతోంది.

నాట్లు కూడా బురదలో నిలబడటం లేదు. రెండు వేళ్ల వెంట బురదలోపలికి తీసికెళ్లి నాటు కుదిరించి ఖాళీ వేళ్ల ఎట్లా బైటకు రావాలో అర్థంకాలేదు.

చేయిపట్టి నేర్పింది సుబ్బమ్మ.

రెండు మునాలూ తనే నాటుతూ, గౌరికి నేర్పుతూ వెళ్లటం వలన బాగా వెనకబడింది ఆమె.

మునెమ్మ ఎగతాళిగా ఓ పాట అందుకొంది.

"ఓహో సుబ్బులూ ఒళ్లంత గబ్బులూ కాగునిండ సొద్దలూ కడుపంత ముద్దలూ తిండికైతె ఎద్దులూ పనికైతె మొద్దులూ కళ్లం కాడ సుద్దులూ మొగుని చేత గుద్దులూ..." అంటూ వ్యంగ్యంగా పాడటంతో పకపక నవ్వారు అందరూ.

"ఒసే యేందే కూసినవూ!" సుబ్బమ్మ లేచి నిలబడింది.

"మా దొడ్లో సొరకాయంత లేవు.
నా బొడ్లో అడపమంత లేవు.
గడ్లో కుందేలంత లేవు
రాయే పిల్లా! పోటీకి సై.. మేటీకి సై...
నే రాయేస్తా నువ్వు దూరం జెప్పు
నే పాట బాడ్తా నువ్వు రాగం జెప్పు
నేను కత పొడుస్తా నువ్విప్పు
విప్పలేకుంటే నీకోక ముడి విప్పుతా నా బంటు కూతురా!"

అంటూ సవాలు విసిరింది.

ఈలోపు గట్టెక్కిన ఇద్దరు కూలీలు వెనకబడిన రెండు మునాల్ని పట్టుకొని గబగబ గట్టెక్కించారు.

సుబ్బమ్మ మునెమ్మల కోడిగాలకు అందరూ ఒకటే నవ్వులమీదున్నారు.

"ఇద్దరు పట్టి ఇగ్గులాడితేగాని మునం లోంచి బైటికి రాలేకుండావే వొదినా! పల్లెం కాడ కూడా అంతేనా? మాయన్న వొచ్చి సెయ్యేసేదాంకా లెయ్యవా? " మరదలి వరస పడుచు గేలి చేసింది.

"మేమిద్దరం సెయ్యేసింది ఈ పిల్ల మీద దయదల్చి గాదు. పెండ్లాం మునం ఎనకబడిందని మా శివన్న ఎక్కడ బురదలో దిగి నాటుకు వొంగుతాడోననీ..."

విరగబడి నవ్వారు అందరూ.

ఆమె చెప్పింది చాలా వరకూ వాస్తవమే. గౌరి మునం వెనకబడుతూనే రెండవ

చతుర 30 వసంతాలు

వైపునించి తను నాటుకు దిగాలనుకొన్నాడు శివుడు. ఆమె బురద లోంచి కాలును లాక్కొని పక్కన నిలదొక్కుకోబోతూ అల వాటు లేని పనవటం వలన బ్యాలెన్స్ కోసం రెండు చేతులూ గాల్లో ఆడిస్తోంటే ఒక్క పరుగున వెళ్లి ఆమెకు ఆసరా ఇద్దామనే భావనతో ఉరకలెత్తాడు.

అతని ఆరాటం కొందరు గమనించక పోలేదు. సుబ్బమ్మ అయితే ఏకంగా పదమే అందుకొంది మునం సగంలో నిలబడి.

"నూగులు నుసిబట్టె గానుగ గసిబట్టె
మా మరిది నెత్తిన పేనుబట్టె.
మరిది అక్కగారు పేను తీయాబోయి
గంజిగుంతలోబడి గుంజులాడె..."

మునెమ్మ కేసి చేతులూపుతూ పాడసా గింది.

శివమ్మ ముసిముసిగా నవ్వుకొంటోంది.

"గాడెత్తు మా మరిదిని గాట కట్టేద్దుమా!
వరిగడ్డి బేద్దుమా! సెనిగెపొట్టు పోద్దుమా!
దిబ్బలో నిలబెట్టి సిబ్బితో దిగదీసి
సిగ్గులేని మా మరిది నీకారతీ!"

వరినారు కట్టతోనే హారతి పట్టింది.

శ్రోతలకు ఉల్లాసంగా వుంది.

సుబ్బమ్మకు ఏమాత్రం తగ్గదల్చుకోలేదు మునెమ్మ. తను నోరు చేసికొంటే వీళ్లంతా గాలికి కొట్టుకుపోతారని ఆమె ధైర్యం.

"ఆ సంకనొక పిల్ల యీ సంకనొకపిల్ల
కడుపులో వొకపిల్ల కదలాడగా
ఆరుజాట్లన్నాము మూడు జాట్ల ముద్ద పప్పు...
చాలకే మా వొదినె సరితెడ్డు నాకే...
జయ మంగళం రామ శుభమంగళం...
మంగళం మంగళం మా వొదినె కొప్పుకీ
గుంతలో ఉండేటి గోంద్రుకప్పుకీ
మంగళం మంగళం మా వొదినె గొంతుకీ
కుంటలో తిరిగేటి గుడ్డి కొంగకీ
జయమంగళం నిత్య శుభ మంగళం..."

ఒకరిద్దరు వంత పాడటంతో సందర్భం బాగా రక్తి కట్టింది.

"సరే.. సరేలే... ఇంగసాలుగానీ..." మట్టితో గెట్లను పాముతూ వున్న బాలయ్య అన్నాడు.

నారు కట్ట చేతబట్టుకొని లేచి నిలబడింది మునెమ్మ.

"యేంది బావో! సరే సరే నంటావ్ ... నీ సరి నా సంకలో వుంది. నీ అడ్రస్ నా బొడ్లో వుంది. మాపిటేలరా మాట్లాడు కుందాం. సందేల రా సదూకుందాం..." అంటూ నాటుకు వంగింది.

అక్కడ ఒకటే నవ్వులు.

గౌరి పెదాల మీద కూడా మంచు తడిలా నవ్వు పూసింది.

"మావోడు సరైనోడు కాక నీకు బొత్తిగా బయ్యం లేకుండా పోయింది." బాలయ్య అన్నాడు.

ఆమె తలెత్తింది.

"బయ్యమా? బాటా? తుమ్మకాయ తూటా? బాయిలో పడ్తే లోతా? నల్లేరు నస్సా? ఎర్రగడ్డ యేటా? పత్తిగింజ పోటా?" అంటూ గుక్క తిప్పకోకుండా పలి కింది.

"దాన్నోట్లో ఎందుకు నోరు బెట్టావబ్బీ! సెడ్డ నా సవితి" ఓ ముసలామె అంది.

ఆమె కేసి తిరిగింది మునెమ్మ.

"నువ్వు రాయే ముసిల్దానా సూజ్జాం! నీకు జుట్టంతా నెరిసింది గదా! నేనొక్క కత పాడుస్తా విచ్చుకోయే... గుంటూరు గుండు సెనిగె. చెన్నపట్నం సన్న రేకులు. మొగు నూరు తెల్లపత్తి- అన్నీ దొరికిన కాడ పండు దొరుకు... పైన రూక... పక్కలేకి మగు వ...నా యాపతిలో ఒక యాపతి. నా సాపతిలో ఒక సాపతి... ఓహో సాకలి సిన్నోడా! అంటే ' ఆ రాజు సచ్చి పరాయి

ఓం సాయి శ్రీసాయి జయజయసాయి

ద్వితీయ వార్షికోత్సవ (17-2-07) శుభాకాంక్షలతో...

# శ్రీ షిర్డిసాయి భక్తసమాజము

కెనాల్‌రోడ్, బలభద్రపురం, బిక్కవోలు (M), తూ॥గో॥జిల్లా

ఫోన్: 08857-236114, సెల్: 98496 66377

**శ్రీ షిర్డిసాయి**

**భక్త మహాశయులారా!**

బలభద్రపురం గ్రామాన పావన గౌతమీ తీరాన వెలసి **ఆంధ్రా షిరిడీ**గా పేరుగాంచిన కలియుగ ప్రత్యక్ష దైవం **శ్రీ షిర్డిసాయినాథుని** మందిరాన రూ.**18** లక్షల వ్యయంతో **శ్రీ సాయిబాబా** వార్కి **వెండి సింహాసనం** మరియు **మకరతోరణములను** తయారుచేయ సంకల్పించినాము. కావున భక్తులెల్లరూ తమ విరాళములను సమర్పించి ఈ భగవత్‌కార్యాన్ని దిగ్విజయంగావింప మనవి.

రండి! దర్శించండి!! తరించండి!!!

శ్రీ కొవ్వూరి వీర్రాఘవరెడ్డి కళ్యాణ మండపం

**visit.www.andhrashiridi.org**

రాజొచ్చి పట్నం గట్టి నపొద్దు వస్త పో' అన్నె డంట. అదేందో సెప్పే ముసిలీసూజ్జాం..."

సవాలు విసిరింది.

ఆ ఆటలు, పాటలు, పదాలు, పొడుపు కథలు, దెప్పి పొడుపుల సందడికి హృదయ మంతా గిలిగింతల మయమైంది గౌరికి.

వాళ్లతోటి వంగి వరినాటుతున్నా నడుము నొప్పి తెలీలేదు.

నాటు పూర్తయి కూలీలంతా గట్టెక్కిన తదుపరి అట్లా మడికేసి చూసేసరికి-

బురదలో గుచ్చిన నాట్లన్నీ పదాల మాధుర్యాన్ని పీల్చి అప్పుడే పచ్చబడినట్లుగా అన్పించింది.

తన చేతివేళ్ల సందుల్నించి బురదలోకి చొప్పించి నాటబడిన మొక్కలు కూడా అందులో వుండటం ఆమె హృదయంలో ఏవో పులకరింతల్ని రేపింది. తను కూడా కొన్ని మొక్కలకు ప్రాణం పోసిందనే స్పృహ ఆమె ఎదలో మధుర భావనల్ని మొలకెత్తించింది.

పాటల హుషారుతో పని బాగా జరిగింది.

పొద్దుండగనే గట్టెక్కి ఇంటిదారిబట్టారు కూలీలు.

ఆ రోజు సుభద్ర గొడ్ల తోలుకొచ్చింది తనతోడి పిల్లల వెంట. బర్రెలన్నీ ఒకే మందగా ఇళ్లకు నడుస్తున్నాయి.

"బరుగొడ్డు ముదురు సూడిది లాగుందే పెద్దమ్మా! సంకసేతెడు పొదుగు జేసింది." లక్షమ్మతో అంది మునెమ్మ.

"తొందర్లో పాడితాగే యోగముందే..."

"ఎప్పుడమ్మో! ఇంగొక నెలపైమాటే..." అంది లక్షుమ్మ.

బర్రెరంగూ, ఆకారమూ, పాలు పితుకుళ్లూ, దూళ్ల నాణ్యత గురించి తలొక మాట మాట్లాడుతున్నారు.

తమ బర్రె ఇన్ని మంచి లక్షణాలు కలదని గౌరి ఊహించలేదు. వీళ్లు చూపే లక్షణాలన్నీ తన బర్రెలో చూడాలనుకొంది.

మందనంతా కలియజూసింది.

వామిదొడ్డి వద్ద వారపాకలో కట్టేసిన తమ బర్రె ఆకారాన్ని గుర్తు తెచ్చుకొనేందుకు ప్రయత్నించిందిగాని దాని రూపం కనుగుడ్ల మీద స్పష్టంగా నిలబడలేదు.

మందలో బర్రె కనబడలేదు.

అన్ని బర్రెలూ ఒకేలా వున్నాయి.

ఇన్నింటిలో తమ బర్రెను వీళ్లెట్లా పోల్చుకొంటున్నారో అర్థమే కాలేదు.

ఇంటికొచ్చేసరికి పగటి శ్రమ తాలూకు వొళ్లు నొప్పులన్నీ బైటబడ్డాయి గౌరికి. నడుములు పీకుతున్నాయి. పిక్కలు లాగుతున్నాయి. భుజాలు జారుతున్నాయి. ఒంటి కండరాలన్నీ జివ్వు జివ్వుమంటూ మోగుతున్నాయి.

పగలంతా బురదమళ్లల్లో కాళ్లు ఇరికించుకొని, పీక్కొని ఒళ్లంతా ఎక్కడిదక్కడ పట్టి విరిచినట్లుగా వుంది.

మంచం మీద అడ్డంగా వాలింది.

కోడలి పరిస్థితి గమనించింది లక్షుమ్మ

"అమ్మి కత అయిపోయినట్టుందే..." పెదవి విరిచి సన్నగా నవ్వుకొంది. మధ్యాహ్నం సంకటి ఇంకో రెండు ముద్దలుంది. కూర వుంది. అందుకే అరపావు బియ్యం కడిగి పొయ్యి మీద పెట్టింది.

కోళ్లను గంప కింద వేసింది. బర్రెకు మేత వేసింది. తనోముద్ద సంగటి తిని బైటకొచ్చి వేపచెట్టు కింది చిన్ని అరుగు మీద కూచుని అడపం విప్పింది.

"అమ్మే లచ్చుమ్మా! రోంత తమలపాకీ" అంటూ గోవిందమ్మ అటుగా వచ్చింది.

ఇద్దరూ వక్కాకు నమలుతూ సన్నగా యవ్వారానికి దిగారు.

అప్పటిదాకా వీధుల్లో తిరిగి వచ్చాడు

శివుడు.

"కోడలేదమ్మే? " గోవిందమ్మ అడిగింది లక్షుమ్మను.

"ఇంట్లో ఉందిలే..."

"బైటికన్నా రాలేదే.."

"ఇయ్యాల వరిమల్లల్లేకి దిగిందిలే... ఎప్పుడూ పని మొగమెరగని పిల్లయిపాయె. వొల్లంతా పచ్చిపుండయినట్టుంది. మంచానికి అడ్డం బడింది..."

"నీల్లన్నా కాంచి పొయ్యగూడదా!"

"వాల్లే కాంచుకుంటార్లే..."

"ఓసి నా యెర్రెమ్మా!" అంటూ మెల్లిగా లేచింది గోవిందమ్మ. వాకిలి దాకా వెళ్ళి నెట్ట బోయింది.

లోపలినుంచి మాటలు.

"ఈ నొప్పులకు ఒకటే మందు. కండలు కదిలేటట్టు వొల్లు రుద్దడం... పైతోలు కందేట్టు ఉడుకుడుకు నీల్లు పోయడం... ఆ వైద్యం నే జేస్తాలే..." శివుని గొంతు.

"ఓరె నాబట్టా!" గొణుకుతూ గిరుక్కున వెనుదిరిగింది గోవిందమ్మ. అరుగు దగ్గరగా వెళ్ళి "అమ్మే లచ్చుమ్మా!" అంది. "నువ్వింట్లేకి పోవొద్దులే..." చెప్పి అక్కణ్ణించి కదిలింది.

మెల్లిగా అడుగులేస్తోందేగాని ఆమె చెవుల్లో శివుని మాటలే గింగుర్లెత్తుతున్నాయి. వాటి వెనక భావం సముద్రపు అలల్లా ఎదలపైకి తోసుకొస్తోంది. దృశ్యమానం కావటానికి తెగ ప్రయత్నిస్తోంది.

ఇంటికెళ్ళిం తర్వాత కూడా అవే శబ్దాలు చెవుల్లో.

"ఓరె నాబట్టా! యాడ నేర్చుకొన్నెవురా!" అనుకొంటోంది మనస్సులో.

వీధిలో రెండుసార్లు అటు ఇటు తిరిగింది.

మనస్సు ఉండబట్టలేదు.

"మునిపిల్లను నేను రమ్మంటండానని చెప్పు..." మనిషి చేత చెప్పి పంపింది.

అడపంలోంచి కొంత పొగాకు చెక్క తీసి

నోట వేసుకొంది.

మునెమ్మ రాగానే ఆమె చెవిన ఊదింది.

ముసలామెకేసి వింతగా చూసింది మునెమ్మ. గమ్మతుగా నవ్వింది.

"తప్పేమో అవ్వా!" అంది.

"ఎవురికెన్నా చెబుతే తప్పు... అల్లరిజేస్తే తప్పు..."

"అంతేనంటావా?"

"ఆ..."

ఇద్దరూ కదిలారు.

వెన్నెల పిండారబోసినట్లు కాస్తోంది.

ఎద్దుల గాళ్లల్లోంచి చిరుగంటల సవ్వడి విన్పిస్తూ వుంది.

శివుని ఇంటికి వెనక వైపుగా కళ్లాలకేసి కదిలారు.

గొడ్లపాక వద్దనించి వాళ్లను గమనించింది లక్షుమ్మ.

"యాడికమ్మే?" అడిగింది.

"అవ్వకు కడుపులో గడబిడ యంటాండే చిన్నమ్మా!" చెప్పింది మునెమ్మ.

ఇద్దరూ వామి చాటుకెళ్లి నిల్చున్నారు.

లక్షుమ్మ అక్కన్నించి కదలి ఇంటిముందు మంచం వద్దకెళ్లేదాకా నిరీక్షించారు.

తర్వాత వెనక్కి తిరిగి మెల్లిగా జాలాడి దొడ్డి గోడ దాకా నడిచారు.

దొడ్డి గోడ చుంచు కింద నిల్చుని చెవులు రిక్కించారు.

అప్పుడే నీళ్లు తోడుతోన్నట్లుగా సడి.

గోడ కిందనే లావాటి పలుగురాళ్లున్నాయి. వాటినెక్కితే దొడ్లోకి చూడొచ్చు.

ఓసారి ఎక్కి చూసింది మునెమ్మ.

శివుడు ఇంట్లోకి వెళ్లినట్లుంది.

ముసలామె ఉద్విగ్నంగా చూస్తోంది మునెమ్మకేసి.

దొంగతనపు భావన వొకటి మనస్సును కమ్ముకోగా పరిసరాల్ని అదేపనిగా గమనిస్తోంది మునెమ్మ.

"రా- ఒక్కపూటకే ఇంత యాలబడితే ఎట్లా?" శివుని గొంతు.

"నేను స్నానం జేస్తాను. నువ్వెల్లు..."

"నీ వొల్లు తోమేదెవురూ! నూనె రాచి మర్దన జెయ్యాల... బట్టలు విప్పు..."

"వొద్దొద్దు..."

"నీకు నాకు మధ్యన సిగ్గేంది... నీ వొల్లు నాకప్పగించు... నువ్వు చంటిపిల్లవు... నేను మీ అమ్మను... అంతే..."

తర్వాత ఆమె గొంతు విన్పించలేదు.

శరీరాన్ని అతని వశం చేసినట్లుంది.

అప్పటికే గోవిందమ్మ ఎదలనిండా ఏవో అవ్యక్త భావాలు.

మునెమ్మతోటి మెల్లిగా రాళ్లెక్కి దొడ్లోకి తొంగి చూసింది.

అక్కడ...

వెన్నెల వానలో నిలువెల్లా తడుస్తూ చెక్కపీట మీద కూచున్న ఓ నగ్న శరీరం... ఒళ్లంతా నూనె రాయటం వలన వెన్నెలలు నిగనిగలాడుతూ... వెలుతురు రాశిలా... పుప్పొడులు దంచి తేనె కలిపి చేసిన బొమ్మలా... ఆ బొమ్మ కండరాల్ని అలలు అలలుగా కదిలిస్తూ ఓ పురుషుడి అరచేతులు మార్మికంగా కదులుతూ... కండరాలు కదలి సుఖ పారవశ్యపు మూలుగులు ఎగుస్తూ... తళతళలు చిమ్ముతూ... ఆధిపత్యపు భావాలెరుగని అనాది మానవ దేహాల ఆత్మీయతలు వెల్లివిరుస్తూ...

గోవిందమ్మ గుండెలు ఆనందపరవశమయ్యాయి. ఎకసక్కెపు భావన అంటని అద్భుత భావుకత ఏదో హృదయాన్ని ముంచింది. రెండు చేతులెత్తి నమస్కరించింది అక్కడి దృశ్యానికి. ఒళ్లు పదరుతోండగా మెల్లిగా రాయి దిగింది. మునెమ్మను పట్టించుకోకుండా ఏదో గొణుక్కొంటూ అక్కణ్నించి బైల్దేరింది. దారిలో లక్షుమ్మ పలుకరించినా తలకెక్కలేదు.



మునెమ్మ పరిస్థితి కూడా అలాగే ఉంది.

తను పాడే జానపద గేయాలన్నీ కలబోసి వెన్నెల్లో మెదిపితే అక్కడి నగ్నదేహం అవుతుంది. దానిమీద పారాడే అరచేతులూ... మునివేళ్లూ... బహుశా తన పెదాలూ, నాలుక చివర్లూ, తన నిట్టూర్పులూ...

జీవితంలో తానేమి పోగొట్టుకొందో తెలుస్తోంది మునెమ్మకు.

ఏమి పోగొట్టుకోకూడదో పడుచువాళ్లకు

చెప్పే పాఠాలు తన గుప్పెడు నిండా దొరికా యనిపించింది గోవింద మ్మకు.

ఆడ మగ దేహాల మధ్య - వాళ్లు ఆలు మగళ్లయినా సరే- ఎన్ని ఆంక్షలూ! ఎన్ని సరిహద్దులూ! ఎన్ని రాతిగోడలూ! ఎన్ని పర్వతాలూ!

వెన్నెల్లో ఓ సత్యం తెలిసింది.

"దేవుడా! యీ పడుచోల్లందరికీ వాళ్ల వొల్లంతా ఒక్కసారన్నా కండ్లారా చూసుకొనే సత్తవ యీ తండ్రీ! గుండెలకు చూపులీ. ఒకరి వొల్లు వొకరు చాటు లేకుండా చూసు కొనే ధైర్యమీ... శరీరాన్ని సదూకొనే వాల్లె ప్పుడూ దాన్ని తక్కవజేసి చూడరు... అది ఆడయినా మగయినా అంతే...! దేవుడా! అందరికీ శివుని అరచేతులీ. అందరు ఆడపి ల్లలకూ గౌరి మనస్సీ... తను పసిపిల్లగా మారిపోయి మొగుని సేతల్లోకి జారే ఆమె కల్తీ ఎరగని ఎదలీ..."

6

"పోలేరమ్మ తల్లీ! నీకు సల్లబువ్వ పోస్తా. నా కండ్లు సల్లజెయ్యి తల్లీ! కోడలు పిల్ల కొప్పు ఎగ్గట్టేట్టు జూడు. పైట రొండిన జెక్కేట్టు సూడు. గోసి బిగజెక్కేట్టు జూడు. మళ్లల్లో వరికర్రయ్యేట్టు జూడు. సేలల్లో జొన్నకంకి అయ్యేట్టు సూడు... గుడిలో జొన్న కంకులు యేలాడగట్టాల. పిచికలు ఎదురుజూస్తాండాయి. కల్లంలో సొద్దకం కులు రాలగొట్టాల. చీమలు గుంపులు గుంపులుగా కనిపెట్టుకోనుండాయి... ఏడ్చి ఏడ్చి ఎర్రబడినాయి... నా కండ్లను సల్ల జెయ్యి తల్లీ!"

పాతకాలపు వేపచెట్టు మొదట్లో మూరె డెత్తు బండల గూట్లో పసుపు కుంకుమలు దట్టంగా అలముకొన్న శిలలముందు గొంతు క్కూచుని చేతులు జోడించి వుంది లక్షుమ్మ.

బర్రెలు కంపకట్టవల వెంట మేస్తు న్నాయి.

"ఎగతాలి బతుకాపు తల్లీ! ఏమెరుగని ఎర్రిముండలన్నీ యేలెత్తి నవ్వబట్టె. పాసి పండ్లతో యికిలించబట్టె... నవ్వులాటాయె గదమ్మా!"

"కోడలు మంచిదే. కొడుకు మంచోడే... ఒకరిమీద ఇంకొకరికున్నె మర్లూ మంచి వే... మర్లు కూడుబెట్టవుగద తల్లీ!"

"పోలేరమ్మ తల్లీ! నీకు కోడిపుంజుని దుస్తా. బోనాలు వొండిపెడ్తా. నా దుఃఖం యినుకో తల్లీ! నా కొడుక్కు మంచి పెండ్లా న్నిచ్చినావు. నాక్కూడా మంచి కోడల్నీ. మొగునిమీద మరులు పెంచుకొన్నెట్టే ఇంటి మీదా, బర్రెమీదా, కోళ్లమీదా, పైరు మీదా అంతే యిష్టాన్ని పెంచుకొనే కోడల్నీ!

"తల్లీ! నా కోడలికి ఇంటి బర్రెను గుర్తు బట్టే కండ్లీ! సొంత కోల్లను పోల్చుకొనే సూపులీ. బర్రె ఆకల్ని కనిపెట్టే గుండెలీ... కోల్ల దప్పికెను పోల్చుకొనే చూపులీ..."

"తల్లీ! సంసారమంటే తనవొల్లూ మొగుని వొల్లే కాదుగదా! తన కడుపూ మొగుని కడుపూ చూసుకోవడం కాదుగదా! ఇట్లా లోకాన్ని కూడా పారజూసేట్టు చేయి తల్లీ!"

"మంచి కాలమిచ్చినావు. మంచి చూపులీ తల్లీ! కలిమి కాలమొచ్చిందంటే ఎనకే రొండు మూడు లేమి కరువులు కూడా తర మకొస్తాయి. కరువుల్ను కనిపెట్టే కండ్లీ అమ్మా! నువ్వు గింజ కూడా యేరి దాచు కొనే చూపులీ. ఇంట్లోంచి దొర్లిపోయే సజ్జ గింజను కూడా కనిపెట్టే కనుగుడ్లీ తల్లీ!

నీకు సల్లబువ్వ పెడ్తా.

సందెడు కోడిపుంజునిస్తా!"

* * *

మృగశిర కార్తె వరకూ పడమటి గాలులు రాజ్యమేలాయి.

అశ్లేష కార్తెలో ప్రకృతి బగబట్టింది. గాలి స్తంభించింది. ఆకల్లాడని పరిస్థితి ఏర్ప

డింది.

మఖ, పుబ్బల్లో గాలి వీచింది గాని దానికొక దిశలేదు.

పుబ్బకార్తె చివరికొచ్చేసరికి దోమల పోడు ఎక్కువయ్యింది.

ఎండిన పత్తికాయలు ఇంటికి విరుచు కొచ్చి, పత్తి తీసి, ఉలిపచ్చిగా వున్న గులకల్ని వీధిలో పోసి రాత్రిల్లు నిప్పుపెడుతున్నారు. అవి రాజుకొని రాజుకొని మండకుండా గుళ్లు గుళ్లు పొగ విడుస్తూ వీధులన్నీ అలుముకొని దోమల్ని తరుముతున్నాయి.

సొద్ద గూగును కూడా అంటించి దోమల్ని తరిమే పనిలో పడ్డారు జనం.

రోజూ శివుని వెంట వరిమడి వద్దకు వెళుతోంది గౌరి.

ఆమె పిలుపులో ఏం మంత్రముందో అర్థమే కాలేదు గౌరికి. కోళ్లు ముక్కులతో నేలను పొడిచే టకటకల శబ్దాలు చెవులకింపుగా వున్నాయి



ఎర్రనీళ్ల మడి కయ్యలో ఎర్రబారిన రంగులోంచి మెల్లి మెల్లిగా పసరుకక్కే పచ్చదనంలోకి మారుతూ వున్న వరినాట్లను చూస్తోంటే ముచ్చటగా వుంది ఆమెకు. గెనిమ మీద నడుస్తోంటే కప్పలు నీళ్లల్లోకి దూకటం, పాత బొరియలు మట్టితో బూడితే కొత్తగా రంధ్రాలు చేసి మట్టికోట కట్టుకొని, మనిషిని చూడగానే అడుగుల గుర్తులు వదులుతూ ఎండ్రకాయలు బుడుంగున బొక్కలోకి జారటం... చూడముచ్చటగా వున్నాయి పొలం దృశ్యాలు.

అప్పుడప్పుడూ దొంగచాటుగా చెరువులో దూకుతున్నారు ఇద్దరూ. చీకట్లు పడే సాయంత్రాలు చెరువు నీళ్లల్లోంచి మత్తుగా బైటకొస్తున్నారు.

జనాలు శివున్ని గేలి పట్టించటం చాలించలేదు.

వాళ్ల ఎగతాళికి సరిపోయేన్ని సమిధలు అతను అందించటం మానలేదు.

గౌరి యింకా శివునికి ఏమాత్రం పాతబడలేదు.

అతని చేష్టలు కూడా ఊర్లో వాళ్లకు పాతబడలేదు.

సాయంత్రం బర్రెను తోలుకొచ్చి వారపాకలో కట్టేసింతర్వాత ఇంట్లోకెళ్లింది లక్షుమ్మ. దొడ్లోకెళ్లి అరచేతులకంటిన పేడను గీకి కడిగింది. తడిని పైటకు తుడుచుకొంటూ ఇంట్లో కొచ్చి కాగుల చాటున వంగి, తడివి కోడిగుడ్డును వెదకి తీసి రాగుల బానలో దాచింది.

అక్కడ గుడ్డు వున్న విషయం గౌరికి ఆశ్చర్యాన్ని కలిగించింది. పగలంతా తను ఇంటివద్దే వుంది. కోడి ఇంట్లోకి ఎప్పుడొచ్చినట్టు? గుడ్డెప్పుడు పెట్టినట్టు?

దోసిలి నిండుగా సజ్జలు తీసికొని బైటకు నడిచింది లక్షుమ్మ. "భొ... భొ... ఫ్..." అంటూ పెదాలతో చప్పుడు చేసి పిల్చేసరికి కిందా మీదా పడుతూ పరుగెత్తుకొచ్చి ఆమెను చుట్టుకొన్నాయి కోళ్లన్నీ.

ఇంటి ముందు శుభ్రమైన నేలను చూసి సజ్జలు చల్లింది.

ఆమె పిలుపులో ఏం మంత్రముందో అర్థమే కాలేదు గౌరికి.

కోళ్లు ముక్కులతో నేలను పొడిచే టకటకల శబ్దాలు చెవులకింపుగా వున్నాయి.

వాటిని వింటూ ఏవో ఆలోచనల్లో వున్న గౌరికి "ష్షే... యిష్షో... మ్మేయ్! ఎవరిదో కోడి వొచ్చింది. అదిలీ..." ముసలామె కేక విన్పించింది.

ఆదరా బాదరా బైటకొచ్చింది గౌరి.

"ఇష్షో... ష్షో..." అంటూ చేత అదిలిం

చింది.

కోళ్లన్నీ బెదరిపోతున్నాయి గాని పరాయి కోడి ఏదో తెలీటం లేదు. అన్నీ ఒకే రకంగా కన్పిస్తున్నాయి. ఎట్లా కనుక్కోవాలి?

"అదో... ఆ పూలకోడి... అదిలీ..." వార పాక వద్దనుంచి అరుస్తోంది. పూలకోళ్లు కూడా నాలుగున్నాయి. ఏ పూలకోడో?

చేయెత్తి అన్నింటినీ అదిలించింది.

ఈలోపు శివుడు రావటంతో సమస్య తొలగిపోయింది.

అతను వచ్చీరాగానే గట్టిగా "ష్షో..." అనే సరికి పరాయి కోడి బెదరి బైటకు పరువెత్తింది. ఇంటి కోళ్లు భయపడకుండా గింజలు యేరుకు తింటున్నాయి.

అతని అదలింపులో ఏదో అధికారం స్ఫురించింది గౌరికి. సాధికారిక మందలింపు. తన కోళ్లకు మాత్రం పరిచితమైన ఇంపు.

"ఇంగా కోల్లనూ గొడ్డను గూడా కనుక్కోలేకుందిరా నీ పెండ్లాం..." లక్షుమ్మ చెప్పింది.

శివుడు నవ్వుకొన్నాడు.

గౌరికి సిగ్గుగా అన్పించింది.

వాటిని ఎట్లా గుర్తించాలో అర్థం కాలేదు.

సాయంత్రం కడపనించి సరోజమ్మ వచ్చింది.

మళ్లీ తినుబండారాలూ, గౌరికి కావలసిన వస్తువులూ, ఇంకొన్ని బట్టలూ, పెద్ద సూటు కేసు తెచ్చింది

వీరారెడ్డి తాకిడి ఇప్పుడిప్పుడే ఆగేట్టు లేదట. తాగొచ్చి తిడుతూనే వున్నాడట. లబలబ ఏడుస్తున్నాడట. గౌరి కనిపిస్తే తాళిబొట్టు తెంచి అయినా తన పెండ్లాన్ని చేసుకుంటాననంటూ తాగి కూస్తున్నాడట.

"కడపలో కూకుంటే గౌరి కనిపిస్తాదంటనా? రమ్మను... యీ వూరికి రమ్మను... అడ్రసీ అత్తా! వొచ్చి తీసప్పొమ్మను" శివుడు అన్నాడు. అతని కంఠంలో ఏదో కరకుదనం ప్రతిధ్వనించింది.

"వొద్దొద్దులే నాయినా! నా అగసాట్లేవో నేను పడ్తాలే... ఇయ్యాల కాకుంటే రేపు... ఓపికబడ్తే వాడే సర్దుకుంటాడులే... అయితే నాకొకటే బాధగా వుందిబ్బీ! పెండ్లి జేసి అల్లుణ్ని కూతుర్ని ఒక్కపూట కూడా ఇంటి కాడుంచకోలేక పోయిన్ననే. ఒక్క పూట అల్లెం పెట్టలేక పోయిన్ననే" అంటూ కళ్లొత్తుకొంది.

వీధుల్లోకి వెళ్లినపుడు మాత్రం పాతపాట చాలించలేదు సరోజమ్మ. తన కూతురు అల్లుళ్లను ఖచ్చితంగా టౌనుకు తీసప్పోతానంటూ గట్టిగా చెప్పింది. ఉన్నది ఒక్క రోజయినా పొలాలన్నీ చూసి వచ్చింది. ముసలాళ్ల వద్ద కూచుని ఆస్తి విలువను మదింపు వేసింది. పొలాన్ని కోరుకో, గుత్తకో ఇస్తే ఏమాత్రం ఫలితమొస్తుందో అంచనాలు కట్టించింది.

కూతుర్ని దగ్గరకు పిల్చుకొని చెప్పింది- "చినుకులు పడిన నాలుగు రోజులూ వీళ్ల మొగాలూ, వీళ్ల పైరు మొగాలూ పచ్చగా కలకలమంటా ఉంటాయమ్మా! వారం రోజులు ఎండలు కాయనీ! వీళ్ల మొగాల దిక్కు సూడు. ఏడాది కరువు రానీ! వీళ్ల బతుకు దిక్కు సూడు. ఎవురెట్టన్నా పోనీ మీరు ఈ మట్టి పిసుక్కొనే పని చేసేది లేదు. కడపలో అంగడి చూసుకోవాల్సుందే" అంది స్పష్టంగా.

తను స్వయంగా సీకాయతో తల రుద్ది కూతురికి స్నానం చేయించింది.

ఆమె తల రుద్దుతూ వుంటే శివుడు గుర్తొచ్చాడు గౌరికి.

ఒళ్లంతా నూనె రాసి, కండరాలు కదిలేలా ఎంతసేపు రుద్దాడో తనకయితే గుర్తేలేదు. మొదట సిగ్గుపడినా తర్వాత అన్ని భావాలకూ అతీతమైన తాదాత్మ్యత ఏదో మనస్సులో చేరి ప్రపంచాన్ని మరచిపోయింది.

చతుర 30 వసంతాలు

తన శరీర మొకటి అక్కడున్నట్లుగా స్మృతికి రాలేదు. కండరాల నొప్పులు ఏ దిశగా పారిపోయాయో తెలీదుగాని వొళ్లంతా అదో రకమైన తిమ్మిర్లతో మొదలై రాను రాను శరీరమే లేనట్లుగా అనుభూతమవుతూ... తనువంతా ఆవిరై గాల్లో తేలిపోతూ... మరెప్పుడో వేడి నీళ్ల సోకి నేలమీదికి దిగి వచ్చి... అదొక అద్భుతమైన అనుభూతి.

నిన్న మునెమ్మ ఇంట్లోకి వచ్చినపుడు తన్నెందుకో పైనించి కిందకు అదేపనిగా తదేకంగా చూసింది. తర్వాత ఏదో పాట పాడుకొంటూ పిచ్చిదానిలా వెళ్లింది. ఆమె ప్రవర్తన వింతగా అన్పించింది.

ముసలి గోవిందమ్మ కూడా అంతే- తన దగ్గరగా కూచుని చేతులు నిమిరింది. కాలి పిక్కలు నిమిరింది. యథాలాపంగా అన్నట్లుగా ఎదను కూడా తాకింది. తను అదోరకంగా చూసేసరికి తడబడుతూ లేచి వెళ్లింది.

రాత్రి స్నేహితులతో కలిసి కుందేలి వేటకు వెళ్లాడు శివుడు.

గౌరిని పక్కలో వేసికొని రాత్రంతా కబుర్లు చెప్పే అవకాశం దక్కింది సరోజమ్మకు.

కడప విషయాలు మరోసారి చెప్పుకొన్నారు. ఏవేవో సంగతులన్నీ ముచ్చటించుకున్నారు.

కూతుర్ని తన డొక్కలో దాచుకొని నిదురించే అవకాశం ఆ తల్లి మనస్సును ఎంతగానో ఆనందింపజేసింది. కబుర్ల అనంతరం హాయిగా కళ్లు మూసింది.

ఎప్పుడో ఓ జామున వొంటిమీద ఏదో కదలాడిన స్పర్శకు నిద్ర తెరలు తొలగిపోయాయి ఆమెకు. అది కూతురి చేతి స్పర్శగా అర్థమైంది. తన మీద చేయి వేసి కౌగిలించుకొని పడుకొంది కూతురు.

తల్లి హృదయం పరవశించింది.

మరో జామున మీద కాలేసి పడుకొన్న స్పర్శ.

ఇంకా చిన్న పిల్లల చేష్టలు పోలేదనుకొంది.

ఇంకో జామున ఎదల మీద బరువుగా తోచి చేతుల్తో తడిమి చూసింది.

తన గుండెల మీద తలాన్చి ఆదమరచి నిదురిస్తూ వుంది కూతురు.

ఇది కొత్త భంగిమ.

చిన్న తనాన ఎప్పుడో పాలు తాగే వయస్సులో ఇలాగే పడుకొనేది. మరెప్పుడూ యీ భంగిమ తనెరిగి వుండదు. మళ్లీ ఇప్పుడు...

సరోజమ్మకు అర్థమై చిన్నగా నవ్వుకొంది.

తన ఎదలు ఆమె బరువును భరించలేకున్నాయి

వూపిరి పీల్చుకోవటం కష్టంగా వుంది.

మెల్లిగా కూతురి తలను కిందకు జరిపింది.

అప్పటికే మూడు జాములు గడిచినట్లున్నాయి.

మరికొంతసేపటికి కూతురు లేచి గోడ గడియారం కేసి చూసి బొంతదుప్పటి చేతుల్తో కరచుకొని తలుపు తీసి బైటకు నడవటం చూసి ఆశ్చర్యపోయింది.

అల్లుడు కూడా లేడుగదా! ఎక్కడికి వెళుతోన్నట్లు?

వెనకే అనుసరించింది సరోజమ్మ.

నేరుగా గొడ్లపాకలోకి వెళ్లి, అక్కడున్న మంచాన్ని వాల్చి, బొంత పరిచి, దుప్పటి కప్పుకొని ముడుచుక పడుకొన్న కూతురి కేసి వింతగా చూసింది.

శివుడు వచ్చిన ఆనవాళ్లు లేవు. మరి...?

తనూ వెళ్లి కూతరి పక్కగా పడుకొందామనుకొంది.

ఆలోచన విరమించుకొని వచ్చి ఇంట్లో మంచమ్మీద కూచుంది.

ఆమెకు నిద్రబట్ట లేదు.

ఒకటి రెండుసార్లు బైటకెళ్లి వారపాక కేసి తొంగిచూసి లోపలికి వెళ్లేందుకు ధైర్యం చాలక తిరిగొచ్చింది.

చీకట్లు విచ్చే సమయంలో ఇక తప్పదన్నట్లుగా వెళ్లి చూసేసరికి.. అదే భంగిమ... అల్లుని ఎదల మీద తలాన్చి నిద్రిస్తూ కూతురు...

వెనుదిరిగి వచ్చి "గౌరీ" అంటూ పిల్చింది.

అంచనా వేసికొని అతని కోసం సంకేత స్థలంలో నిరీక్షించటం, పని కాకుంటే అతని రాక ఆలస్యమవుతుందని తెలిసి కూడా నిర్ణయించుకొన్న సమయాన్నించే ఎదురు చూడటం... అతను ఇంటి వద్ద లేని రాత్రి కూడా ఎడబాటు సహించలేవా కూతురా! ఆలుమగల మధ్య కూడా ప్రేయసీ ప్రియుల్లాగా దొంగతనపు కలయికలు వుండాలా? పెద్ద వాళ్ల కళ్లుగప్పి మొగుని కోసం ఎదురు చూసే పెండ్లాన్ని నిన్నొక్కదాన్నే చూసిన్నే నా వగలమారి కూతురా! మీరిద్దరూ ఆలూ మొగుల్లో, ప్రేయసీ ప్రియులో నాకర్థం



**అతను ఇంటి వద్ద లేని రాత్రి కూడా ఎడబాటు సహించలేవా కూతురా! ఆలుమగల మధ్య కూడా ప్రేయసీ ప్రియుల్లాగా దొంగతనపు కలయికలు వుండాలా?**

కాలేదే బిడ్డా! అయినా ఎన్నాళ్లులే యీ మర్లు! పిల్లో పిల్లోడో పుట్టేదాంకనే గదా! ఇట్లా వొద్దికతో వుండే ఆడదానికి కడుపయ్యేది ఎంతసేపులే..." అనుకొంది.

రెండు పిలుపుల అనంతరం ఆమె పలికింది.

బాగా తెల్లారింతర్వాత గాని వారపాక లోంచి బైటకు రాలేదు గౌరి. ఆమె చేతిలో మాంసపు మూట వుంది.

అన్నమూ కూర తనే చేసింది సరోజమ్మ.

ఆమె ఆలోచనల నిండా గౌరి చేష్టలు కదలాడుతున్నాయి. తన యవ్వనానుభవాల్ని గుర్తుకు తెచ్చుకొని గౌరి ప్రవర్తనల్ని విశ్లేషించేందుకు ప్రయత్నించింది.

తెల్లారేసరికి వేటనుంచి వచ్చే మగనికొరకై వారపాకలో కెళ్లి పడుకొని శరీరాన్ని అతని స్పర్శకోసం సిద్ధం చేసి వుంచింది.

గతంలో లాగా సిగ్గు పడిన ఛాయలు కూడా ఆమె మొహంలో తనకు కన్పించలేదు. తన చేష్టలు అత్యంత సహజమన్నట్లుగా ప్రవర్తించింది.

"ఎంత ఎదిగావు కూతురా!" అనుకొంది సరోజమ్మ

అతనెప్పుడు ఇంటికి రాగలడో ముందే

కుందేలి మాంసం రుచికరంగా వుంది. ఉదయం జొన్న రొట్టె పైకి మధ్యాహ్నం ఉడుకుడుకు సంకటి ముద్దపైకి ఎక్కిన కూర జిహ్వాకు మధురస్మృతుల సద్దిమాటను కట్టింది.

పొద్దు పడమటికి దిగిం తర్వాత ప్రయాణమై వెళ్లిపోయింది సరోజమ్మ.

మాంసం దండిగా వుండటంతో కొంత కూతురి ఇంటికి పంపింది లక్షమ్మ. పిల్లలిద్దరూ వచ్చి ఇక్కడే తినిపోయారు.

పొద్దు గుంకేటపుడు గోవిందమ్మ వచ్చింది "ఎట్టబోయిండమ్మే ఆ నా బట్టి?" అంటూ.

"యాధెక్కినట్టుండాడు జేజీ!" చెప్పింది గౌరి.

మంచమ్మీద కూచుంటూ అంది "ఏం లగువు నేర్చుకున్నెడే నీ మొగుడు! పెండ్ల

యిందీ... ఎన్నెన్ని జిత్తులు టక్కుటమా రాలు నేర్చుకొన్నెడే..."

మళ్లీ ఏదో సమస్య తెచ్చినట్టుంది అ నుకుంటూ.

"ఏం జేజీ? " అనడిగింది.

"కుందేలి కూరాకు అందరికీ వొక బాగ మైతే యీడు రొండు బాగాల్దెచ్చుకొన్నెడే.."

"ఎందుకిస్తారు? "

"ఇయ్యాలే..."

"మరి..."

"పెండ్లింటికాడ లడ్డు కారేలు నాకూ నా పెండ్లానికంటా రొండు బాగా లిచ్చిరి. పుట్ట గోవులు రొండు బాగాలిచ్చిరి. కూరగాయలు రొండు బాగా లిచ్చిరి... అందరూ కల్సి నవ్వుకోడానికి నేనూ నా పెండ్లాం దొరికి నాము. పనికిమాలినయన్నీ రొండు బాగా లిచ్చి కడుపునిండా నవ్వుకొంటారు. ఇప్పుడీ కుందేల కూరాకు గూడా రొండు బాగా లియ్యాల్సిందేనని హఠం పట్టుబట్టి తెచ్చుకొ న్నెడంటమ్మే" చెప్పింది.

గౌరికి నవ్వొచ్చింది.

రాత్రి ఆ విషయాన్నే ఒకటికి రెండుసార్లు చెప్పించుకొని అతని మీదబడి నవ్వుతూ ఉండిపోయింది.

పిచ్చుకలు పగలంతా ఆడవాళ్ల సహనాన్ని పరీక్షిస్తున్నాయి. ఎన్నిసార్లు వూడ్చినా కసవు రాలుపుతూనే వున్నాయి.

లక్షుమ్మ గొణుక్కొంటూ వుంది.

గౌరికి కూడా విసుగ్గా వుంది.

విషయం శివుని దృష్టికి వెళ్లేసరికి ముల్లు గర్ర తీసుకొచ్చాడు 'గూటిని పొడిచి పాడుజే స్తా'నంటూ.

"ఒరే ఒరే..." అంటూ అడ్డుకొంది లక్షుమ్మ.

"గుడ్లు పెట్టుకోనుంటాయి నాయినా! పాపంరా... యీ కారు పిల్లల్లేపనీ. రేపు కారుకు గూడు పెట్టకుండా జేస్తాంలే..." అంది.

అత్తకేసి ఆశ్చర్యంగా చూసింది గౌరి.

"మరెందుకమ్మా వూరికే గొనుక్కోవడం...? ఇండ్ల న్నేంక మనమొక్కరమే సంసారం జేస్నమా? యాన్నో కొట్టం కప్పులో అవి గూడు బెట్టుకొనె. మీకే మద్ద మొచ్చె అవి మాత్రం సంసారం జేసుకో వద్దా? " అన్నాడు శివుడు.

అతనికేసి మరింత వింతగా చూసింది గౌరి.

సాయంత్రం వేపచెట్టు కింది అరుగుమీద కూచుని వుంది లక్షుమ్మ - వక్కాకు నమ లుతూ.

అంతలో ఓ కుక్క చావు బతుకుల మీద పరుగెత్తుకొంటూ వచ్చింది అక్కడికి. వెనక్కి తిరిగి చూస్తూ వామి దాకా వెళ్లినిల్చుంది. పొట్ట నేలకు జేరాడుతోంది. పాలశేర్లు ఉబికి కన్పిస్తున్నాయి. కడుపు నిండా పిల్లలు న్నాయి కాబోలు పాపం ఆ సూడి కుక్క నాలుక బైటకు చాచి వగరిస్తూ వుంది.

అంతలో అక్కడికొచ్చారు పట్టుడు లావు రాళ్లు చేతబట్టుకొని ఇద్దరు యువకులు

"అత్తా! ఎట్టబాయె...? " అంటూ అటు ఇ టు చూశారు. వామి దగ్గర కుక్క కన్పించ గానే చేతిలో రాళ్లను బలంగా విసిరారు.

'కయ్యో'మని పక్కకు ఎగిరి రాతి దెబ్బ తప్పించుకొంటూ వామి కిందకు దూరింది కుక్క.

"రారా! తిరుక్కో... ఇయ్యాల దీని సంగతి అటో ఇటో తేలిపోవాల..." కర్ర కోసం వెంపర్లాడాడు ఓ యువకుడు.

"యేమబ్బే! ఎందుకు దానెంట పడ్తాం డారు? " అడిగింది లక్షుమ్మ

"మనిసి యేమారితే సాలు ఇండ్లల్లో దూరతాందిత్తా! రోజూ కుండల్లో జొరబడి కూడు • తినిపోడమే. దబ్బులు తునగ కొరకి వాకిండ్లకు బొక్కలు జేస్తాంది... దీన్ని కాల్లి

రగ్గాడితే గాని పీడబో దు..." చెప్పాడు కర్రతో వామికేసి వెళుతూ.

"సరే బో సంబడంలే... అది సూడి కుక్కబ్బే! రేపటో మాపటో యీనుకుంటది.. దాన్ని కొడ్తే పాపంలో పడ్తారు..." చెప్పింది.

"పాపమో పున్నెమో... దీని పోడు తట్టు కోలేకుండాం లే..." వెనుదిరగలేదు అతను.

"బ్బేయ్! నీకే సెప్పేది... దాని జోలికి పోగాకు..." అరచినట్లుగా అంది.

అతనింకా ముందుకు పోబోతోంటే- "యాందిరా నాబట్ట వాడూ! పది కాలాల బాటు సల్లంగా బతకుదామని లేవే... సూడి కుక్కరా అది. కడుపుతో వుంది. దాన్ని కొట్ట గాకమంటే కొడ్తానంటావే... బుద్దిలేదు నీకు... రా.. రా ఎనిక్కి..." తీవ్రంగా అంటూ లేచి నిల్చుంది.

అతను ఆగిపోయి ఆమెకేసి చూశాడు.

"దొంగతనం జెయ్యకుంటే దానికి తిండెట్టా వస్పాదబ్బే? దాని కడుపులో నాల గైదు పిల్లలుంటాయి. అది తినే తిండి దాని కొక్కదానికే గాదు. పిల్లలగ్గూడా కర్చయిద్ది. ఇండ్లల్లేకి జొరబడకుండా యాన్నించి సంపా దించాల అంత తిండి? ఎప్పుడన్నా పిల్చి ఒక్క పిడ్స సంగటేంసింటారారా మీరు? ... కడుపుతో వుండేవాల్ల బాధ మీ మగ నా బట్టలకు ఏం దెలుస్పాది... కొట్టడం కాద బ్బే... యింటికాడికొచ్చినప్పుడు ఒక్కపిడ్స సంగటి బెయ్యి సాలు. అది మీ యింట్లో దూరితే అప్పుడడుగు..." కేకలేస్తూనే వుంది ఆమె.

యువకులిద్దరూ ఏదో గొణుక్కొంటూ బిరబిర అక్కణ్ణించి దాటిపోయారు.

అత్తకేసి తదేకంగా చూడసాగింది గౌరి.

ఆమె కళ్ల వెనక వ్యక్తీకరించలేని భావా లెన్నో కదలాడుతూ వుంటే శిలా ప్రతిమలా నిల్చుండి పోయింది.

కడుపుతో వుండే అది దొంగకుక్కయినా సరే సంకటి పిడచ వేయాలనటం, బాధ పెట్టకూడదనటం, ఇండ్లంతా రోత జే స్తోన్నా సరే గుడ్లున్న పిచ్చుక గూడును చెరచకూడదనటం, అవసరమైతే ఆ ప్రాణుల కోసం కొట్లాటకు కూడా వెనుదీ యక పోవటం... ఏమీ తెలీని అమాయ కురాల్లా కన్పించే ఆమెలో యీ మాన వత్వం... గౌరిని ఇదీ అని చెప్పలేనంతగా అబ్బుర పరుస్తున్నాయి.

* * *

ఉరుములు మెరుపులతో ఉత్తర కార్తె వచ్చింది. మంచివానే కురిసిపోయింది.

వానకు తడవటం వలన కలివెపండ్లు పుచ్చిపోతున్నాయి.

అక్కడక్కడా బలిజపండ్లు మాగి కన్పిస్తు న్నాయి.

దోర బలిజకాయల్ని కోసుకొచ్చి వాటికి సన్నసన్న గులకరాళ్లు చేర్చి చిన్న గుంట తవ్వి అందులో పోసి, పైన తంగేడాకు కప్పి, దానిపైన సుద్దబండను బరువెత్తి, మరుసటి రోజు పండె విప్పి చూసి కొంటే బలిజకాయలన్నీ బెల్లపు రంగులో కలమాగి వుంటాయి. వాటిని యేరుకు తినటం పిల్ల లకు అంతులేని ఆనందాన్నిచ్చే చర్య.

గౌరికి కూడా తను పిల్లగా మారి గొడ్ల పిల్లలతో మమేకం కావటం మధురానుభూ తినిచ్చే అనుభవమయ్యింది.

తర్వాత శివుడే దోరకాయల్ని తెచ్చి గోడ కింద గుంట తీసి మాగబెట్టి, గౌరితో కలిసి నిక్కరులో కుర్రానిగా మారుతున్నాడు.

తూర్పు కొండల్నించి కప్పలపల్లె ముత్రా సులు బిక్కిపండ్ల గంపలు తెస్తున్నారు.

బిక్కి కాయలు ఇంకా ముదరలేదు. పచ్చి కాయల్నే కోసుకొచ్చి మగ్గబెట్టి పండ్లగా మార్చి అమ్ముతున్నారు. అన్నిటినీ గౌరికి తినిపిస్తున్నాడు.

చతుర 30 వసంతాలు

ఉత్తరకార్తె చివరకంతా తూర్పు గాలులు ప్రారంభమయ్యాయి.

సొద్ద కంకులు గింజపట్టాయి.

వేరుసెనగ చెట్లకు సన్నని పిందెలు వూరాయి. చూస్తే లేలేత పప్పు చుట్టూ నీరుతో కూడిన కండ - ఇంకా కొత్త వూడల్ని దించుతూ వేర్లు.

సొద్ద చేలకు పక్షుల పోడు జాస్తయింది.

చేని మధ్యగా మంచె, దానిమీద మనిషి, మనిషి చేతిలో వడిసెల. వడిసెల వారులో రాయి... రాతి లక్ష్యం రామ చిలుక... రాయి తగిలితే గాని చిలుక లేవదు. రాయి తగలటం ఎప్పుడో గాని జరగని పని. అందుకే చిలుక చేలో వాలకముందే నిర్విరామంగా కేకలేస్తుంటారు. కేకలకు అనుగుణంగా రామచిలకలు కంకుల మీద వాలబోతూ, లేస్తూ, దూరంగా సాగుతూ కనువిందు చేస్తున్నాయి.

సొద్ద కంకిని కోసి దాన్ని అరచేతిలో నలిపి, బుసక వూది సొద్దల్ని గౌరి నోట్లో పోశాడు శివుడు. కంకి కాల్చి కొత్త రుచిని అందించాడు.

ఉరుము ఉరిమినప్పుడు కంప కట్ట తల్లో లేచే పుట్టగొడుగుల్ని ఎవరూ కానకుండా పీక్కొచ్చి కూర వండించి వినూత్నమైన రుచిని అనుభవింపజేశాడు.

ఈ మధ్యకాలంలో సాయంత్రాలు వరిమడి వద్దకు వెళ్లినపుడల్లా వింతగా స్పందిస్తోంది గౌరి.

"ఇదో ఈ మునం సగానికి నువ్వు నాటిందే... అదో... ఆ గెట్టు వారన కాలు పీక్కోలేక నాలుగు కర్రలు తొక్కినావు గుర్తుందే.... అవి కూడా ఎదురెక్కి వొడుపుగా పెరుగుతండాయి సూడు. నీ సెయ్యి పడిన కాడంతా వరికర్రలకు కూడా కైపెక్కినట్టుంది..." అంటూ శివుడు వ్యాఖ్యానించటం...

ఆమె వరిపైరు కేసి చూడటం...

అనలు కొనలుగా పెరుగుతోన్న వరిపైరు

చతుర 30 వసంతాలు

ఆమెకు అత్యంత ఆత్మీయంగా తోస్తోంది. తను నాటిన మునాలను గట్టు మీద నిలబడి చాలా సేపు గుడ్లప్పగించి చూస్తూండి పోతోంది. తను నాటగా జీవం పోసుకొన్న వరికర్రలు ఏపుగా పెరిగిరావటంతో ఆమె ఎదలో ఏదో గర్వాతిశయపు తృప్తి. కళ్లలో పచ్చదనపు నిషా.

మిరప-చాళ్లు చాళ్లుగా అందంగా వుంది. కలుపు గడ్డి కూడా అందంగానే అలుము కొంది. ప్రస్తుతానికి గడ్డి కంటే ఎత్తుగా వుంది గాబట్టి మిరప దాని ఉనికి చాటు కొంటోంది గాని ఓ వారం వేలుపెట్టకుంటే మిరపను తొక్కేస్తుంది కలుపు.

అందుకే తొందరపడి కూలీల్ని పిలిపించి తొల్లికలతో తవ్వకం పెట్టించి శుభ్రంగా గడ్డి తీయించాడు శివుడు.

కూలీలతోటి తనూ కూచుని కొంతసేపు తొల్లిక ఆడించేసరికి అరచేతులు బొబ్బ లెక్కాయి గౌరికి.

కలుపు తీసింతర్వాత ఎర్రబారిన నేలమీద చాళ్ళు చాళ్ళుగా అందంగా కన్పిస్తున్నాయి మిరప మొలకలు. కూలీల చేతి చమత్కారం వల్ల చేనంతా ఆరోగ్యంగా వుంది.

వరిమళ్లల్లో కూడా కలుపు తీసి ఎరువులు చల్లారు.

మధ్యాహ్నం అన్నం తిని తీరిగ్గా నట్టింట మంచమేసికొని ఆలుమగలు యవ్వారం జేస్తోంటే- దుప్పటి మీద ఏదో 'దబ్బు'మని పడిన చప్పుడు.

ఉలిక్కిపడి అటుకేసి చూసి ఎగిరిపడింది గౌరి.

ఏదో వింత జీవి పీచుపీచుమని అరుస్తూ- బావురు కప్పలా నోటిని ఎర్రగా తెరుస్తూ...

ఆమెను పొదివి పట్టుకొని చిరునవ్వుతో దానికేసి చేయి చాచాడు శివుడు. చేతిని ముక్కుతో పొడిచి ఎదిరిస్తున్న యీకలు తోకలు రాని లేలేత పిచ్చుకపిల్లను వొడుపుగా పట్టుకొన్నాడు.

'పీచు'మని మొత్తుకొంటూ వుంది అది.

అప్పుడే బైట్నించి లోపలికొచ్చింది తల్లి పిచ్చుక. గోలగోలగా అరుస్తూ అటుఇటు ఎగురసాగింది.

గూటి అంచుదాకా వచ్చిన పిచ్చుకపిల్ల పొరబాటున జారిపడ్డట్టుంది. సందర్భాన్ని వివరించి చెప్పాడు గౌరికి.

ఇంకా బెరుకు బెరుగ్గానే చూస్తోంది ఆమె.

తర్వాత మెల్లగా చేయి చాచి పిచ్చుక పిల్లను తాకింది. పరాయి చేతుల స్పర్శను తీవ్రంగా వ్యతిరేకిస్తోంది ఆజీవి.

ఒళ్లంతా గజగజ వణకుతోంది. శరీరమంతా పిడికెడు గుండె అయి ప్రకంపిస్తోంది.

తల్లి పిచ్చుక మొత్తుకొంటూనే వుంది.

"దీన్నేం జెయ్యాల?" అడిగింది "సాక్కుందామా!"

"తల్లిని బిడ్డను దూరం జేస్తే మహాపాపం... దీన్ని అమ్మకాడ జేర్చాల... అమ్మ లేని పిల్లల్ను మనం సాక్కున్నే పర్లేదు. దీనికి అమ్మ ఉందిగదా!" అంటూ పిచ్చుక పిల్లను తిరిగి గూట్లో పెట్టేందుకు ప్రయత్నించాడు.

గూడు చేతులకు అందనంత ఎత్తులో వుంది.

మంచం మీదకు ఎక్కినా అందలేదు.

నిచ్చెన తెద్దామనుకొన్నాడు.

గౌరిని చూసింతర్వాత ఆ ప్రయత్నాన్ని మానుకొన్నాడు.

తను చేయబోయే పనిని తల్చుకొని అతనికి నవ్వొచ్చింది.

"ఇట్లా దగ్గెరికి రా!" అన్నాడు.

తను గొంతుక్కూచుంటూ" నా భుజాల మీదకెక్కు..." చెప్పాడు. అర్థమైంది ఆమెకు.

"అమ్మో భయం..." అంది.



"కిందేస్తాననా? "

"కాదు కాదు... కింద పడ్తానని..."

"పడినా నా మీదనే పడ్తావులే... ఎక్కు..." చెప్పాడు.

తప్పలేదు గౌరికి

చీరను సవరించుకొని అతని రెండు భుజాలకు అటుఇటు కాళ్లేసి కూచుంది

మెల్లిగా పైకి లేస్తున్నాడు అతను.

భయంతో కూడిన నవ్వు... ఏదో గిలిగింతల నవ్వు.

నిటారుగా నిల్చునేసరికి కొట్టం కప్పు దరిదాపులకు వచ్చింది ఆమె తల.

అతని జుట్టు రెండు చేతుల్తో పట్టుకుంది.

రెండు కాళ్లను అతని పక్కటెముకలకు తన్ని పట్టింది.

చంటి పిల్లలా కరచి పట్టుకొని ఏదో వింత అనుభూతి కలుగుతుండగా ఒళ్లంతా గగుర్పాటుకు గురవుతుండగా అతని మెడల మీద పరవశురాలవుతోంది.

పిచ్చుక పిల్లను పైకందించాడు గూట్లో పెట్టమన్నట్లుగా

దాన్ని అందుకొని గూడుకేసి చాచింది.

లోపల మరోపిల్ల కదలకుండా కూచుని తనకేసే చూస్తోంది.

చతుర 30 వసంతాలు

దూలం మీద అటు ఇటు ఆరాటంగా కదులుతూ గోలగోలగా అరుస్తోంది తల్లి పిచ్చుక.

పిచ్చుక పిల్లను గూట్లో పెట్టింది గౌరి.

అది నేరుగా తన సహోదరి దగ్గరకు వెళ్ళి వొదుక్కొంది.

"అయిందా... కిందకు దించేనా? "

పలుకలేదు ఆమె.

అతని మెడల మీద స్వారీ చేయడం చాలా హాయిగా వుంది.

"నిన్నే... దించేనా.. మంచమ్మీద విసరేసేనా..."

"గూడు అందలే..." చెప్పింది "ఇంకొంచం ముందుకు...అబ్బే... కొద్దిగా వెనక్కి... ఇటువైపు... ఆ... ఇంకొద్ది పక్కకు... మల్లా దూరమయ్యావు బావా!..."

అతన్ని అటు ఇటు కదిలిస్తోంది.

విషయమేమిటో అర్థమైంది శివునికి.

దొడ్డి వాకిట్లోంచి ఎదుటి గోడ దాకా గుఱ్ఱంలా అటుఇటు నాలుగుసార్లు పరుగెత్తి "అందిందా గూడు? " అనడిగాడు.

ఒళ్లంతా గిలిగింతలు పెట్టినట్లయి నవ్వు తన్నుకొచ్చింది ఆమెకు.

విరగబడి నవ్వింది.

తనూ నవ్వుతూ ఎందుకో వాకిలిదాకా చూపులెత్తి ఉలిక్కిపడ్డాడు శివుడు. గుడ్లప్పగించి అటే చూస్తూ నిల్చుండిపోయాడు.

ఎప్పుడు వచ్చిందో వాకిలి సగం తీసి లోపలికి అడుగుపెట్టి నిల్చుని వుంది ముసలి గోవిందమ్మ. తమకేసి నిలువుగుడ్లేసుకు చూస్తోంది.

ఆమెను చూడగానే ఒళ్లంతా జలదరించినట్లయింది గౌరికి. పెనుగులాడి కిందకు దిగజారింది.

ఆలుమగళ్ళ చూపులు తన మీద పడ్డ విషయం గమనించగానే గోవిందమ్మలో కదలిక వచ్చింది.

"ఓరె నాబట్ట గదురా!" అంది. నోటి మీద చేత్తో కొట్టుకొంటూ.

శివుడు కూడా వెంటనే స్పందించాడు.

"ఆలుమొగుండ్లు వాకిలేసుకొని యింట్లో ఉంటే - వాకిల్దీసి సూడ్డానికి నీకు సిగ్గులేదూ? " అన్నాడు గోవిందమ్మ దగ్గరగా వెళ్ళి.

"సిగ్గు నాకా నీకా...? " ఈసడింపుగా చూసింది.

"నాకెందుకూ? నీకే..." మీదకు పోయాడు. "నువ్వు మొగునితో సంసారం జెయ్యలేదా? మా తాత నిన్నెప్పుడూ సంకకెత్తుకోలేదా? పెండ్లయిన కొత్తల్లోనే మీయమ్మగారి యింటికాన్నుంచి నిన్ను బుజానేసుకొంటే... ఈ ఊరి గమిల్లో తెచ్చి దించినాడంటనే! నా పెండ్లాన్ని నేను కాసేపు మోసినందుకే నీ కండ్లు కుట్టినాయేమే ముసిల్దానా!" అన్నాడు.

"ఓరె అడ్డ నా బట్టా..." అంటూ బిత్తరపోతూ కోర చూపు చూసి వెనుదిరిగింది ఆమె.

వాని నోరు రేగినట్టుంది. ఏమైనా అన్నగలడు. తను వొల్లక పోయేసరికి బలవంత మ్మీద ఎత్తుకొచ్చాడు తన మొగుడు. బలవంతంగానే వొళ్లంతా పచ్చి పుండును జేసిండు. ఊళ్లో వాళ్లు ఆ విషయాలన్నీ ఎప్పుడో మరిచారు. ఈ నా బట్ట ఎట్లా కనుక్కొన్నాడో మరి... అదంతా రేపెట్టున్నాడు.

ఆ ఇంటి దరిదాపుల్లో కూడా నిలబడలేదు ఆమె.

"పిల్లనాబట్ట అయినా మంచి దెబ్బే కొట్టిండు..." అనుకొంది.

తర్వాత రోజు ఇంకో గట్టి దెబ్బే తగిలింది గోవిందమ్మకు.

రాత్రి అన్నాల వేళ మునెమ్మతో కలిసి వామిదొడ్డి దిశగా వెళ్ళి లక్షుమ్మను ఏమార్చి దొడ్డి గోడ కిందకు చేరుకొంది. అక్కడ రాళ్ళ మీద కూచుని వక్కాకు నమలటం ప్రారం

ప్రియమైన నా క్లయింట్స్‌కు సన్నిహితులకు
శ్రేయోభిలాషులకు బంధుమిత్రులకు
మహాశివరాత్రి మరియు
ఉగాది శుభాకాంక్షలు





**శ్రీమతి & శ్రీ**

**E.R. సోమయాజులు** (రాంజి)

చార్టర్డ్ అకౌంటెంట్

కొత్త అగ్రహారం, విజయనగరం

**Ph: 226343, 222343**

చతుర 30 వసంతాలు

భించారు ఇద్దరూ.

వరినాట్లు రోజు వాళ్ళు నొప్పులు కాబట్టి పెళ్ళాం వొళ్ళంతా నూనె రాచి శివుడు మర్దన జేశాడు. అంతటితో ఆగుతున్నాడా లేక రోజూ ఆ పిల్ల వీపేమైనా రుద్దుతున్నాడా? అనేది అనుమానం. దాన్ని తీర్చుకోడానికే వాళ్ళక్కడ తిష్ట వేశారు.

మగాడు పెళ్ళానికి వీపు రుద్దటం ఒక ఆడంగిలి చర్యగా భావించటం పల్లె జనాల అలవాటు. "వాడా! ఆడోల్ల యీపు రుద్దే టోడు" అంటూ ఎగతాళి కూడా చేస్తారు.

దాన్ని నిగ్గు దేల్చడానికే వాళ్ళ అన్వేషణ.

అయితే మధ్యలోనే వాళ్ళ వెదకులాటకు అవాంతరం వచ్చింది.

కారణం- వాళ్ళ పోకడ మీద లక్షుమ్మకు అనుమానం రావటమే.

ఎప్పుడూ ఈ కల్లాలకేసి రాని మునెమ్మ ఈ మధ్య కాలంలో తరచూ వస్తూండటం, అదీ గోవిందమ్మతో కలిసి కళ్ళాల్లోకి నడవటం, తర్వాత కనిపించక పోవటం...

అందుకే ఈరోజు వాళ్ళను ఒక కంట కనిపెట్ట సాగింది. వాళ్ళు తన్ను ఏమార్చి తమ దొడ్డి గోడ కిందకు చేరటం కళ్ళారా చూసింది.

అంతులేని ఆశ్చర్యం కలిగింది ఆమెకు...

వాళ్ళ చర్యల్ని ఏ విధంగా విశ్లేషించుకోవాలో అర్థం కాలేదు.

ఇద్దరూ కలిసి రాళ్ళమీద నిలబడి గోడకు అవతలి వైపు దొడ్లోకి తొంగి చూడటం కూడా పసిగట్టింది.

వాళ్ళు చూడదగిన సన్నివేశమేదో దొడ్లో జరుగుతోంది.

ఒక్క నిమిషం కూడా ఆలస్యం చేయలేదు ఆమె.

నేరుగా ఇంట్లోకెళ్ళింది.

దొడ్డి వాకిలి అడ్డగించి ఉంది.

లోపల ఎవరో స్నానం చేస్తున్నారు. కొడుకో... కోడలో...

మగ గొంతు సన్నగా విన్పిస్తోంది. దానికి తోడు గాజుల గలగలలు.

కొడుకు స్నానం చేస్తోంటే కోడలు వీపు రుద్దుతోంది కాబోలు.

'వాళ్లు ఏం చూస్తోన్నట్లు?'

'విశేషమేమీ లేకుంటే వాళ్ళెందుకు అంతగా తొంగి చూస్తారు?"

వాకిలి సందుల్లోంచి దొడ్లోకి చూపుల్ని సారించింది.

అక్కడి దృశ్యం ఆమెను ఉలిక్కి పడేలా చేసింది.

పెళ్ళాం తలమీద నీటిని ధారగా వొంచుతున్నాడు శివుడు.

ఆమె తల రుద్దుకొంటూ ఉంది.

గబుక్కున తల వెనక్కి లాక్కొంది లక్షుమ్మ.

సిగ్గుగా అన్పించింది ఆమెకు.

వెనుదిరిగి బైటకు నడిచింది.

కొంతసేపు ఆమెలో అలుముకు పోయిన స్తబ్దత.

తర్వాత ఆలోచిస్తోంటే- దొడ్డి గోడమీంచి అంతగా లోపలికి తొంగి తొంగి చూడాల్సిన అంశం ఏముందో అర్థమే కాలేదు.

కొత్తగా పెళ్లయింది. పెండ్లాం మోజు ఎవర్కైనా ఉంటుంది. వాళ్ళ చిలిపి చేష్టలు చాటుమాటుగా చూడటం తప్పు గదా! అందులోనూ తన దొడ్డి గోడమీంచి... తన కొడుకు కోడల్ని చూడటం... అంటే... రేపు వాళ్లను అల్లరి చేసేందుకే గదా! తన యింటి గుట్టు వీధిలోకి యీడ్చడమే గదా!

లక్షుమ్మకు కోపమొచ్చింది.

"ఒరే శివుడూ!" కేకేసింది.

"ఏమ్మా?" అంటూ అతను బైటకు రాగానే "దూడను కట్టేసినట్టు లేదు సూడూ!..." అంది.

అతను వామికేసి వెళ్ళగానే ఆమె యింట్లోకి నడిచింది.

తొట్లోని కడుగునీళ్ళల్లో సెరవ ముంచింది.

మురిగి కంపు కొడుతున్నాయి అవి.

దొడ్లోకెళ్ళి కోడలికేసి కూడా చూడకుండానే గోడవతల గుమ్మరించి వచ్చింది.

గోడ కింది ఇద్దరు ఆడాళ్ళు కడుగు నీళ్లల్లో మునిగిపోయారు. ఒళ్ళంతా అన్నం మెతుకులూ, మిరపకాయ తపకలూ, కరివే పాకు తునకలూ,చుట్టూ పది గజాల దూరం దాకా ఎగిసి వచ్చే మురుగు కంపూ...

భరించలేక పోయారు.

చిన్న శబ్దం చేసేందుక్కూడా లేదు.

ఇంటికి పొయ్యేదానికీ లేదు.

లోలోపల లబలబలాడుతూ వామిదొడ్డి కేసి నడిచారు.

అక్కడ దూడకు తలుగు పెడుతూ శివుడు.

"ఏమవ్వా! యాంది గమగమ లాడ్తాండవే? " వ్యంగ్యంగా అన్నాడు.

ఆమె సమాధానమివ్వలేదు.

"ఎవురొరే? " లక్షుమ్మ గొంతు.

"గోయిందవ్వలే... కడుగు నీళ్ళ తొట్లో పడినట్టుండాది... పాపం... సెరవ నిండా నీల్లు తీసకరామా..." అన్నాడు.

"కడుగు నీల్లల్లోనా? ... యాడొరే? ... ఒరే ఒరే... నేను పోసిన నీల్లేమో నాయి నా! తొట్లో కడుగు నీల్లు మురిగిపోయి కంపు గొడ్తాంటే... నిన్నట్నుంచి గొడ్డుగూడా మూతిబెట్టలే ఆ కంపుకు... సెరవలో ఎత్తి దొడ్డిగోడ అవతల పోసి నా... వాల్లమీంద పడినాయేమో!... అయినా వొరే! ఆ ముసి ల్ది మన గోడ కింద ఏం జేస్తాన్నెదంట? "

అప్పటికే మెల్లిగా వెనుదిరిగింది గోవిం దమ్మ.

ఆమె కన్నా ముందు జారుకొంది మునెమ్మ.

విషయమేమిటో సూచాయగా అర్థమవు తోంది శివునికి.

"ఓసి ముసిలి ముండా!" అనుకొన్నాడు.

అమ్మ తగిన శాస్తి జేసింది.

యాదృచ్ఛికమే అయినా మంచిపనే జరి గింది.

ఎన్ని రోజుల్నుంచి గోడ కింద మకాం వేశారో మరి!

గోడ పైన్నుంచి తొంగి చూస్తున్నారేమో!

చూసిందంతా వీధుల్లో కక్కరుగదా! అమ్మలక్కల చెవులు కొరకరు గదా!

అయినా తామేం కానిపని చేశామనీ!

మంచమ్మీద కూచుని ఆలోచిస్తున్నాడు.



**అందరూ అనుకొంటున్నట్లు ఆమె తనను వదిలిపెట్టి వెళ్లిపోతుందనే భయంతో ఆమెను మరగేసుకునేందుకు తను ప్రయత్నించటం లేదు**



తను చేసే పనులు ఊర్లో వాళ్లకు నవ్వు తెప్పించొచ్చు. ఊరి జనాల కోసం కాదుగదా తన ఈ చర్యలన్నీ.

పిట్ట ఎగిరిపోతుందేమోనని తను ఊడిగం చేయటం లేదు.

అందరూ అనుకొంటున్నట్లు పల్లెనూ, ఇంటినీ, చేలనూ, చెట్లనూ ఆమెకు అద్భుత మైన రీతిలో తను పరిచయం చేయాలనుకో వటం లేదు. తనను వదిలిపెట్టి వెళ్లిపోతుం దనే భయంతో ఆమెను మరగేసుకునేందుకు తను ప్రయత్నించటం లేదు. కోస్తా జిల్లాల నుంచి తెచ్చిన లేత కోడెదూళ్లకు పని మరి పేందుకు తౌడు, చెక్క, పచ్చిగడ్డి వగైరా విందు భోజనం అందించి అంకెకు తెచ్చుకొ న్నట్లుగా తనామెను లొంగదీసుకొని పని నేర్పాలనుకోవటంలేదు.

తనంటే ఎవరో ఆమెకు పరిచయం చేసు కొంటున్నాడు. తన శరీరాన్నీ, మనస్సునూ,

జీవితాన్నీ విప్పి ఆమె ముందు ప్రదర్శిస్తున్నాడు. రహస్యాల్లేని తనాన్ని విశదీకరిస్తున్నాడు. ఆత్మీయతానుబంధాల్ని పెంచుకొన్న యింటినీ, అమ్మనూ వదలి ఎక్కడో సుదూరంగా వున్న యీ మొరటు కొంపల్లోకి తనను నమ్ముకొని వచ్చింది. కాబట్టి ఆమెకు తనంటే ఏమిటో వివరిస్తున్నాడు. తన అలవాట్లనీ, తన చేష్టల్నీ, ఆమె పట్ల తన దృక్పథాన్నీ హృదయమెత్తి చెబుతున్నాడు.

తనన్నా, తన ఉనికి అన్నా కేవలం తనొక్కడే కాదుగదా! తనకు సంబంధించిన సమస్తమూ-పొలమూ పుట్రా, గొడ్డూగోదా, ఇల్లూ వాకిలీ, చెరువూ దొరువూ, వంకా వాగూ, చెట్టూ చేమా, ఆటాపాటా అన్నీ... ఇవన్నీ పరిచయమైతేనే తనామెకు పరిపూర్ణంగా పరిచయమైనట్టు లెఖ్ఖ. అందుకే వాటిని కూడా అంచెలంచెలుగా పరిచయం చేస్తున్నాడు. ఓపిగ్గా వివరిస్తున్నాడు. పరిచయం చేయాల్సిన విషయాలు ఇంకా చాలా వున్నాయి. సంఘటనలూ సందర్భాలూ మరెన్నో వున్నాయి.

తనూ, యీ పరిసరాలూ అన్నీ ఆమెకు తనవిగా అర్థం కావాలి. తన స్వంతంగా భావనకు రావాలి. అట్లాంటి అనుభూతి కలగాలంటే తన పరిచయం సరైన రీతిలో జరగాలి. సహజ పరిస్థితుల్లో జరగాలి.

తన ప్రయత్నాల్ని అందరూ ఎగతాళి చేస్తున్నారు. నవ్వుకొంటున్నారు. గోవిందమ్మలాంటి ముసలి ముండలు కూడా అర్థం చేసికోలేక అడ్డదారులు తొక్కుతున్నారు.

ఈ ముసిల్దానికి ఎప్పుడోకసారి మంచి గుణపాఠం చెప్పాలి. మునెమ్మకు కూడా తగిన శాస్తి చేయాలి.

ఇంట్లోకెళ్లాడు.

జరిగిన సంగతంతా గౌరికి చెప్పాడు.

ఆమె గుండె లబలబలాడింది.

వాళ్లు ఆడమ్మగారి చెవులు కొరికితే తను వీధి మొగమెట్లా చూడాలి?

బరితెగించిన ఆడదిగా తనను లెక్కించరు గదా!

శివుని గుండెలమీద తలదాచుకొని తనలోని భయాన్ని వెలిగక్కింది.

పకపక నవ్వాడు అతను.

గోవిందమ్మ కథను చెప్పాడు. మునెమ్మ భాగోతాన్ని వివరించాడు.

వాళ్లు వీధుల్లో నోరెత్తే పరిస్థితి లేదని భరోసా యిచ్చాడు.

## 7

రోజూ పొద్దున్నే లేచి చీకట్లు విచ్చకముందే ఇంటిముందు కసపూడ్చే లక్షుమ్మ ఆ రోజు తెల్లారిందాకా పొరక చేతబట్టలేదు. లేచింది మొదలు మంచం దిగి నేలమీద చేత్తో పుణుకుతూ ఏదో వెదకుతోంది.

నాలుగు మంచాల దూరంలోని కొట్టం ముందు నించి "యాందిమ్మే? " అంటూ ఓ ముసలామె వచ్చి దగ్గరగా నిల్చుంది.

"వక్క పేడులే..." చెప్పింది లక్షుమ్మ. "వక్కాకు నములాదామని అడపంలోంచి తీస్తాంటే జారిపడిందత్తా! కనబన్నే లే..."

ముసలామె కూడా వెదకేందుకు ప్రారంభించింది.

కండ్లు సరిగ్గా కనబడక పోవటం వలన వక్కంత వస్తువు ఏది వేళ్లకు తగిలినా పిసికి నొక్కిగాని వదలటం లేదు. అప్పుడప్పుడూ వాళ్ల సందున మేకపెంటికలు కూడ పడడంతో నలపడం వల్ల పొడిపొడిలా రాలుతున్నాయి.

వాకిట్లోంచి అంతా గమనిస్తోంది గౌరి.

నేలమీద కూచుని జరుగుతూ వేళ్లలో మునాలు మునాలుగా దున్నుతోన్న ముసలాళ్లిద్దర్నీ ఆశ్చర్యంగా చూడసాగింది.

అంతలో శివుడు వాళ్ల మధ్యకు వెళ్లటం, పరిశీలించి సిగినమంటి వక్కను వెదకి

యివ్వటం, ముసలామె మొహంలో అంతులేని ఆనందం తొంగిచూడటం...

ఒక వక్క కోసం... పావలా విలువ కూడా చేయని వక్కపలుకు కోసం ఏదో పోగొట్టుకొన్న విచారం... వెదకి సంపాదించాలనే తపన... దొరికిన తర్వాత మొహం నిండా ఆనందం... ఒక చిన్న 'వక్క' యిన్ని భావాలకు కారణమా!

గతంలో ఒకటి రెండుసార్లు తను గమనించింది - ఇరుగు పొరుగు ముసలాళ్లు వచ్చి ఆకో వక్కో అడిగితే - తమలపాకు అయితే సగం చీల్చి యివ్వటం, వక్క అయితే పగలగొట్టి చిన్న పలుకు యివ్వటం...

తను వక్కాకు నమలినా అంతే... సగం ఆకు, సగం వక్క పలుకు నోటబెట్టి పొగాకు పొడి వేసికొంటుంది. అడపంలో ఎన్ని వక్కలుండేది, ఎన్ని ఆకులుండేది, పగిలిన వక్క పలుకుండేది ఆమెకు బాగా ఎరుకే. అడపం విప్పేటప్పుడూ, ముడిచేటపుడూ, బొడ్లో దోపేటపుడూ ఎన్ని జాగ్రత్తలు పాటిస్తుందనీ అత్త!

ఆమే కాదు...యీ ముసలాళ్లంతా అంతే.

అంత చిన్న విషయంలో కూడా ఇంత లావు పొదుపు పాటించటం గౌరికి నవ్వు తెప్పిస్తోంది. నేలరాలిన బియ్యపు గింజలూ, కందిబేడలూ యేరి జాగ్రత్త పరచటం, తలకు ఆముదం రాసుకొన్నప్పుడు చేతులకు అంటిన నూనె మోకాళ్లకూ, కాలిపిక్కలకూ, చేతులకూ అంటేలా రుద్దుకోవటం, ఇంటి ముందర చిన్న పేడ తపకను కూడా పోనివ్వకుండా యేరి బుట్టలో వేసికొని దిబ్బకు చేర్చటం, పొరక పుల్లలు వూడి జారిపోతే అదృష్టం కారిపోయినట్లుగా భావించి వాటిని ఏకాగ్రతతో యేరి పొరకలో దూర్చటం, వొంటిమీది బట్టలకు బిర్రు తగలకుండా పడుకొనేప్పుడూ- కూచునేప్పుడూ మెలకువలు పాటించటం, గోడలకు రవ్వంత పెచ్చులూడినా తూమట్టి తెచ్చి పూసి జాగ్రత్త పడటం... ఇలా కూడా... స్వల్ప విషయాల్లో కూడా పొదుపరితనం... జాగ్రత్తలు తీసుకోవటం...

వాటిని గురించి ఆశ్చర్యపోతే- రాబోయే కరువుల్ని ఎదుర్కోవాలంటే పొదుపుగా బతకడమొక్కటే పరిష్కారమని సూచించటం...

ఇలాంటి ఒక్కో సంఘటన చూసినపుడంతా గౌరికి నవ్వొస్తోంది. వింతగా అన్పిస్తోంది.

మధ్యాహ్నం రమణమ్మ వచ్చింది మరో ఆడ మనిషితో కలిసి. తనకామె ఆడపడుచు వరసట. పేరు భాగ్యమట. నాలుగు మాటల్లోనే అతుక్కుపోయింది. పరాచికాలతో పెనవేసుకుపోయింది.

చుట్టాలింటికి వెళుతోందిట రమణమ్మ. మంచి చీర కోసం గౌరి వద్దకొచ్చింది.

సూట్ కేస్ తెరచి చీర రవిక తీసిచ్చింది.

. చీర బావుందంటూ భాగ్యం కూడా మెచ్చుకొంది.

చీరతోటి రవికను కూడా కొంగులో దాచుకోబోతోన్న రమణమ్మ కేసి వింతగా చూస్తూ "రవికెందుకూ? " అడిగింది భాగ్యం.

భాగ్యాన్ని వెర్రిదానిలా చూస్తూ "రవికె లేకండా వుత్త చీరే కట్టక పొయ్యేనా? " అంది రమణమ్మ.

గౌరి నవ్వింది.

"నీ రవికెలుంటే చూసుకో..." అంది భాగ్యం.

"ఇదేమీ? "

"ఏమో ... నీకు తెల్దా ...? నీ ఎదలు ఎప్పుడన్నా అద్దంలో సూసుకో లేదా? పిల్లోడో పిల్లో పుట్టి సంకలు వుబుకుతేనే గాని యీ రైక నిండదు... ఎదురుగానే ఉండాయి. ఆ ఎదలూ సూడూ నీ ఎదలూ సూడు. నీకంత సూపులానకుంటే దారం

తెచ్చి కొలుస్తా ... " అంది.

గౌరి మొహం నిండా సిగ్గులు దోబూచులాడాయి.

అప్రయత్నంగానే పైట సవరించుకొంది.

వెళుతూ వెళుతూ "ఎట్లా సాకినావే మరదలా ఇంత నాజూగ్గా దీన్ని?" అంటూ నడుం వంపుమీద చేయి వేసింది భాగ్యం.

ఉలికిపాటుతో చేతిని పక్కకు నెట్టింది గౌరి.

ఒక మధురమైన అనుభూతిని అంటించి వెళ్లింది ఆమె.

దాన్ని మరీ మరీ మననం చేసుకొనేందుకు ఎన్నిసార్లు అద్దం ముందు నిలబడిందో లెక్కే లేదు.

హస్త కార్తె వెనకే ఆశ్వయుజ మాసం కూడా వచ్చింది. మహాలయాలు మొదలయ్యాయి.

సొద్ద కంకులు కళ్లాల్లోకి వచ్చాయి.

ఇంటి మాదిగ వచ్చి కళ్లందోకి పేడతో అలకటం, కంకుల్ని గుండు తిప్పటం, తూరుపెత్తటం, రాత్రిపూట కావలుండటం, వాన మబ్బులు లేచిన రాత్రి ఆదరా బాదరా గింజల్ని ఇంటికెత్తుకెళ్ళటం లాంటి సమస్యలేవీ లేకుండా మిషన్లు వచ్చాయి. గంటల్లోనే కళ్లాం పని అయిపోతోంది. మాదిగ, కళ్ళం, కంకుల గుండు లాంటి కష్టమైన పదాలకు తావు లేకుండా గింజలు ఇళ్ళకు చేరుతున్నాయి.

పచ్చని చేలకు గడ్డి గంపల తాకిడి ఎక్కువైంది. పైరులో వొంగుతూ లేస్తూ యజమానురాలికి కనబడకుండా దొంగతనంగా గడ్డి కోసుకు పోవటం అధికమైంది. పచ్చని పైరులో రంగు రంగుల చీరలు చేసే ఈ దొంగతనం ఎంతో కళాత్మకంగా ఉంది. అది దొంగతనపు కళ కావొచ్చు. యజమాని వెంబడించి విసిరే తిట్ల పురాణాన్ని భరించే ఓపిక కళ కావొచ్చు.

పల్లెల్లో దసరా పండుగ ప్రభావం కన్పించలే. సాయంత్రంగా యువకులు గుంపులు గూడి టౌనుకెళ్ళి అక్కడి సినిమా థియేటర్లు పోటీ పడి తెల్లార్లూ ప్రదర్శించే సినిమాలు చూసి రావటం తప్ప.

హస్త వెళ్లే రోజుల్లో ఒక సాయంత్రం పాత గంపతో యింట్లోకి వచ్చింది లక్షమ్మ.

"ఒరే శివుడూ!" అంటూ కేకేసింది.

"ఏమ్మా? " బైట్నుంచి వచ్చాడు.

"కోడిని పొదిగెయ్యాల. చెత్త తీసుక రాపో..." చెప్పింది.

శివుడు గడ్డి వామి దిశగా వెళ్లగానే రాగుల కాగులోని గుడ్లను బైటకు తీయమంటూ కోడలికి పురమాయించింది.



తూరుపెత్తటం, రాత్రిపూట కావలుండటం, వాన మబ్బులు లేచిన రాత్రి ఆదరా బాదరా గింజల్ని ఇంటికెత్తుకెళ్ళటం లాంటి సమస్యలేవీ లేకుండా మిషన్లు వచ్చాయి



కాగుమీది కుండను దించి కాగులో చేయి బెట్టింది గౌరి. గింజల్లో దాగిఉన్న గుడ్లను వొకటొకటే యేరి చేటలో ఉంచింది వరసగా.

"ఎన్నుండాయమ్మే? "

కళ్లతోనే లెక్కేసి "పద్దెనిమిది" అని చెప్పింది.

వామిలోంచి రాగి గడ్డిని దూసుకొచ్చాడు శివుడు.

"ఏమొరే నీ తెలివి యిట్టేడ్సింది! యీ సలికాలం ఎవురన్నా రాగి చెత్తలో కోడిని పొదిగేస్తురా? ఇది సలవరపు సెత్త నాయినా! ఎండాకాలమైతే ఈ సెత్తలోనే పొదిగెయ్యాల... పోపో... ఆరికె సెత్త తీసక రాపో..." చెప్పింది.

"గొడ్డు తినే ఎందు గడ్డికి కూడా వేడి, చల్లదనపు లక్షణాలుంటాయా" అనుకొంది

గౌరి. అదే విషయాన్ని ప్రశ్నించింది.

"ఆరికె సెత్తలో అలివి గాని ఉడుకుందిమ్మే!" చెప్పింది ఆమె.

"యీ చెత్త వేసి కాలుస్చే ఏ వొస్తువైనా కరిగి పోవాల్సుందేనంట. లోగడ ఎప్పుడో రాచ్చేసులు ఇనప కోటా కంచుకోటా ఇత్తడి కోటా కట్టుకోని ఉంటే ఆ కోటల్ని కరిగించ డానికి యీశ్వరుడు ఆరికె సెత్తను కుప్పేసి కాలబెట్టిండట..." పురాణంలోకి వెళ్ళింది.

ఈ లోపు ఆరికె గడ్డితో వచ్చాడు శివుడు.

గంపలో దాన్ని వొడ్డి కుదురు జేసింది లక్షుమ్మ.

గుడ్లను గంపలో పెట్టు నాయనా! చెప్పింది.

"నువ్వే పెట్టుమా! నీ చేయి తగిలిస్తేనే గుడ్లన్నీ పిగుల్తాయిలే..."

"మొన్న సగం కూడా పిల్లల్జెయ్యలే. అన్నీ మురిగిపోయినయి. యీసారి నువ్వో... ఆయమ్మో...ఎవురోకరు పొదిగెయ్యండి..."

గౌరికేసి చూశాడు శివుడు.

"గుడ్డు తీసికో..." చెప్పాడు.

"లేదు... నువ్వే తీసి పెట్టు..."

రెండు గుడ్లు తీసి ఆమె కొకటి యిచ్చి తనొకటి పట్టుకొన్నాడు. గంపలోని కుదుట్లో ఇద్దరూ వొద్దికగా గుడ్లను ఉంచారు.

పది గుడ్ల దాకా చేటలోంచి తీసి గంపలో ఉంచింది గౌరి. మిగతావి శివుడు.

పొదిగిన కోణ్ణి తెచ్చి గుడ్ల మీద వది లారు.

గంపను కొట్టంలో ఓ మూలగా అమ ర్చారు.

ఏదో పెద్ద ఘనకార్యాన్ని పూర్తి చేసిన ట్లుగా అనుభూతిస్తోంది గౌరి. తన ప్రమేయం లేకుండానే ఎదలో దాని తాలూకు భావ ప్రకంపనలు రేగు తూనే ఉన్నాయి.

ఆ రాత్రే దేవునికి మొక్కుకొంది "స్వామీ! ఒక్క గుడ్డు కూడా మురిగి పోకుండా పిల్ల ల్జేపీ..." అని.

తన మీదున్న పెద్ద భారమేదో దేవుని భుజాల మీద పెట్టినట్లుగా భావించి మనస్సు తేలికయ్యింది.

కొత్త కోడలు మొదటిసారిగా గుడ్లను పొదిగేస్తే అవి పగిలి పిల్లలయ్యే శాతాన్ని బట్టి ఆమె హస్తవాసిని గణిస్తారనీ, ఆమె రేపు కడుపై కనబోయేతనాన్ని కూడా పోల్చుతారనీ తెలిసి కొంత ఆందోళనకు గురయ్యింది గౌరి.

గుడ్ల గంపమీద శ్రద్ధ ఎక్కువైంది. ఇంట్లో కొచ్చే పిల్లులూ, కుక్కల మీద అనుమానంగా వుంది, మూతి బెడతాయేమోనని. జంగు బిల్లి దాడిచేసి కోడిని నోట కరచుకు పోతుం దేమోననే భయంతో రాత్రిళ్లు మరో గంప మూస్తోంది.

శివుడు బావగారి పొలం పనికి వెళ్లిన పుడో, మిత్రులకు పోటీ పనికి పోయినపుడో ఆమెకు ఇంటివద్ద పొద్దుబోకుండా వుంది.

ముసలాళ్లూ పసిపిల్లలూ తప్ప ఆడాళ్లె వరూ ఇళ్లవద్ద వుండటం లేదు.

ఎన్నెన్నో కోళ్లు ఇంటిముందరా, వామి దొడ్డి వద్దా తచ్చాడుతూంటాయిగాని వాటిల్లో తమ కోళ్లేవో గౌరి ఇంకా గుర్తుపట్ట లేకపోతోంది.

ఇంట్లో ఎవ్వరూ లేరని తెలిస్తే రమణమ్మ వస్తోంది.

ఆమె మాటల్లో ఎక్కువగా అత్తగారింటిని విమర్శించటమే. మొగుణ్ణి, అతని బంధు వుల్నీ పరమ మొరటువాళ్లుగా చిత్రించటమే.

గౌరికి ఎందుకో ఆ మాటలు రుచించటం లేదు. బతుకంతా ఇక్కడే గడపవలసి కూడా ఈ పరిసరాల్నీ, మనుషుల్నీ అసహ్యించుకో వటం ఆమెకు అర్థంకాని విషయం.

రమణమ్మ వొక్కతే వస్తే అవే మాటలు.

ఆమె వస్తుందేమోనని భయం. ఆమె

# HIV ఎయిడ్స్ పేషెంట్లకు శుభవార్త



## డా॥ టి. నాగేశ్వరమ్మ

HIV & ఎయిడ్స్ స్పెషలిస్ట్

**M.B.B.S., M.D., (V.D.)**

**HIV పాజిటివ్ అనారోగ్యంతో బాధపడే రోజులు ఇప్పుడు లేవు.**

**HIV ఇన్‌ఫెక్షన్‌తో వచ్చే అన్ని వ్యాధులకు మందులు కలవు, నోటిపూత, నోటిలో పుండ్లు, చర్మవ్యాధులు - నిమ్ము, తలనొప్పి ఫిట్స్ మొ॥గు అన్ని వ్యాధులకు చికిత్స కలదు.**

SRI SRI ADS - 9949111117

***HIV - తల్లినుండి బిడ్డకు రాకుండా 100% జాగ్రత్త పడవచ్చు***

***HIV - పేషెంటు టిబితో బాధ పడకూడదు***

***HIV - పేషెంటు కంటిచూపు కోల్పోయే దశకు రాకూడదు***

**డా॥ టి. నాగేశ్వరమ్మ** M.B.B.S., M.D., (V.D.)

C/o. డా॥ రంగారావు నర్సింగ్ హోమ్, ఓల్డ్ క్లబ్ రోడ్, కొత్తపేట, గుంటూరు. సెల్ : 9849143461

మాటలు వినాల్సిన పరిస్థితి ఎదురవుతుందేమోనని భయం. ఒంటరిగా వుంటే చాలు -రమణమ్మ భయం వెంటాడుతోంది.

అప్పుడప్పుడూ భాగ్యమ్మ వచ్చిపోవటం పెద్ద వూరట. ఒక సుగంధభరితమైన గాలి తనను నిలువెల్లా తడిపి వెళ్లిన అనుభూతి.

ముసలి గోవిందమ్మ, మునెమ్మల రాక దాదాపు పూర్తిగా తగ్గినట్లే. అయితే వీధుల్లో ఎదురయినప్పుడు మాత్రం వాళ్ల కళ్లల్లో ఏదో వ్యక్తీకరించని భావం. తనకు మాత్రం ఇరుకిరుగ్గా, బెరుకు బెరుగ్గా... తన్ను గుచ్చిగుచ్చి చూస్తున్నట్లుగా, తన రహస్యాల్ని గురించి అందరికీ చెబుతున్నట్లుగా...

శివుడు తోడులేని ఒంటరితనం భరించరానిదిగా తోస్తోంది. ఎంతసేపు కూచున్నా పొద్దుబోదు. ఒక టీవీ లేదు. పేపర్ రాదు. అక్కడికీ వాకిలేసికొని బాగా నిద్రబోతుంది.



అయినా కాలం ఎంతకూ కదలకుంటేనూ...

సాయంత్రమైతే చాలు ఎవరోకరు ఆడాళ్లు వచ్చి రెక్క పుచ్చుకొని బోరింగ్ వద్దకు లాక్కుపోతారు. అప్పుడు పొద్దుబోని సమస్య లేదు. పగలే... మనిషి తోడులేని వీధులతో నిండిన పగలే...






చిత్తకార్తె వచ్చింది.

కుక్కల పీకులాటల దృశ్యాలు వీధుల్లో ఎక్కువయ్యాయి.

వాతావరణం కూడా వింతగా ఆహ్లాదంగా తయారైంది.

కొంతసేపు ఫెళ ఫెళ ఎండకాస్తోంది. అంతలోనే ఏ వైపునించో పెద్ద మేఘం వొకటి సూర్యున్ని పూర్తిగా కమ్మేస్తోంది. కొండలమీద నుంచి పొలాలకు అడ్డంగా అతివేగంగా పరుగెత్తుకొంటూ వచ్చే పెద్ద నీడ కాసేపు చల్లబరచి అంతే వేగంగా వెళ్లిపోవటం ఆహ్లాదంగా అన్పిస్తోంది. మేఘాలు నీడల్నే కాదు హఠాత్తుగా వానల్ని కూడా కురిసిపోతాయి.

ఎక్కణ్ణించో దుప్పటంత మబ్బు బరకలకడ్డంగా చినుకులు రాలుస్తూ ఎటో వెళ్లిపోతోంది. పొలాల్లో మనుషుల్ని కూడా పట్టించుకోకుండా ఏదో పనున్నట్లుగా జారుకుంటోంది. మరో మేఘం ఇంకో దిశనుంచి వాన కురుస్తూ వచ్చి అందర్నీ తడిపిపోతోంది. మనుషులంతా చెట్లకిందకు పరుగెత్తినంతసేపు పట్టదు తిరిగి రావడానికి. బట్టలు తడవటం... ఆరటం...

ఏ గుంటలో చూసినా నీళ్లుంటాయి. ఎండపొద్దున దప్పిక గొని తాగాలని దోసిలి ముంచితే చ(ఱ్ర)ుమని కాలుతుంటాయి. స్నానం చేసేంత వేడిగా వుంటాయి. నీళ్ల లోపలికి చేతులు దూర్చి కలియబెడితే చల్లని వడగళ్లలాంటి నీళ్లు పైకొస్తాయి.

ఇలాంటి విలక్షణమైన దృశ్యాల్ని, వాతావరణాన్ని సొంతం చేసుకునే చిత్తకార్తె వింతదనపు ప్రకృతి పోకడలన్నిటినీ చూపిస్తోంది.

చిత్తకార్తె చివరలో బర్రె యీనింది.

ఉదయం నించీ ముక్కుళ్లు బడుతూ తీగ వేసిన బర్రెను గొడ్లవెంట తోలకుండా ఇంటివద్దనే నిలేసింది లక్ష్మమ్మ. బర్రెను వారపాకలోనే ఉంచి ఎదురుగా మంచమే

సుకు కూచుంది.

గౌరికి ఆసక్తిగా వుంది, బర్రె యీనటం చూడాలని.

పదిగంటలకంతా బర్రెకు నొప్పులు ప్రారంభమైనట్టున్నాయి. ఒకచోట పడుకోలేకపోతోంది. నిల్చోలేకపోతోంది. అటు ఇటు తొక్కులాడుతూ వుంది. లక్షుమ్మ దాన్ని సముదాయిస్తోంది.

మరికొద్దిసేపటికి బర్రె జనన స్థానం లోంచి దూడ తల బైటబడింది నల్లగా.

పడుకొని నెమ్మదిగా యీనాల్సిన బర్రె లేచి నిల్చుంది. అటు ఇటు రెండుసార్లు తిరిగి మళ్లీ పడుకొంది. బిడ్డను ప్రసవించేందుకు ప్రయత్నించింది. సాధ్యపడకపోవటంతో లేచింది.

దాని అవస్థ చూస్తోన్న లక్షుమ్మకు కూసానికి ఆనుకొని నిల్చున్న కోడలు కన్పించింది. ఆమెకు ఏదో పని పురమాయించి అక్కణ్ణించి దూరంగా పంపింది.

ఆమె అనుమానం ఆమెకుంది.

ఎప్పుడూ ఇలాంటి ప్రసవాలు చూడని పిల్ల- ప్రసవమంటే బాధాకరమూ, భయంకరమనీ మనస్సులో ముద్రించుకొంటే ఇబ్బంది గదా! తనకూ ఒక కాన్పు అనుభవం తర్వాతైతే పర్లేదు.

కష్టపడి యీనింది బర్రె. తల తర్వాత ముందు కాళ్లతో వూడివచ్చిన దూడ శరీరమంతా ఒక్కసారిగా కసవుతో కూడిన నేల మీద జారింది.

పెయ్యదూడ పుట్టింది.

లక్షుమ్మ మనస్సు లోలోపల సంతోషం పొంగిపొర్లింది.

కోడల్ని కేకేసి పిల్చింది.

గౌరి అక్కడకు వచ్చేసరికి అంతులేని ఆపేక్షతో బిడ్డ ఒళ్లంతా నాకుతూ వుంది బర్రె. చెవులు రిక్కించి, కళ్లు పొటమరించి, తల్లి నాలుకకు వొళ్లప్పగించి పడుకొని ఉన్న దూడ ముద్దుగా అమాయికంగా వుంది.

లక్షుమ్మ దూడ లేతకాలి గిట్టల్ని గోట తుంచుతూ కోడలికి చెప్పింది- 'పెద్ద సెరవ నిండా నీళ్లు కాచ'మని.

కర్ర చేతబట్టుకొని బర్రె వద్దే కాపలా కూచింది. అది మాయ వేసేంత దాకా కని పెట్టుకొని వుండాలి.

గోడవారగా నక్కినక్కి బర్రె దగ్గరగా వెళ్లబోతున్న కుక్కల్ని కనిపెట్టి ఒక్కటి అంటిస్తోంది. ఆమెను ఏమార్చి వెళ్లినా వాటిని బర్రె వెంటాడుతోంది.

"నీళ్లు కాగినా"యంటూ గౌరి వచ్చింది.

"మసల కాగినాయా?"

"ఆ..."

"సల్లారనీలే... అంతలేకి బర్రె మాయేస్తది..." చెప్పింది.

మరికొంతసేపు కనిపెట్టుకొన్న తర్వాత మాయ ఊడిపడింది.

దాన్ని కర్రపుల్లతో ఎత్తి పాత పేడతట్టలో వేసి కళ్లాలకేసి తీసికెళ్లి ఎక్కడో పడేసి వచ్చింది ఆమె.

వేడినీళ్లతో బర్రె వళ్లంతా శుభ్రపరిచింది. దానికి అంటిన నెత్తురు, ఉమ్మనీటి మైలను కడిగేసింది.

వెల్లుల్లిపాయలు వేసి కాచిన ఆముదాన్ని బర్రె వీపుకు, ముక్కుకు పూసింది.

నేలంతా శుభ్రం చేసింది.

అప్పటికే దూడ లేచి నిల్చునేందుకు తెగ ప్రయత్నిస్తోంది.

ఈలోపు శివుడొచ్చాడు.

బర్రె ఈనిన దృశ్యాన్ని చూసి పిల్లవాడిలా గెంతులేశాడు.

"మనింటికి కొత్త చుట్టం వొచ్చింది" అంటూ గౌరికి చెప్పి ఆనందపడ్డాడు.

రెండు చేతుల్ని ఆసరా యిచ్చి దూడను నిలబెట్టి ఒకటి రెండు అడుగులు వేయనిచ్చి వదలగానే అది కిందపడుతోంది.

మరో అర్ధగంటకే దాని కాళ్లు గట్టి

చతుర 30 వసంతాలు

పడ్డాయి.

దూడను నిల్చోబెట్టి కాళ్ల సందుగా పుల్ల విసిరి ఇక నడిచేందుకు పురమాయించాడు.

తప్పటడుగులతో తల్లి వద్దకు వెళ్లి పాల కోసం వెంపర్లాడసాగింది అది.

పుట్టిన గంటసేపటికే నడక మొదలెట్టిన దూడ తల్లి పొదుగును వెదకి చన్ను నోటకరచుకొని పాలుతాగేందుకు ప్రయత్నించటం చూసి కళ్లు ఇంతింత చేసుకుని ఎక్కడలేని ఆశ్చర్యంతో తలమునకలైంది గౌరి.

ఆ దూడకు ఎలా తెలుసు? స్తనాలుండే తావును గురించీ, అందులో పాలుంటాయనే విషయం గురించీ!

సృష్టి రహస్యమంటే అదేనేమో! అనుకొంది.

దూడను తీసికెళ్లి బర్రె పొదుగులో తల దూర్చి చన్ను దాని నోటికి కరిపించి పాలు తాపాడు శివుడు. చన్ను చీకుతూవున్న దూడ చెక్కిళ్లను వేళ్లతో స్పృశిస్తూ బర్రెవద్ద కూచునివున్న అతని చెంతకొచ్చింది గౌరి.

దూడను తాకాలని తహతహగా వుందామెకు.

అతని పక్కన కూచుని దూడ మూతివద్ద ముట్టుకొంది. చెక్కిళ్ల వద్ద వేళ్లతో స్పృశించింది. చన్ను చీకుతోంటే బైటకు పొంగుకొచ్చే పాలనురుగు వేళ్లకు అంటి అదోరకమైన ఆహ్లాద భావన కలిగించింది.

నల్లగా అందంగా వున్న బర్రెదూడ ఆమెనెంతో ఆకర్షించింది.

మొదటి రెండు రోజులూ బర్రె పాలు జున్ను అయ్యాయి.

మూడవ రోజు తర్వాత పాలుకాచి వాడుకొన్నారు.

అప్పటికే ఆపోయి వున్నాడు శివుడు. చిక్కటి కాఫీ కాయించుకొని ఆబగా తాగాడు.

నీటిచుక్క చేర్చకుండా గడ్డ పెరుగు కలుపుకొని ఆనందంగా జుర్రుకొన్నాడు.

దూడతో ఆడుకొంటున్నాడు.

బర్రెను ఆప్యాయంగా స్పృశిస్తూ నోటికి గడ్డిపోచలు అందిస్తున్నాడు.

బర్రె ఈనటంతో ఇంట్లోకి కొత్త సందడి వచ్చింది. ఉదయం సాయంత్రాలు దూడ బెంగళింపులతో ఇంటిముంగిళ్లు రంగవల్లులుగా మారుతున్నాయి. దాని చిరుబురు అరుపులతో వీధి సాంతం దాసరి పాటల సంక్రాంతి వేదిక అవుతోంది.

గౌరికి కొత్త ప్రపంచం ఒకటి తోడయ్యింది. ఆప్యాయంగా పొదువు కొనేందుకూ, అల్లరిగి తిరిగేందుకూ, కబుర్లు చెప్పేందుకూ, కలసి ఆడుకొనేందుకూ ఒక మంచి నేస్తం చిక్కింది.

లేలేత గడ్డి ఆకుల్ని తెచ్చి రెండుగా చీల్చి దూడ నోటికి అందించి మెల్లగా చప్పరించేలా, చివుర్లతో నాక్కి నోట్లోకి లాక్కొని మింగేలా దగ్గరుండి మరీ నేర్పుతోంది లక్షుమ్మ.

బర్రె పొలం మీదకు వెళ్లిన పగలంతా ఒంటరిదైన దూడకు గౌరి తోడుగా వుంటోంది. దాని నోటికి అందించే ఆకుల కోసం వీధుల్లో వెళ్లే గడ్డిగంపల కేసి ఎగజూస్తోంది. ఆకుల్ని చీల్చి నోటికి అందిస్తే ఒకటి రెండు తిన్న తర్వాత దూడ మొండికేస్తోంది. ఆమె బంగపడటం, బతిమాలటం, అది ఎగిరెగిరి గెంతులేయటం, కాలికి కట్టిన తాడు విప్పితే దొరక్కుండా తప్పించుకొని వీధులన్నీ తిప్పటం, సందు సందూ గొంది గొందీ ఆమెకు పరిచయం చేయించటం, పిల్లల వద్ద కాపలా ఉన్న ముసలాళ్లకు ఆమె పరుగుల విన్యాసాల్ని కళ్లకు కట్టించటం... అల్లరి కృష్ణుని కన్నా ఎక్కువగా గొడవజేస్తోంది బుల్లిదూడ.

మాగాణి గట్టునున్న నల్లతుమ్మ చెట్టు గుమ్మటంలా పెరిగి ఒళ్లంతా బంగారం



# శ్రీ అంబా



# ఆయుర్వేద ఔషధాలయం



## కలికిరి,

## చిత్తూరు జిల్లా.



గత 80 సం॥ములుగా వంశపారం పర్యంగా వస్తున్న ఆయుర్వేద వైద్యంచే పక్షవాతము, మూర్ఛ, అలర్జీలు వంటి దీర్ఘకాలిక వ్యాధులకు వైద్యసేవలను అందించబడును. ఆంధ్రరాష్ట్రము నుండే కాక తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర వంటి పొరుగు రాష్ట్రాల నుండి వచ్చే ఎందరో రోగగ్రస్తులకు స్వస్థత చేకూర్చుతున్న ఏకైక సంస్థ శ్రీ అంబా ఆయుర్వేద ఔషధాలయం మాత్రమే.

◆ గత రెండు తరాలుగా వంశపారం పర్యంగా అందిస్తున్న ఆయుర్వేద వైద్యసేవలను మారినటువంటి నేటి కాలానుగుణంగా ఆధునిక ఆయుర్వేద వైద్యసేవలను అందించుటకు మూడవతరం వారసులుగా
డా॥ చెరుకుపల్లి మహేంద్ర & శ్రీమతి లలితరాణి గార్ల కుమారుడు మరియు
శ్రీ అంబా ఆయుర్వేద ఔషధాలయ వ్యవస్థాపకులు
కీ॥శే॥ చెరుకుపల్లి శ్రీనివాసయ్యగారి మనుమడు
డా॥ చెరుకుపల్లి మనోజ్‌కుమార్ & శ్రీమతి డా॥ ప్రతిమ గార్లు
ఈ ఔషధాలయం నందు తమసేవలు అందించనున్నారు.

◆ అత్యవసర కేసులు 24 గం॥లు చూడబడును.

◆ మాకు బ్రాంచీలుగానీ ప్రతినిధులు గాని లేరు నమ్మిమోసపోకండి.

◆ బస్సుమార్గం: తిరుపతి to మదనపల్లె రూట్‌లో కలికిరి ఆర్టీసీ బస్‌స్టాప్‌లో దిగిరావాలి.



## డా॥ చెరుకుపల్లి మహేంద్ర

08586 - 257763,

సెల్: 9440832813

ఈనాడు, మదనపల్లి. సెల్: 9848911586, 9440826663

అద్దుకొన్నట్లు పసుపుపచ్చగా అందంగా పూసింది. చెవులకు వేలాడే బుట్టకమ్మల్లా పూలు సోయగాన్ని వొలకబోస్తున్నాయి.

నేలరేగుచెట్లు పూలతో పిందెలతో కన్నుల పండువుగా వున్నాయి.

తంగేడు చెట్లు కళ్లు మిరుమిట్లు గొలిపే మేలిమి బంగారు రేకుల్లాంటి పూతలతో నేలకంతటికీ అందాన్నిస్తున్నాయి.

చింతకాయలు ఇప్పుడిప్పుడే ముదురుతు న్నాయి. పచ్చి చింతకాయలు ఉడకేసి ఎని పిన పప్పు జిహ్వాకు బహు పసందుగా ఉంటోంది.

మసూర వరి కాబట్టి అప్పుడే లాకలు కరుకెక్కాయి. బహుశా గర్భంలో ఎక్కడో చిరుపొట్ట ఏర్పడేందుకు సిద్ధమై ఉంటుంది. పచ్చదనం పసరుగక్కే వయసు పొంగుల హుందాతనంతో అలరిస్తోంది పైరు.

గట్టుమీద కూచుని వరిపైరుకేసి చూస్తోం టే ఏదో వ్యక్తీకరించలేని తృప్తి గౌరికి. పైరు పెరుగుదల చూస్తోంటే వింతగా కూడా అన్పిస్తోంది. తమ చేతివేళ్లు బురదలో దిగ జెక్కిన మొక్కలు అనలు కొనలుగా పెరు గుతూ, తను ప్రాణం పోసిన ఆ పచ్చదనం పసరు కక్కుతూ... ఈరోజు చూసిన కంట రేపు చూసేందుకు లేదు... రెండు రోజులు దూరమైతే పైరునిండా కొత్త అందాలు... కొత్త పెరుగుదలలు...

మిరప పైరు కూడా గమ్మత్తుగా పెరుగు తోంది.

చాలాకాలం కరవులతో బొగులువోయిన నేల తనివిదీరా తడిసేసరికి పైరుకు పంచ భక్ష్య పరమాన్నాలతో కూడిన ఆహారం అందిస్తోంది.

స్వాతికార్తె నడిమి దినాలలో వారం రోజులు ఎడతెరిపి లేకుండా ముసురువ ట్టింది. కోళ్లు ఇళ్లల్లో, దొడ్లపాకల్లో, గాళ్లవద్దా వుంటున్నాయి తప్ప బైటకు ముక్కుచూప టంలేదు. బర్రెలకు ఎండుగడ్డి వేసి సాకుతు న్నారు. తలుగు విప్పి పొలానికి తోలిన పాపాన పోలేదు. మొదట మూడు రోజులూ మంటికి మింటికి ఏకధారగా కుర వటంతో చెట్లమీది పక్షులు నానినాని ఆహారం లేక రాలిపడి చచ్చిపోతున్నాయి. పాత మట్టిమిద్దెలు కుమలనాని జోము దిగు తున్నాయి. ఇళ్లంతా వెలుస్తూ, నిల్చునేందు క్కూడా తావులేక, బర్రెల కొట్టాలే శరణ్యమ వుతున్నాయి. తడిసి నానిన వంటచెరకును పొయ్యిలో పెట్టి రగిలించటం ఆడాళ్లకు అసాధ్యమైంది. చూరు పీకి బోదతో రగిలిం చినా కర్రలు తగులుకోవటం లేదు- పొగ రాజుకోవటం తప్ప. కొట్టం వాసాలు పీకి వంటచెరకుగా వాడుకోవలసిన పరిస్థితి వచ్చింది.



**తను ప్రాణం పోసిన ఆ పచ్చదనం పసరు కక్కుతూ... ఈరోజు చూసిన కంట రేపు చూసేందుకు లేదు... రెండు రోజులు దూరమైతే పైరునిండా కొత్త అందాలు... కొత్త పెరుగుదలలు...**

మగాళ్లు మాత్రం ప్లాస్టిక్ పేపరు గూడో, గొడుగో కప్పుకొని చెరువుదాకా వెళ్లి వస్తు న్నారు. మాగాణి కయ్యల గెట్లు తెగాయేమో నని పరిశీలిస్తున్నారు. చెరువు కట్ట గండ్లు పడుతుందేమోనని ఆందోళన చెందుతు న్నారు.

అలుగు హోరు గ్రామంలోకి విన్పిస్తోంది.

ఈ నేపథ్యంలోనే ఒకనాటి రాత్రి కాగుల చాటున్నించి పీచు పీచుమనే శబ్దాలూ, పొదిగిన కోడి "కొక్... కిక్.." మనే సము దాయింపులూ లీలగా విన్పించాయి.

ముసలామె గొడ్లపాకలో మంచమేసుకు పడుకొంది కాబట్టి విషయం తెలీలేదు గాని శివునికి అర్థమైంది కోడి- పిల్లల్ని లేపిందని.

ఉదయాన వంకకు వెళ్లి తిరిగొచ్చిన తర్వాత గంప వద్దకు నడిచాడు.

రెక్కలు పొంగించి 'కుర్'మంటూ తన వ్యతిరేకతను వ్యక్తపరుస్తోన్న కోడి వీపుమీది బొచ్చు పట్టుకొని పైకి లేపి చూశాడు.

కుదురునిండా పిల్లలున్నాయి.

పగిలిన పెంకుల్ని ఏరి పక్కన పడేసి పరిశీలించి చూస్తే ఇంకో నాలుగు గుడ్లు పిగలాల్సి వున్నాయి.

బుల్లి కోడిపిల్లలు అమాయకంగా ముద్దుగా కన్పించాయి- శివుని వెనకనించే తొంగి చూస్తోన్న గౌరికి.

మిగిలిన గుడ్లను వేళ్లతో పట్టుకొని వూపి చెవివద్ద ఆనించుకొని శ్రద్ధగా విన్నాడు. గుడ్లు మురిగిపోలేదు. లోపల్నించి సన్నగా కోడిపిల్ల అరుపు...

గౌరి చెవివద్ద కూడా ఆ సవ్వడి విన్పింపజేశాడు.

ఆమె అబ్బుర పడింది.

కోడిని తిరిగి యథాస్థానంలో వుంచాడు.

దాదాపు గుడ్లన్నీ పగిలి పిల్లలు కాబోతున్నందుకు గౌరిని అభినందించాడు. ఆమె హస్తవాసిని పొగిడాడు.

గౌరికి ఆనందంగా...మహదానందంగా ఉంది.

తనది అదృష్ట హస్తంగా నిరూపించి చూపించిన కోడిమీద అంతులేని ఆప్యాయత పెల్లుబికింది.

అప్పటికే ఊళ్లో కొత్త కోడళ్ల గురించి చాలా కథలు వినివుంది. కోడలు యింట అడుగుపెట్టినప్పటి నుండి జరిగే సంఘటనల మంచి చెడ్డలన్నీ ఆమెకే ఆపాదించే ఒక సంప్రదాయమున్న యీ పల్లెల్లో చాలా

చతుర 30 వసంతాలు

మంది కొత్త కోడళ్లకు చెడు అనుభవాలే ఎదురయ్యాయి. కోటవీధి లోని ఓ ఇంట్లో పురుగు ముట్టి బర్రె చనిపోతే అది ఆ యింటి కొత్త కోడలు పాదం మోపిన వేళావిశేషమంటూ తీర్మానించారు. మరో ఇంట మనిషికి గాయమైతే, ఇంకో ఇంట పందుల మంద వచ్చి పైరంతా తొక్కితే, వేరేయింట అత్తకు తీరని జ్వరమొస్తే... అంతా కోడళ్ల మహాత్మ్యమే... దాన్ని సమర్థించుకునేందుకు 'గొడ్డొచ్చినవేళ బిడ్డొచ్చినవేళ' అంటూ సామెత కూడా.

తన అత్తా బావలు అట్లా అనుకోకపోయినా ఇరుగు పొరుగులు మర్యాదగా ఉండనీరు గదా!

అయితే అందరూ తనది అదృష్ట పాదమనే అంటున్నారు. తను అడుగుపెట్టిన రోజే నాలుగేళ్ల దప్పిక తీరేలా వాన కురియటం, చెరువులు నిండటం, వరినారు కుదరటం, నాట్లు తెగుల్లేకుండా పచ్చబడి అందమైన పైరు కావటం, మిరప కూడా ఏ ఒడిదుడుకులు లేకుండా మొలచి ఇప్పుడు పూతకు రావటం, బర్రె పెయ్యదూడను ఈనటం, కోడిగుడ్లన్నీ పిల్లలు కావటం... అన్నీ మంచే జరుగుతున్నాయి.

దీన్ని తను నిలుపుకోగలగాలి.

ఆలోచిస్తూ వుంటే ఆమెకు ఎన్నో అనుమానాలు.. వరిని తెగుళ్లు ఆసిస్తే...? పందుల మంద దాడి చేసి తొక్కిపడేస్తే... బర్రెదూడ మట్టి మాశానం తిని రోగమొచ్చిపోతే... కోడిపిల్లల్ని కాకులు గద్దలు తన్నుకుపోతే... ప్రస్తుతానికి తన పాదానికి ఉన్న అదృష్టాన్ని కాస్తా తారుమారు చేయగలగిన సమస్యలు ఇవే...

ఆలోచిస్తూ వుండిపోయింది ఆమె.

## 8

"బాగ్గెమ్మ తల్లీ! బంగారు కూతురా! నీకు గంపెడు గడ్డి కోసిస్సా. నా కోడల్ని నీతోడు తీసుప్పోయి బర్రె దూడకు పిడికెడు గడ్డి పెరక్కపోయేట్టు జెయ్యి తల్లీ! చిన్నక్కా! నా ముద్దుల కోడలా! నీ సేనంతా తప్పకం పెడ్తా... నా కోడలి సేత ఒక్క కయ్య కలుపు దీయించమ్మా! బిడ్డా! సుభద్రా! చీకట్లో లేసొచ్చి మీ బరుగొడ్ల కొట్టంలో పేడా కసుపు ఎత్తేస్సా. నా కోడల్ని కాసేపు బరుగొడ్ల పొదుగు కాడ కూకునేట్టు సూడమ్మా!

అన్నా! రంగనా! నీకు తోడబుట్టిందాన్ననుకో. మా నాకొడుక్కు రోంత బుద్ధొచ్చేట్టు సూడన్నా! పెండ్లాన్ని కనిపెట్టుకునుంటే పొలం పనులు జరగవన్నా! వాన్ని ఎగతాలి చేసి బుద్ధి జెప్పన్నా...! సుబ్బన్నా! సిన్నప్పుడు నువ్వు కోడిగ మాడినావని నా కొడుకు ఏడుస్సా యింటికొస్తే కడుపుతీపితో నీతో కొట్లాడినా. అన్నా! ఇప్పుడు రొండు సేతులెత్తి దండం బెడ్తాండ. అన్నగారంతా పూనుకొని వాన్ని కోడిగమాడండి... ఎగతాలి జెయ్యండి... అదునులో రవ్వంత ఏమారితే కడుపుగాలి సస్తారని సెప్పండి...

పైరమ్మా! నీ పరువమంతా యాడబాయెనే? మూడిత్తులు నెత్తిన బడనిచ్చినావు గాని మూడు రేత్రల్ల నిద్రకు సరిపోయ్యేంత పగటి తీరికెనిచ్చినావా నాకు? పగలంతా నన్ను నీ బంటును జేసుకొన్నెవు గదే! నీ తొత్తును జేసుకొని ఆడించినవు గదే! పురుగు ముట్టి మొగుడు జచ్చినా కడుపారా ఏడవనిచ్చినావా? నీకు వూడిగము జేసేందుకు పిల్చుకొన్నెవు గదే! ఏ సుగమూ ఎరగకున్నే అన్ని సుగాలూ నీకాడనే దొరుకుతాయని సెప్పి నన్ను మరగేసుకొన్నెవు గదే! నీకంటే సొగసైందీ, నీకంటే సుగమిచ్చేదీ ఏదీ లేదని నన్ను నమ్మేట్టు చేస్చివి గదే! ఇప్పుడేమైందే నా తల్లీ? నాయాల్నే నువ్వూ ముసిల్దానివైనావా? నాకాన్నించి నా కొడుకును ఎంత

సులకనగా ఎత్తకపోయిందో సూసొనివా నాకోడలు పిల్ల! నీకంటే తనే అందగత్తెనని డప్పేసి సాటింది సూడు. యిదేం యిసి త్రమే తల్లీ? కొత్తగా వొచ్చిందాన్ని నువ్వు మరగేసుకోవాల్సిందిబోయి నీ సేతి కింది బిడ్డను గూడా దాని కొంగులో జారిడి స్చివి... వాళ్లను నీకాడికి రప్పించుకో మాయమ్మా! నీకు వయసుడగలేదనీ, ముస లితనం రాదనీ చాటుకోయే పైరమ్మా!

సాధయ్యా! నా కొడుకు సన్నాసా? సంసారా అయ్యా? సంసారయితే- తోడొచ్చిన పెండ్లాన్ని తనకు తోడు జేసుకొంటాడు. గెట్ల మీదా గెనాల మీదా జారిపడ కుండా ఒకరికొకరు ఎట్లా తోడుండాలో నేర్పుకొంటాడు. వానొస్చే గడ్డిమోపు కింద ఎట్లా తలదాచుకోవాలో, ఎండొస్చే తంగేడు చెట్టు నీడనయినా ఎట్లా వొదుక్కోవాలో నేర్పుకొంటాడు గాని ఇంట్లో సల్లగా కూకునేది సెప్పడు. పెండ్లానికి పైరు మీదా, పొలంమీదా, గొడ్డూ గోదా, కోడికొక్కెరల మీద మర్లు పుట్టించనోడు సన్నాసిగాక సంసారి ఎట్లవుతాడు సోమీ? "

* * *

వానల్లోనే వచ్చి వెళ్లిన దీపావళి పండుగ పిల్లల్లో పెద్దగా ప్రభావాన్ని చూపలేకపోయింది. అక్కడొకటి యిక్కడొకటి 'టప్.. ఢం..తుస్...బుర్ర్...' మంటూ కాలీకాలని టపాకుల మోతలు బలహీనంగా విన్పించాయి.

గొడుగు పట్టుకుని మరీ అంగడికెళ్లి, కాకర పువ్వొత్తులు తెచ్చి వాకిలి ముందు పందిరి కింద పెళ్లాం చేత కాల్పించి, చిన్న పిల్లాడిలా కేరింతలు కొట్టే కొడుకును చూసి బుగ్గలు నొక్కుకొంది లక్ష్మమ్మ.

కార్తీక మాసం వచ్చింది.

ఈ ఏడాది వానలు కురిసి నేలంతా బాగా చల్లబడి వుండటం వలన చలి మొదలైంది. వేరుసెనగ కళ్లాల వద్దా, చేలవద్దా కాపలా వున్న వాళ్లు తెల్లారు జామున చలిమంటలు రగిలిస్తున్నారు. పీకి కట్టలుగా పేర్చిన పత్తి కట్టె దండిగా వుండటం వలన పెద్ద మంటలే వేస్తున్నారు.

ఉదయం పూట కోడలి కాఫీకి కొద్ది పాలుంచి మిగిలినవి కేంద్రానికి పోస్తోంది లక్ష్మమ్మ. సాయంత్రం పాలు వాళ్ల ఇంటిల్లిపాది తినసూ తాగనూ సరిపోగా రెండు మూడిళ్ల వాళ్లకు తిరిపెం మజ్జిగ కూడా పోస్తోంది.

దూడ బాగా మచ్చికయ్యింది గౌరికి.

మంచం మీద కూచున్నప్పుడు గరుకు నాలుకతో అది చల్లగా కాళ్లు నాకుతోంటే అదో కొత్త అనుభూతి.

మధ్యాహ్నం భాగ్యమ్మ మరో ఇద్దరు ఆడాళ్లతో కలిసి వచ్చింది.

ఆ సమయానికి గొడ్లపాకలో మంచమ్మీద కూచుని వుంది గౌరి. బర్రెదూడ ఆమె చేతి వేళ్లను నాకుతూ వుంది.

ఆ దృశ్యాన్ని చూడగానే చిన్నగా నవ్వింది భాగ్యమ్మ.

"అంత వొళ్లు బరువు పనికిరాదు మరదలా!" అంది గౌరికేసి చూస్తూ.

ఆమెకు అర్థం కాలేదు.

"బోరింగ్ కాడికి పోయి బిందెడు నీళ్లు తెచ్చుకొనేందుగ్గూడా సోమరితనమైతే ఎట్లా? " అంది.

మరింత అయోమయంగా చూసింది గౌరి.

"సంగటి తిని చెయ్యి కడుక్కోను కూడా నీల్లులేక దూడచేత నాకించుకుంటుండావు గదూ!" పెదాలమీద నవ్వు కదలాడుతోం డగా అంది.

ఫక్కున నవ్వారు మిగిలినవాళ్లు.

భాగ్యం నవ్వును అదేపనిగా చూడబుద్దవు

తుంది గౌరికి. ఆహ్లాదంగా స్పందిస్తుంది.

"నీల్లు లేక కాదులే. చేతి సంగటి పూరకెందుకు పోవాలనీ... దూడచేత నాకిస్తాందిలే మాయక్క" ఓ పడుచు అంది.

"వేల్లు నాకిస్తేనే దూడ కడుపు నిండుద్దే? ఆకో అలుమో నోటికి అందించాలగాని..." తులసి అంది.

"ఎప్పుడూ అత్త దెచ్చిన గడ్డి తినిపించ డమే కాదు. నువ్వూ గడ్డి కోసక రావాల. ఏ కులపు గడ్డి అయితే బాగా తింటుందో తెలు సుకోవాల. ఎతుకులాడి తెచ్చుకోవాల..." చెప్పింది నారాయణమ్మ.

నిజమే. తను రోజూ దూడకు గడ్డి తిని పిస్తోందిగాని- దాని పేరేమో తెలీదు.

"ఎమ్మిద్దెలాకయితే ఎంత నేదరి దూడ యినా కొరుకుద్ది. బెల్లపచ్చులాకు బెల్లమట్లా తింటాది. గోర్లగొండి, చిప్పర, చిగురింత గడ్డి అయితే పెద్దగా వొడిబడకుండా నాజూగ్గా తింటా. పేర్లయినా విన్నెవా? మాపటేల మా తోడురా- చూసి కోసుకొద్దూగాని..." భాగ్యం చెప్పింది.

సాయంత్రం వాళ్ల వెనక వెళ్లక తప్పలేదు గౌరికి.

"ఒట్టి నడకకే నడుం అంతగా వొంపులు తిరుగుతాంది. గడ్డిమోపు నెత్తికెత్తుతే అస్సు లు నిలుస్తాదా అనేది నా అనుమానం..."

వెనకనించి భాగ్యం వ్యాఖ్యానించింది.

ఓరగంట భాగ్యంకేసి చూసింది గౌరి.

పరాచికాలాడుకొంటూ చేల దగ్గరకు వెళ్లారు.

తాము చెప్పిన గడ్డి ఆకులన్నిట్నీ చూపిం చారు వాళ్లు.

వాటి పేర్లను ఒకటకి పదిసార్లు మననం చేసికొన్నా గుర్తుండటం లేదు.

గడ్డి పెరుక్కొనేటప్పుడు ఏవేవో కోడిగాలు. కందిచాళ్ల మధ్యన అలసంద తీగల పొద మాటున ఆడమగ పొర్లాడిన గుర్తులు కన్పించి, ఆ చేను గలిగిన కొత్త కోడలి మీద పరాచికాల విసుర్లు "ఇరుకింట్లో మంది మధ్యన కక్కుర్తిపడలేక యిక్కడ పడకజేసు కొన్నెట్టుంది గదూ నువ్వూ నీ మొగుడూ!" అంటూ ఏడిపించడం.

"మ్మేయ్ తులసీ! ఆ వచ్చేది నీ మొగుడే గదూ! మీ కందిచేను దిక్కుపోతాండు. నీకో సమేనేమో! బెన్నే పోయే!" అంటూ తులసి మీద కోడిగపు విసుర్లు.

తల నిక్కబెట్టి చూసిన తులసి కళ్లల్లో ఏదో వ్యక్తీకరించని భావం.

కందిచెట్లు నిండుగా పూశాయి. చెట్టు చివర్లనిండా బంగారు రంగేసినట్లుంది. కంది చెట్ల సందుల్లో నేలమీద పాకిన అల సంద తీగలు కూడా పూశాయి. అటు ఆకా శానికి బంగారు రంగు. ఇటు నేలమీదా పూలపానుపు.

అలసంద ఆకుల్ని నలిపి అరచేతిలో రసం పిండి దానిమీద సున్నపు పొడి రా లిపి, అది ఆరబోయేలోపలే గోట తీసి నుదుట దోసగింజ బొట్టు పెట్టుకొంటు న్నారు ఆడాళ్లంతా.

నుదుటిమీద ఆకుపచ్చని రంగుతో రేడి యంలా తళతళ మెరుస్తూ వింత సోయ గాన్ని ఇస్తోంది ఆ బొట్టు.

దూడ గడ్డిని దుసార తీగలతో చిన్నమో పుగా కట్టిచ్చారు వాళ్లు. కాలేజి అమ్మాయిలు పుస్తకాల్ని ఆన్చుకొన్నట్లు గడ్డికట్టను ఎదలకు ఆనించుకొని వాళ్లవెంట నెమ్మదిగా ఇంటికి కదలింది గౌరి.

తులసి చేలవద్దే ఆగిపోయిన విషయం అందరికీ అర్థమవుతోన్నా ఎవ్వరూ దాన్ని గురించి ప్రస్తావించలేదు.

తను కష్టపడి పీకి, కట్టగట్టి, మోసుకొచ్చిన ఆకుల్ని దూడ నమలుతూ ఉంటే గౌరికి అంతులేని ఆనందంగా వుంది.

తర్వాతి రోజునించి ఉదయమే గడ్డి

చతుర 30 వసంతాలు

గంపల వెంట వెళుతోంది. దూడ గడ్డి సేకరించుకుతెస్తోంది. దూడ పుణ్యాన గడ్డి రకాల్ని కూడా గుర్తించగలుగుతోంది. సమవయస్కుల వెంట గడ్డికి వెళ్లటం ఆహ్లాదంగా ఉంది ఆమెకు.

ఒక శనివారం పోలేరమ్మకు సల్లబువ్వ పోసి మొక్కుబడి తీర్చుకుంది లక్షమ్మ. పెరుగు కలిపిన అన్నం మెతుకులకు ఉల్లిపాయ ముక్కలు చేర్చి చప్పగా పిల్లల దోసిళ్లలో పోస్తూవుంటే- పోలేరమ్మ ప్రసాదమైన మజ్జిగ, అన్నం మెతుకులు తినటం ఒక అపురూపమైన సన్నివేశంగా మారి జీవిత పర్యంతం గుర్తుండిపోయే స్మృతికిరణమైంది పిల్లల మెదళ్లలో.

ఈ మధ్యకాలంలో కోళ్లు బాగా మచ్చికయ్యాయి గౌరికి. వాటికి సజ్జలో, సద్దన్నమో వేయటం వల్లా, ఆప్యాయంగా స్పర్శించటం వల్లా దగ్గరయ్యాయి. దోసిలితో గింజెలు తీసికెళ్లి చల్లేలోపలే ఎగిరి ముక్కులతో పొడుస్తున్నాయి. పిడికిలి మూసి బైటకు నడిస్తేచాలు దగ్గరున్న పిల్లల కోడి చూస్తుంది. రెక్కలు టపటపలాడిస్తూ ఆమె కేసి పరుగెత్తుకొస్తుంది. ఆ శబ్దానికి చుట్టుపట్ల దిబ్బల్లో గూళ్లల్లో ఉన్న తమ కోళ్లన్నీ ఆగమేఘాల మీద రెక్కలాడిస్తూ వచ్చి ఆమె కాళ్లను చుట్టుకుంటాయి. ముందుకు సాగనివ్వవు. కాళ్లసందున సుడివడతాయి. వేప చెట్టు కింద బండ మీద కూచుని కొన్ని గింజలు నేల మీద చల్లి కొన్నింటిని చేతిలో వుంచుకుంటుంది. కిందపడ్డ గింజల్ని తినే కోళ్లు తింటోండగా పిల్లలు కొన్ని మాత్రం ఆమె మీద దాడిచేస్తాయి. చేతిలో గింజల్ని రాలగొడతాయి. కాలివేళ్ల సందున రాలిన గింజల్ని పొడుస్తాయి. వాటి ముక్కులకు అందకుండా చేతిని మరింత పైకెత్తితే ఎగిరి పొడుస్తాయి. అప్పటికీ అందకుంటే భుజాల పైకెక్కి అందుకునేందుకు ప్రయత్నిస్తాయి. గమ్మత్తయిన ఆ అనుభవం కోసమే వాటితో రోజూ అదే రీతిలో ఆడుకుంటోంది గౌరి.

వారపాకలో కూచుని మాట్లాడుతున్నప్పుడు బుల్లి కోడిపిల్లల్ని చూపిస్తూ "అవిగో నీ పిల్లలు" అంటూ శివుడు అనటంతో గుండెల్లో సన్నని జలదరింపు కలుగుతుంది ఆమెకు. ఏదో అనిర్వచనీయమైన అనుభూతి ఎదలో టకటక పొడిచినట్లయి శరీరమంతా పరవశిస్తుంది. తను పొదిగేస్తే పగిలిన గుడ్లే గదా అవి! తన చేతుల్లోంచి జీవం పోసుకున్నవే గదా! అనే భావం. ఆ పిల్లల మీద ఏవో మర్లు... ఆప్యాయత... ఆపేక్ష...

విశాఖ కార్తె వెళ్లదలకు వరి బిర్రుపొట్ట మీదకొచ్చింది. ఈ కార్తెలో వానలు కురవలేదుగాని ఆకాశంలో మేఘాలు కన్పించినపుడంతా పొలంలోకి వెళ్లే యువకుల్ని హెచ్చరిస్తున్నారు ముసలాళ్లు- "ఒరే నాయినా! సినుకులకు తడిసేరు. విశాఖిలో తడిస్తే విషపు రోగాలొస్తాయంట..." అని

పక్కన మరో ముసలాయన ఎత్తుకొంన్నాడు- "ఆ... వానేడ వస్తాదిలే... కర్ణునితో భారతం సరి... కార్తీకంతో వానలు సరి అన్నెరు పెద్దోలు" అంటూ.

బర్రె ఇంట్లో అడుగు పెడుతూనే దూడకు తెచ్చిన పిడికెడు గడ్డి పరకల్నీ ఒక్కసారిగా నోటబెట్టుకొంటోంది. పచ్చిగడ్డి కోసం కట్టు కొయ్యకాడా, గంపల్లోనూ వెంపర్లాడుతోంది.

ఓపూట దాని అవస్థల్ని జాగ్రత్తగా గమనించిన గౌరికి గుండెల్లో తడి అయ్యింది. పచ్చిగడ్డి కోసం దాని ఆరాటం చూసి మనస్సంతా అదోలా అయ్యింది. రెండ్రోజులకొకసారి శివమ్మ దగ్గరతెచ్చే బోడగంపెడు గడ్డి బర్రె ఆకలినీ ఆరాటాన్నీ మరింత ఎక్కువ చేస్తోంది.

ఆలోచనల్లో పడింది.

తెల్లారేసరికే భాగ్యమ్మ, తులసి సహా నలుగురు యువతులు గంపలు రొండిన

పెట్టుకుని వచ్చారు.

"యాడకమ్మే ఇట్టా స్తుండారూ? " లక్షుమ్మ అడిగింది.

"గడ్డికి రావా పెద్దమా? "

"నేనా? మీతోడా? "

"నిన్నొస్తానంటివే..."

"బాగుంది సంబడం... మీ ఎనకొస్తానంటినా? కాలికింద బడితే పలుగురాల్లు కూడా పగిలిపోయే పరువంలో ఉండారు. మీకూ నాకేం తోడే? " అంది. అంతలో గౌరి బైట కొచ్చింది- శుభ్రంగా తలదువ్వి, బొట్టుబెట్టి, మూలనున్న గంప చేతికి తీసుకొంటూ అడిగింది

"అత్తా! కొడేలి ఎక్కడ? " అంటూ.

వింతగా చూసింది లక్షుమ్మ.

సమాధానం చెప్పేందుక్కూడా నోరు పెగల్లేదు ఆమెకు.

"కొడేలంట పెద్దమ్మా! పలుగురాళ్లు పగలదొక్కే పిల్లే అడుగుతోంది. లేచి కొడేలంటయీ..." భాగ్యం అంది.

లక్షుమ్మ లేవబోయేలోపలే వెదకి తీసుకొంది గౌరి.

కండువా వొకటి భుజానేసికొని, గంప చంకలో పెట్టుకొని వాళ్లవెంట కదిలిపోయింది.

తన కళ్లను తను నమ్మలేకపోతోంది లక్షుమ్మ.

నోట్లో వేపపుల్ల ఆడిస్తూ వచ్చి ఇంట్లోకెళ్లి, దొడ్లోకి నడిచి, నోరు కడుక్కొని, టవాల్ తో ముఖం తుడుచుకొంటూ బైటకొచ్చి, గౌరి ఇంట్లోలేని విషయం అప్పుడర్థమై, వారపాక కేసి వామికేసి చూసి "మా...ఆయమ్మి యేదీ? " అని శివుడు ప్రశ్నించేదాకా ఆమె యీ లోకంలోకి రాలేదు.

వచ్చిన తర్వాత కూడా గౌరి విషయాన్ని చెప్పలేకపోయింది.

"బైటికి పోయింది గాని... పొయ్యి మీద కాపీ నీల్లుండాల సూడూ..." అంది.



"తనొస్తాదిలే..." గొణుక్కొంటూ వారపాకకేసి నడవబోయాడు.

"ఇప్పుడిప్పుడే రాదు..." చెప్పింది.

"ఏమీ? "

విషయం అతని చెవినేసింది.

ఇంట్లోకి కూడా వెళ్లలేదు అతను.

చెప్పుల్లో కాళ్లు దూర్చి పొలాలకేసి మళ్లాడు.

వరిమళ్లు మిరపచేలూ చుడుతూ పొలాల మీద అలా విహంగవీక్షణం చేశాడు. కంది చాళ్ల వెంట రంగురంగు చీరల కదలికల కోసం వెదికాడు. మిరపచేలల్లో పరిశీలించాడు.

అతనికి ఆత్రుతగా వుంది-

అందరి ఆడాళ్లతోటి తనూ గడ్డి పీకాలనే ప్రయత్నంలో చేతులు వొరుసుకుపోయి, బొబ్బలెక్కి అల్లాడుతుందేమోననీ, గడ్డి కోసినా గంపను మోసే అలవాటు లేని మెడలు ఎక్కడ మెలిబడతాయేమోననీ- ఆందోళనగా

ఉంది.

కంది చేనివద్ద పెద్ద మల్లారెడ్డి కని పిస్తే అడిగాడు "సిన్నాయనా! గడ్డి గంపలోల్లేమన్నా మన సేలపక్క కొచ్చి్రనా? " అని.

"ఏమబ్బే వాల్లతో పని? "

"ఆహా... ఏంలేదు...




గుంపులు గుంపులొచ్చి సేలల్లోపడితే మన గొడ్ల కేమేసుకోవాల? "

"మీ యింట్లో గడ్డిదెచ్చేదెవ్వు్రా? "

"ఏం... నా పెండ్లాం లేదా!"

"అబ్బో! గడ్డి దెచ్చే పెండ్లామే... మానా యినే... ఇంట్లో వుండే పిల్లేనా? ఇంగోక దాన్నేమైనా తెచ్చుకొన్నావా? "

"గడ్డోల్ల సంగతి జెప్పు చిన్నాయినా!"

"నేనీడుండగనే మన సేలల్లేకి వస్నా్రరా... అదుగో... వంకవతల వుండారు సూడు..."

ఒక్క నిమిషం కూడా అక్కడ నిలబడ లేదు శివుడు.

వంక అవతల కందిచేలో వంగి వంగి గడ్డికోస్తూ ఉన్న ఆడవాళ్లకేసి నడిచాడు. కందిచేను గట్టు మీద నిల్చుని ఒకటికి నాలు గుసార్లు పరిశీలించాడు గాని గౌరి లేదు.

అసలది భాగ్యం గుంపు కాదు. వెనుదిరిగాడు.

"ఆ గుంపు ఒక్కటేనా వొచ్చింది? " మల్లారెడ్డిని అడిగాడు. నొసలు ముడేశాడు ఆయ న. "నీకెవ్వరు కావాల్రా? " ప్రశ్నించాడు.

"నా పెండ్లామొచ్చిందిలే..." అరచినట్లుగా అన్నాడు.

"ఓరి ఎర్రి నాకొడకా!" అంటూ నవ్వాడు ఆయన. "అదో... ఆ పక్కన్నే బెల్లగోడి చేల ల్లో యింకో గుంపుంది పో..." చెప్పాడు.

ఆయన సూచించినట్టే కందిచేలల్లో కన్పిం చారు వాళ్లు. శివుడు కళ్లబడగానే అందరి తలలూ గౌరికేసి తిరిగాయి.

"మేమనుకొంటానే వుండాము- 'ఇంగా రాలేదేమబ్బా!' అని. ఆ... వొచ్చిండమ్మా!" నారాయణమ్మ అంది.

"ఇంకపో... గంపనే కాదు నిన్ను కూడా మోసప్పోతాడు పో..." తులసి అంది.

"యాడికి పొయ్యేది? " భాగ్యం అందు కొంది వెంటనే. "మొగుడు కనబన్నె ఆడ దల్లా ఎగమల్లుకొనిపోయ్యే సంబడమైతే గుంపుగట్టి ఎందుకు రావాల? ఎప్పుడంటే అప్పుడు గుంపులోంచి పొయ్యేదానికి లేదు. తోడొచ్చినోల్లు తోడుగానే ఇండ్లకు పోవాలి. ఎవురూ జారిపొయ్యేదానికి లే... ఈరోజు నుంచి ఇది రూలు..." చెప్పింది. "తోడొచ్చిం దంతా మొగుండ్ల ఎనకబడిపోతాంటే నా యట్లాంటికి ఎవ్వురెనకబోవాల? నా మొగుడు నలుగురు ఆడోల్లున్న కాడికి వొచ్చే టోడు గాదే! అనటంతో కందిచెట్లన్నీ బంగారు రంగుతో విరగబడి నవ్వాయి.

"నాయనా శివన్నా! నీ పెండ్లాము వొడిబ డలేదుపో తమ్ముడా! ఇదో చూసుకో... ఎట్ల తెచ్చినామో అట్లనే వుంది చూడూ..." అంటూ గౌరిని రెక్కబట్టుకు లాగి చూపిం చింది. "ఇదో... ఈ అరచేతులు చూడు- కందిపోలేదు. బొబ్బలెక్కలేదు. చెంపలు చూడు- కందికొమ్మలు రాచుకొని ఎర్రచా రలు పడలేదు. ఇదో... యీ నడుం వంపు చూడూ- అలసంద తీగెలు సుట్టుకొని పైతోలు పెరుక్కురాలేదు. చూసినావా? కండ్లారా చూసి... ఇంక పో..." అందరి నవ్వుల మధ్య మొహమాటం లేకుండా చెప్పింది.

'రవ్వంత గడ్డి పీకిచ్చి పోతాలే భాగ్గెక్కా!' అంటూ మిరపచేని గట్టుమీద వొంగాడు అతను.

వాళ్లు వద్దంటున్నా వినుకోలేదు.

మొండికేసి మరీ వొదెడు గడ్డి పీకాడు.

ఆడవాళ్ల పోరు పడలేక గడ్డిని అక్కడే వదిలేసి చేలకు అడ్డంగా వెళ్లిపోయాడు.

ఎండ కరుకెక్కేసరికి పీకిన గడ్డిని గంపల్లో దుర్చారు. వంకజేడెల్లో దాచివుం చిన గడ్డికుప్పల వద్దకెళ్లి గంపలనిండా తొక్కి పెట్టుకున్నారు. గంప అంచులవెంట అందంగా పూసివున్న సెనగపూల గడ్డినో, కవ్వాల గడ్డినో చుంగులు వేలాడేలా పేర్చి చెక్కారు. పైటను కొద్దిపాటి చుట్టగా చుట్టి గంపల్ని తలకెత్తుకొన్నారు. గౌరికి మాత్రం కండువాను బలంగా చుట్టి తల మీద అమర్చి గంప ఎత్తి పెట్టింది భాగ్యమ్మ.

గడ్డిగంప పెద్దగా బరువులేదనిపించింది గౌరికి.

మోయగలననే అనుకొంది.

చేని మేర వెళ్లేసరికి మోయటంలోని నిజా లేమిటో ఆమెకు తెలిసివచ్చాయి. తలకెత్తిన గంప కాస్తా గుండుజొల్ల అయ్యింది. పచ్చి గడ్డి కాస్తా రాళ్ల దిబ్బగా మారింది. తల లోని నరాలన్నీ ఉబ్బి మెడపైకి సాగి వచ్చి నట్లుగా, అవి క్షణంలోనో అరక్షణంలోనో పేలేందుకు సిద్ధమైనట్లుగా భావన కలిగింది. వెన్నెముక వేదన వర్ణనాతీతంగా ఉంది. వెన్నుపూసలు ఒకదానిపైన మరొకటి ఆని బరువు భరించలేక నడుమువద్ద గొలుసు తెగిపోతుందేమోనన్నంత పీడనగా ఉంది.

# ది తాడిపత్రి కో - ఆపరేటివ్ టౌన్ బ్యాంకు లిమిటెడ్., డి.నెం.455



తాడిపత్రి - 515411 ఫోన్: 08558 - 222315, 223430

## ప్రజలకు శుభవార్త

మహాశయులారా!

తాడిపత్రి కో॥ఆపరేటివ్ టౌన్ బ్యాంకు లి. తాడిపత్రి పాలకవర్గం వారు ప్రజల కొరకు బ్యాంకు మహోజ్వల అభివృద్ధిలో ఉన్నందున కానుకగా పాలకవర్గం వారు డిపాజిట్ల రేట్లు పెంచడమైనది. కావున బ్యాంకు డిపాజిట్టుదారులు మరియు మెంబర్లు ఈ అవకాశమును సద్వినియోగం చేసుకోవలసినదిగా కోరడమైనది.

### ఫిక్సడ్ డిపాజిట్లపై వడ్డీ రేట్లు వివరములు

| | | సీనియర్ సిటిజన్స్ |
|---|---|---|
| 15 రోజుల నుండి 29 రోజుల వరకు | 3.5% | 4% |
| 30 రోజుల నుండి 45 రోజుల వరకు | 4.5% | 5% |
| 46 రోజుల నుండి 90 రోజుల వరకు | 5.5% | 6% |
| 91 రోజుల నుండి 180 రోజుల వరకు | 6.5% | 7% |
| 181 రోజుల నుండి 1 సం॥ వరకు | 7.5% | 8.5% |
| 1 సం॥ము పైబడి 2 సం॥ల లోపు | 8.5% | 9% |
| 2 సం॥ల పైబడి 3 సం॥ల లోపు | 9% | 9.5% |
| 3 సం॥ల పైబడి | 9.5% | 10% |

**గమనిక: సౌభాగ్యలక్ష్మి ఫిక్సడ్‌డిపాజిట్ నందు 7.5 సం॥ల కాలపరిమితికి డబ్బు రెట్టింపు అగును**

★ రూ. 5,000/- 7.5 సం॥లకు రూ. 10,111/- ★ రూ. 30,000/- 7.5 సం॥లకు రూ. 60,666/-
★ రూ. 10,000/- 7.5 సం॥లకు రూ. 20,222/- ★ రూ. 50,000/- 7.5 సం॥లకు రూ. 1,01,110/-
★ రూ. 25,000/- 7.5 సం॥లకు రూ. 50,555/-

1) ప్రతి డిపాజిట్ దారునికి 1లక్ష రూపాయల వరకు ఆర్. బి. ఐ. వారిచే డిపాజిట్ ఇన్సూరెన్స్ సౌకర్యం కలదు.
2) సీనియర్ సిటిజన్ అనగా 60 సం॥లు దాటిన వారికి అన్ని డిపాజిట్లపైకి 1/2 శాతం వడ్డీ అధికంగా ఇవ్వబడును.
3) బంగారు ఆభరణములపై కేవలం 1 రూపాయి వడ్డీతోనే రూ. 2,00,000/-లు వరకు అప్పు ఇవ్వబడును.
4) ఇంటి ఆయకములపై కేవలం 14% వడ్డీతోనే రూ. 2,00,000/- వరకు అప్పు ఇచ్చుచున్నాము.



శ్రీ దద్దం సుబ్బరాయుడు, B.Sc., B.L.,
ప్రెసిడెంటు సెల్: 9848038161

**రికరింగ్ డిపాజిట్ కట్టువారికి 39 నెలలు ఈ క్రింది మొత్తము రూ.కట్టినచో 9% ప్రకారం వడ్డీ ఇవ్వబడును**

నెలకు రూ. 300/-లు ప్రకారం 39 నెలలకు కట్టిన రూ. 13,618/-
నెలకు రూ. 500/-లు ప్రకారం 39 నెలలకు కట్టిన రూ. 22,697/-
నెలకు రూ. 1,000/-లు ప్రకారం 39 నెలలకు కట్టిన రూ. 45,394/-
నెలకు రూ. 2,000/-లు ప్రకారం 39 నెలలకు కట్టిన రూ. 90,788/-

శ్రీ డి.శ్రీనివాసరావు, B.Sc., DCB.,
కార్యదర్శి ఫోన్ నెం: 223430

part II Agent/Tadpatri:9848843350

మరో పదడుగులు నడిచేసరికి అందరికన్నా వెనకబడింది. కాళ్ళు ఎగిసి రావటం కూడా కష్టమైంది. గంపను కిందకు విసరేస్తే తప్ప యీ శారీరక బాధ నుంచి తప్పించుకోవటం సాధ్యం కాదన్న నిర్ణయానికి వచ్చేంతలో- తన తలమీది గంపను ఎవరో అలవోకగా ఎత్తినట్లనిపించి అటుకేసి చూడబోయింది గాని మెడ తిరగలేదు. శరీరమంతా తిప్పి చూసేసరికి గంపను తలకెత్తుకుని దారి విడిచి కందిచేలకు అడ్డంగా వెళుతున్న శివుణ్ణి చూసి ఊపిరి పీల్చుకొంది.

భాగ్యమ్మ చూస్తే అడ్డగించుకొంటుందని కాబోలు వాళ్ళకు అందకుండా దూరంగా సాగిపోతున్నాడు.

అతని పోకడ ఆడవాళ్ల కళ్లబడనే పడింది.

వెనక్కి తిరిగి చూస్తే గౌరి నెత్తిన గంప లేదు.

"మొగునికిచ్చి పంపినావా?" తులసి అంది.

"నెత్తిన బరువు దిగితే సాలనుకొని వుంటది. గడ్డిగంప తీసుకున్నోడు ఆమెకు దేవుడే. గొడ్డొచ్చి నోట బీకినా కిందేసిండేది. మొగుడెత్తకపోయింది తెలిసుంటదా?" భాగ్యం అంది- వెనుదిరిగి గౌరికేసీ, ఉబ్బిన ఆమె మెడ నరాలకేసీ, చెమటలు పట్టిన ఆమె మొహంకేసీ, చిరుచెమటలతో నిగనిగలాడే నడుం వంపులకేసీ చూపుల్తో గుచ్చుతూ.

శివున్ని నిలబడమంటూ పిల్చారు ఆడాళ్లు.

గంప ఇచ్చి పొమ్మంటూ కేకలేశారు.

వాళ్ల అరుపులు వడిసెల రాళ్లలా తగిలి-బెదరి రివ్వురివ్వున ఎగిరిపోయే రామచిలుకలా సాగిపోతున్నాడు శివుడు.

అతను వెళ్ళే తీరు వాళ్ళను మరింత కేకలేసి నవ్వుకొనేలా చేసింది.

ఏదో వస్తువును దొంగతనం చేసి పారిపోతోన్నవాడిలా అతను బిరబిర నడవటం అందరికీ గిలిగింతలు రేపుతోంది.

తను కోసుకొచ్చిన గడ్డిని దూడ నోటికి అందిస్తోంటే వ్యక్తీకరించలేని తృప్తి గౌరికి.

సాయంత్రం బర్రెముందు గడ్డి గంపను బోర్లించినప్పుడు అది ఆబగా గబ్బిళ్లు గబ్బిళ్లు నమలి మింగుతోంటే అనిర్వచనీయమైన పులకరింత.

మర్నాటి ఉదయమే పాల సెరవతో వచ్చిన అత్త "కడుపునిండా పచ్చిగడ్డి తినేసరికి సోలెడు పాలెక్కువ ఇచ్చింది" అంటూ పాలకేంద్రానికి వెళుతోంటే మరేదో ఆనందం. తను కోసుకొచ్చిన పచ్చిగడ్డి పాలగా రూపాంతరం చెందటం వింతయిన భావన.

కార్తీకమాసంలో ఒక్క సోమవారమయినా నల్లమల కొండల్లోని బెలుం గుహకు వెళ్ళాలనుకొన్నాడు శివుడు. గౌరితో కలిసి బెలుం చెన్రాయునికి దండాలు పెట్టి రావాలనుకొన్నాడు. అయితే పెళ్ళయిన తొలి ఏడాది కొండలెక్కకూడదని తల్లి అభ్యంతర పెట్టటంతో చాలించుకొన్నాడు.

భాగ్యం గుంపుతో కలిసి రోజూ పొద్దుటి పూట గడ్డికి వెళుతోంది గౌరి. గడ్డి కోయటంలో, దాన్ని మోయటంలో శివుని సహకారం దండిగానే అందుతోంది.

అందర్నీ ఏమార్చి గడ్డిగంపను తను అందిపుచ్చుకొనేందుకు ఎన్నెన్నో అగచాట్లు పడుతున్నాడు శివుడు. గడ్డికోసి గౌరికి అందించేందుకు మరింత ఇబ్బందులు ఎదుర్కొంటున్నాడు.

తనను దగ్గరకు రానీయటం లేదు ఆడవాళ్లు. వెళ్ళినా గడ్డి కోయనీయటం లేదు. కోసినా దాన్ని గౌరికి అందించనీయటం లేదు. అయినా తన వ్యూహాలు తను పన్నుతున్నాడు.

వాళ్లు ఎటు వెళ్లింది కనుక్కొని ఇరుగుపొరుగు చేలల్లోనే బోడగంపెడు గడ్డిపీకి కుప్పవేసి దానిమీద ఏదొక గుర్తు వుంచి పోతాడు. ఒకరోజు నానుబాలు గడ్డి పనల్ని ఉంచుతాడు. మరోరోజు గరికను పైన పరుస్తాడు. ఇంకోరోజు కందికొమ్మ విరిచి వేస్తాడు. ఈ సంకేతాలన్నీ ఇంటి వద్దే నిర్ణయించుకొంటారు. ఎవరో ఆడాళ్లు కుప్ప వేసుకుపోయారని దాని జోలికి ఎవ్వరూ పోరు. సంకేతం చూడగానే దాన్ని గంపలో చేర్చుకొంటుంది గౌరి.

శివుని గడ్డిగంప ప్రహసనం ఊర్లో అందరికీ తెలిసిపోయింది. ఉదయం పూట చేల మీద అతన్ని చూస్తే చాలు అందరూ ఎగతాళి చేయటమే. అతను అడగకముందే "నీ పెండ్లాం అదో...ఆ చేల దిక్కు పోయింది పో..." అంటూ చెబుతున్నారు. కొంత మంది అతన్ని ఆటపట్టించేందుకు తప్పుడు సమాచారం ఇచ్చి నవ్వుకొంటున్నారు.

అతన్ని ఏమార్చి ఒక్కరోజయినా గౌరిచేత గడ్డిగంప ఇంటిదాకా మోయించాలని భాగ్యం పట్టుదల. అందుకే కొత్త కొత్త దారులు వెదుకుతూ శివణ్ణి ఇబ్బందుల పాలుజేస్తోంది.

ఆరోజు మొట్టమొదటే శకునాల వీరయ్య శివుణ్ణి తప్పుదారి పట్టించాడు. గడ్డోల్లు తూరుపు చేలల్లోకి పోతే అతను పడమటి దిశకేసి చేయి చూపించాడు. పది చేలకవతల దుగ్గయ్య కన్పించి ఆయనా అదే చూపు చూపాడు. చెరువు దగ్గరగా తోటాకు రామయ్య కూడా పడమటికేసే చేయి చాచాడు. చెరువు దాటి బరకల్లోని కందిచేలన్నీ తిరిగి వచ్చాడు శివుడు. వాళ్లెక్కడా కన్పించలేదు. సమయం గడిచిపోతూ వుంది. చేలల్లో వాళ్లు తన్ను మోసం చేశారనే విషయం అర్థమవుతోంది.

ప్రతిరోజూ తన సహాయానికి అలవాటు పడిన గౌరి ఈరోజు ఎలా గంప నింపుకొంటోందో అర్థం కావటం లేదు. ఏవైపునుందో తెలీదు. ఎంత దూరాన వుందో మరి! ఎన్ని అవస్థలు పడుతోందో? తన తోటివారి మధ్య అవమానాల పాలవుతోందేమో! ఒకసారి మనస్సు నొచ్చుకొంటే తర్వాత ఇబ్బంది. ఎటు చూసినా కందిచేలు. ఏ చేలో వుందని వెదకాలి? కాలికొద్దీ నడుస్తున్నాడు. చేల మధ్య గెట్లెంట పరుగులు తీస్తున్నాడు. మరోసారి చేలన్నీ చుట్టాడు. అతన్ని చూసి చేలల్లో వాళ్ళు నవ్వుకొంటున్నారు. అతనితో ఆడుకోడానికి మంచి ఆటే దొరికింది. బొమ్మను చేసి ఆడుకోవచ్చు

గడ్డోళ్లు ఇంటికి బైల్దేరే సమయమైంది.

శివునికి ఆత్రుత పెరిగింది.

మిరప చేలో కన్పించిన సుబ్బమ్మ దగ్గరికి వెళ్ళాడు.

రెండు చేతులెత్తి దండం పెట్టాడు.

"వొదినా! మీ సెల్లెలు ఏ పక్కనుంది?" అడిగాడు దీనంగా.

చాలా సేపట్నుంచి అతని అవస్థల్ని గమనిస్తూనే వుంది ఆమె. "ఎందుకట్టా కిందుమీదులవుతావబ్బే? మా సెల్లెలు నిన్నిడ్సిపెట్టి పోదులే..." అంది గుంభనంగా నవ్వుతూ.

"నెత్తి మంటబుడ్తాంది. మెదలిరిగిపోతండాయి. నడుములు నిలబల్లేదు వొదినో... యాడుండేది సెప్పు, మీ యమ్మకు దండం బెడ్తా!"

పకపక నవ్వింది ఆమె.

"గడ్డిమోపులంటావు గడ్డి గంపలంటావు.
నాణ్యామైన గడ్డికాడ నా సెల్లెలుందిరో...
ముద్దూల మరిదీ... నా సెల్లెలుందిరో...
ఆకుజప్పర గడ్డి సీమజప్పర గడ్డి
నాణ్యామైన గడ్డి నానబాలగడ్డి
కొండ గోగడి గడ్డి సెనిగెపూలా గడ్డి
కవ్వాల గడ్డికీ రవ్వాల గొలుసురో... నా
సిన్నమరిదీ... నా సెల్లెలుందిరో..."

ఆలస్యాన్ని భరించలేకపోయాడు అతను.

"గంప బరువుకు తట్టుకోలేకుండా నిట్టని లువునా కూలబడేట్టుందా... రాతగొట్టినట్టు ఒక్కమాటతో సెప్పు వొదినా! కందిసేని సాటున నీ కాళ్లు బట్టుకుంటా..."

ఒళ్లు ఝల్లుమంది ఆమెకు.

పెదాలు అదురుతోండగా తూర్పు దిశగా చేయి చాచింది.

"మున్నీటి కుంట పక్కన బాడవల్లో వుండారు పో..." అంటూ తల నేలకు దించింది.

ఒక్క పరుగున బాడవల దాకా వెళ్లాడు

అప్పటికే గడ్డి గంపలు నెత్తికెత్తుకొని వర సగా వస్తున్నారు ఆడాళ్లంతా.

కుంట కట్టమీంచి పరిశీలనగా చూశాడు.

బెల్లగోడిలా మూడు సార్లు అరిచాడు.

ఆ సంకేతం గౌరిని ఉత్సాహ పరిచింది.

మరో రెండు నిమిషా ల్లోనే గంప శివుని తలకెక్కింది.

* * *

మధ్యాహ్నం బిందె చేతబట్టుకొని బోరింగ్ వద్ద కెళుతోంటే చెన్నారెడ్డి పిల్చాడు, "ఒరే శివుడూ!" అంటూ.

"మామా!" వినయాన్ని వొలకబోస్తూ పలి కాడు. దగ్గరగా వెళ్ళి "ఏం మామా?" అన్నాడు.

పంచలో మంచమ్మీద కూచుని వున్నాడు చెన్నారెడ్డి. అతనికి అటుఇటుగా మరో ఇద్దరు మనుషులున్నారు.

"ఏమిరే కనబడ్డమే లేదు..." అడిగాడు.

"ఏం లేదు మామా!" తల గీరుకొన్నాడు శివుడు.

"ఎప్పుడూ యీధుల్లో, చేలమ్మటీ తిరిగే మాకే కనబడ్డం లేదు. వీధి మొగం సూడ నోనివి, ఊర్లో ఉండనోనిని నీకేం కనపన్చా డన్నా!" ఎదుట మనిషి అన్నాడు.

"ఏమీ?"

"పెండామొచ్చిన్లే..."



చెన్నారెడ్డి పెదాల మీద చిరునవ్వులు కది లాయి.

"ఏమన్నా సదూకొన్నెదేమిరా?"

"ఆ..." మెల్లిగా తలెత్తాడు. "ఇంటరు సది వింది" సిగ్గు పడ్డాడు.

"అదృష్టవంతునివిరా! నీ దశ తిరిగి నట్టే..."

అర్థం కాలేదు శివునికి.

"మనూరికి అంగన్‌వాడి సెంటరు ఖాయ మైంది. సదూకున్నె కోడలు లేక ఇన్రోజులూ శాంక్షన్ కావడం... ఎనక్కి పోవడం... నువ్వొక మంచి పన్జేసినావు మనూరి ఆడ



**గంప బరువుకు తట్టుకోలేకుండా నిట్టనిలువునా కూలబడేట్టుందా... రాతగొట్టినట్టు ఒక్కమాటతో సెప్పు వొదినా! కందిసేని సాటున నీ కాళ్లు బట్టుకుంటా...**



పిల్లోల్లకు సదువు లేకున్నా సదూకున్నె అమ్మాయిని వూర్లోకి తెచ్చినావు..."

"ఆ పిల్ల ఎన్రోజులుంటదిలే బావా! ఉగా దికంతా మనోన్ని టౌనుకు తన్నక పోయే ట్టుంది" దుగ్గయ్య అన్నాడు.

"అంగడి ఉండెంట గదా! అదే మంచి పనిలే..." అన్నాడు చెన్నారెడ్డి.

"సెంటరు నిలబడితే మల్ల ఏదొక తంటాలు పడొచ్చు..."

శివుడు వెళ్లింతర్వాత దాన్ని గురించే కొంతసేపు మంతనాలు. గౌరి పేరుతో పోస్ట్ శాంక్షన్ చేయించటం, కొంత కాలం తర్వాత దాన్ని మరొకరికి బదలాయించటం, విద్యార్హతలు ఉన్న అమ్మాయి రాకున్నా గౌరి పేరు మీదే బినామీగా కొనసాగించటం... అందరూ అనుకొంటోన్నట్లు ఉగాదికి ఆమె వూరు వదిలితే సరి, వదలకున్నా ఆమెకు అంగన్‌వాడి పోస్ట్ మాత్రం ఉంచేది లేదు.



ప్రస్తుతానికి ఆమెను పావుగా వాడుకోవటమే.

రెండో బిందెకు వచ్చింతర్వాత శివునితో చెప్పాడు చెన్నారెడ్డి, "సదూకొన్నె పిల్ల అక్ష రాల ముగం సూడకుండా జేస్చే పాపంరా. పేపరన్నా తీసప్పోయి ఇస్తాండు" అని.

మరింక ఆలస్యం చేయలేదు శివుడు.

మంచమ్మీది పేపరంతా మడిచి చంకలో పెట్టుకొన్నాడు. పేపరు మొగం చూడగానే గౌరికి కూడా ఆనందం కలిగింది.

ఆ మధ్యాహ్నం కొంత మంది ఆడవాళ్లు ఆమె వద్ద పోగయ్యారు. పేపరులో వార్తల్ని విన్నారు. కడప టౌన్లోని సినిమా థియేటర్ల గురించీ, వాటిలో ప్రదర్శించే సినిమాల గురించీ ఆసక్తిగా తెలుసుకొన్నారు. కొంద రైతే అక్షరజ్ఞానం లేకున్నా టీవీల్లో రోజూ చూసే సీరియళ్లను పేపరులో పోల్చుకొ న్నారు 'నాగాస్త్రం, కల్పన, ఆలుబాలు' అంటూ.

అంగన్‌వాడి సెంటర్ గురించీ, అందులో ఉపాధ్యాయినిగా పని చేయటం గురించీ ఆలోచించింది గౌరి. స్త్రీ శిశు సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో నడిచే శిశు సంరక్షణా కేంద్రాల గురించి ఆమెకు కొంత అవగాహన ఉంది. ఐదు సంవత్సరాల లోపు పిల్లలకు పోషకా హారం అందించటం, ఆటలుపాటలు, కథల ద్వారా పిల్లల్ని పాఠశాలకు వెళ్లేందుకు ఆయ త్తపరచటం అంగన్‌వాడి కార్యకర్తల పని. సృజనాత్మకతతో కూడిన వ్యవహారం అది. చిన్న పిల్లలతో ఆడుకోవటం, పాడుకోవటం, వాళ్ల వచ్చీరాని మాటలతో సంభాషించటం అదే ఉద్యోగంగా, వృత్తిగా దొరకటం అంద రికీ అందివచ్చే అదృష్టం కాదు గదా!

ఆలోచించసాగింది. ఆమె.

శివుని ఆలోచనలు ఇంకో విధంగా సాగు తున్నాయి.

'ప్రభుత్వ ఉద్యోగమంటూ ఒకదానిలో ఇరుక్కొన్న తర్వాత ఆమె వేర్లు, యీ మట్టిలో పాతుకొని నిలబడినట్టే గదా' అని.

'నెలకు వెయ్యి నుంచి పండ్రెండు వందల దాకా నికర ఆదాయం రావటం, ఉప్పో పప్పో నెలకింత మిగలటం సామాన్యమైన ఆర్థిక లబ్ధి కాదు గదా! దేవుడా యీ వొక్క సాయం జెయ్యి' లక్షుమ్మ అనుకొంది.

ప్రతి చిన్న విషయమూ రాజకీయమవు తోన్న యీ రోజుల్లో అంగన్‌వాడి ఉద్యోగం గౌరికి రావటం అంత సులభమేమీ కాదను కొన్నారు గ్రామంలో వాళ్లు.

"ఏం పంతులమ్మా!" అంటూ వచ్చింది భాగ్యం ఉదయమే. "అందరూ అనుకొంటాం డరు నీకు చిన్న పిల్లోలకు సదువు జెప్పే ఉద్యోగం వస్తాందంటనే" అని.

నవ్వింది గౌరి.

గంప చంకనేసుకొని ఆమె వెంట నడి చింది.

గమిలి దాటేసరికి గుంపు తోడయ్యారు.

ఎండకు మంచు కరుగుతూ వుంది. పైరు ఆకుల మీంచి తెల్లని పొగలా పైకి లేచిపోతోంది.

"ఈ రోజు నీ మొగున్ని ఏమార్చాల..." చెప్పింది భాగ్యం. "అందుకే యాడికి పొయ్యేది చెప్పను. ఎట్లా తిరిగొచ్చేది చెప్పను. నా ఎనక రావాల్సిందే..."

గౌరి నవ్వింది.

"ఏం మొగుడమ్మా వాడు! పెండ్లాం మెడల్ను గడ్డిగంప వొంచుద్దా? పెండ్లాం నడుమును కొడేలి ఎత్తకపోద్దా? మొగానికి పూసిన పొదరును కంది రెమ్మలు గిల్లుకుం టాయోమోగాని అరికాల్లను గెనేలు పట్టక పోతాయా? అరచేతల్ను గడ్డి గుంజక పోత దా? అలసంద తీగెల్లో చిక్కొంటే మన మంతా వుండాం గదమ్మా! నువ్వన్నా చెబుతే యేం మరదలా..." గౌరికేసి చూస్తూ అంది.

"నీ తమ్ముడు గదా! నువ్వే చెప్పు..." గౌరి

అంది.

"నువ్వు మహా గడుసు దానివి"

వాళ్ల పరాచికాలు వినేవాళ్లకు ఇంపుగా వున్నాయి.

"ఇయ్యాల నీ సేత ఇంటిదాకా గడ్డి మోయిస్తా. మెడలు గట్టిబడాల నడుం రాటుదేలాల... ఏం మనిసో వాడు. గట్టిప డనిచ్చేట్టులేదు... సేతికి మెత్తగానే తగుల్తాం డాలేమో! యాన్నించి వస్తాడో... కంది సెట్ల సాటున్నుంచో, వంక జేడెల్లోంచో, పొదల్లోంచో... గద్దొచ్చి కోడిపిల్లను ఎత్తకపో యినట్లే... అయినా నాకు తెలియక అడు గుతా... నీ గంప ఎనకే వాడొచ్చె... గంప గడ్డి కోసె.... గంపమోసె... ఇంగ నువ్వెం దుకూ గడ్డికి రావడం? వాడే వొస్తే పోలా?" అంది.

తమ పొలిమేరలు దాటించి పొరుగూరి చేలల్లోకి దారి తీసింది భాగ్యం. అది ఆమె అమ్మగారి ఊరు కావటం వలన అంత స్వతంత్రంగా వెళ్లగలిగింది.

గంపనిండా గడ్డి పెరుక్కొన్న తర్వాత దారి మార్చి తూర్పు వంకలోకి దించింది.

గౌరి మెడలు కొంతవరకు బరువును ఓర్చుకోలుగుతున్నాయి. అప్పటికే శివుడు తమ పొలాలన్నీ నాలుగు సార్లు చుట్టాడు. కంది చాళ్లన్నీ వొంగివొంగి పరిశీలించాడు. జొన్న చేలల్లో వెదికాడు.

ఎక్కడా భాగ్యమ్మ బృందం కన్పించలేదు. ఎవ్వరూ సమాచారం అందివ్వలేక పోయారు.

"వదినా! ఓ వొదినా!!" సుబ్బమ్మ దగ్గరికె ళ్లాడు.

మిరపచేను గట్టుమీంచి అతనికేసి ఎగా దిగా చూసింది. విసురుగా తలతిప్పి మరో వైపు తిరిగి నిల్చుంది.

"మీ సెల్లెలు యాడుందో సెప్పొదినా!" దీనంగా అడిగాడు.

ఆమె తలకూడా తిప్పి చూడలేదు.

"వదినెకు ఒకసరి
బిందెకు బిగుసరి
బంగరు జడకుచ్చుల
మా వదినె..." అంటూ

పాట అందుకొన్నాడు.

అతనికేసి విసురుగా తల తిప్పింది ఆమె.

"కందిసేని సాటున నీసేత కాల్లుబట్టించు కొనే యోగం లేదు పోరా!" అంది అతని కళ్లల్లోకి చూస్తూ.

ఉలిక్కిపడ్డాడు శివుడు.

మొన్న తను ఆ మాట అన్నట్టు గుర్తు. పొరబాటున నోరుజారింది. అందులోని శ్లేషార్థం ఇప్పుడు మొహంకేసి కొట్టినట్లు అర్థ మవుతోంది.

గిరుక్కున వెనుదిరిగాడు.

గుండెలు పదరుతోండగా చేలకడ్డంగా నడవసాగాడు. వంకలోంచి వెళ్లే కాలిదారి వద్ద కందిచేలో కూచుని ఇంకా చల్లబడని ఎద అలజడిని మెల్లిగా సవరించుకొంటూ ఉండిపోయాడు.

భాగ్యం గుంపంతా వంక జేడెల్లో వంగి వంగి నడుస్తోంది. శివుని కళ్లబడకూడదనే పట్టుదలతో కదలుతోంది.

ఇంకో చేనిమేర నడుస్తే చాలు బండ్లబాట వస్తుంది. బాట ఎక్కితే శివుడేమీ చేయ లేడు.

"ఈ పూట వాన్ని ఏమార్చేది ఖాయం.." చెప్పింది భాగ్యమ్మ. "ఎన్నిరోజులు బట్టి వాన్ని ఓడించడానికి...! ఈ రోజుటికి నా సేతిలో ఓడిపోయే రాతొచ్చింది వానికి ... మనం తల్చుకొంటే వాడెంత?"

తలెత్తి భాగ్యమ్మకేసి అదో రకంగా చూసింది గౌరి.

వంకలోతుల్లోనే కొంత దూరం నడిచారు వాళ్లు.

ఉన్నట్టుండి గౌరి చిన్నగా అరిచింది "గంప ఎత్తక పాయె" అంటూ.

ఉలికిపాటుగా తలతిప్పి చూసింది భాగ్యం. గౌరి నెత్తిన గంపలేదు.

గట్టునున్న కందిచేలో రెమ్మల కదలికలు.

ఉస్సూరుమంటూ నిట్టూర్చింది.

బాట ఎక్కాల్సిన అవసరం కూడా లేకుండాపోయింది.

కందిచేల గెట్లెంట దారి తీసింది.

ఆమెకు నిరాశగా వుంది- శివున్ని ఏమార్చలేకపోయినందుకు.

ఆమెకు విచారంగా వుంది- ఇంతసేపూ పడిన కష్టమంతా వంకజేడెల్లో కలిసిపోయినందుకు.

ఎవరూ మాట్లాడుకోవటంలేదు- పెదాలు బిగబట్టి నడవటం తప్ప.

**ఉన్నట్టుండి భాగ్యం కళ్ళబడ్డాడు- కందిచేలో వొంగి వొంగి అడుగులేస్తూ వస్తోన్న మనిషొకడు. అతను శివుడని తెలిసేసరికి ఆమె ఆశ్చర్యపోయింది**



ఎవరూ దిక్కులు చూడటంలేదు- నడుం వంపులమీద చిరుచెమటలు పట్టేలా వేగంగా నడవడం తప్ప.

రెండు చేల దూరం వెళ్లింతర్వాతగాని సర్దుబాటు కాలేకపోయింది భాగ్యం. తన్ను తాను సవరించుకొని యథాప్రకారంగా చెతుర్లకు దిగింది.

ఉన్నట్టుండి భాగ్యం కళ్ళబడ్డాడు- కందిచేలో వొంగి వొంగి అడుగులేస్తూ వస్తోన్న మనిషొకడు. అతను శివునిగా తెలిసి వచ్చేసరికి ఆమె ఆశ్చర్యపోయింది.

గంప ఎత్తుకెళ్లాడు గదా! ఏదీ?

అయినా మళ్లీ ఎందుకొస్తోన్నట్లు?

ఓరగంట అతణ్ణి గమనించసాగింది.

కందిచెట్లల్లోంచి గౌరి వద్దకు వచ్చి తేలాడు శివుడు.

ఏదో ప్రశ్నిస్తున్నాడు. ఆమె మరేదో సమాధానం చెబుతోంది... వేలెత్తి వంక జేడెలకేసి చూపిస్తోంది.

వంకకేసి పరుగెత్తినట్లుగా కదలి అదృశ్యమయ్యాడు శివుడు.

భాగ్యానికి ఏమీ అర్థం కాలేదు.

మనస్సు నిండా జిగురులాంటి అయోమయం.

కొంతసేపటికి అదే శివుడు మళ్లీ కన్పించాడు.

ఇప్పుడతని తలమీద గడ్డిగంప వుంది.

ఇంటికేసి వేగంగా అడుగులేస్తున్నాడు.

వింతగా వుంది ఆమెకు.

గౌరి గంపను పోగొట్టుకొన్నప్పుడే ఎదురవ్వాల్సిన దృశ్యం ఇది. ఇంత ఆలస్యంగా కన్పించిందంటే...

ఖాళీ మనిషి వంకకేసి వెళ్లి గడ్డి గంపతో తిరిగొచ్చాడంటే... ఆమెకు అర్థమవుతూ వుంది సంగతేమిటో.

అంటే... గౌరి తమను ఏమార్చింది. తమకు తెలీకుండా గడ్డిగంప వంక జేడెల్లో వుంచి నాటకమాడింది. ఆ విషయాన్ని శివునికి చెప్పి గంప తెప్పించింది.

ఈ రహస్యాన్ని తనతోటి ఆడవాళ్లకెవరికీ చెప్పలేదు భాగ్యం.

మధ్యాహ్నం పేపరు చూసే సమయంలో గౌరిని అడిగింది సంగతి ఏమిటంటూ.

నిజం చెప్పేసింది గౌరి.

శివుణ్ణి ఓడిస్తామంటూ పంతాలు పలకటంవల్ల తనాపని చేయవలసి వచ్చిందట. బావను ఓడించటం ఇష్టం లేక, అదీ తన కారణంగా ఓడిపోవటం అసలే వూహించలేక అట్లా చేసిందట.

పరాయి ఆడవాళ్ల చేతిలో బావ ఓడిపోవటం తను చూడలేదట.

"అంటే... నీ చేతిలో మాత్రమే ఓడిపో

రాష్ట్రస్థాయిలో రాష్ట్ర ప్రభుత్వంచే వరుసగా 3 సార్లు
బెస్ట్ స్కూలు అవార్డు పొందిన ఏకైక విద్యాసంస్థ




వేలివెన్ను
తణుకు, ప॥గో॥జిల్లా
(రెసిడెన్షియల్)
☎ (08819) 283513-516










ప్రణాళికాబద్ధ మైన శిక్షణతో
అంకితభావంగల అధ్యాపకుల
నిరంతరకృషితో అత్యుత్తమ
ఫలితాల దిశగా పయనిస్తున్న
మా అనుబంధ విద్యాసంస్థలు

**వేలివెన్ను:** ★ శశి ఇంగ్లీష్ మీడియం స్కూల్ ★ శశి ఇంగ్లీష్ మీడియం హైస్కూల్ ★ శశి జూనియర్ కాలేజ్ ★ శశి మహిళా జూనియర్ కాలేజ్ ★ శశి డిగ్రీ కళాశాల

**తణుకు:** ★ శశి ఇంగ్లీష్ మీడియం స్కూల్ ★ నారాయణ జూనియర్ కాలేజ్, ఫోన్: 08819 241798, 799.

**తాడేపల్లిగూడెం:** ★ శశి ఇంగ్లీష్ మీడియం స్కూల్ ★ శశి జూనియర్ కాలేజ్ ★ శశి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ & ఇంజనీరింగ్, ఫోన్: 08818-244986, 987.

**దువ్వ:** ★ శశి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఫోన్: 08819 - 285244.

**నల్లజర్ల:** ★ శశి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఫోన్: 08818 - 277355.

Sri Sai Balaji Ads, NDD, Cell: 93469 44045

వాళ్ళా మావోడు? ”
భాగ్యం అంది.

తలొంచుకొని చిన్నగా నవ్వుతూ “ఆలుమగల మధ్య గెలుపోటములు ఏముంటాయి వొదినా? ” అంది.

గౌరికేసి తదేకంగా చూస్తూండిపోయింది భాగ్యం.

సాయంత్రం శివుణ్ణి దగ్గరకు పిల్చుకొని “అబ్బీ!” అంది. “అందరూ అనుకుంటాంటే నేను గూడా నిజమేనేమోనని నమ్మినా తమ్ముడా! సదూకున్నె పిల్ల నాగరీకంగా పెరిగిన ఈపిల్ల యీ మొరటు కొంపలో వుంటదే అనుకున్నే. అదెగిరిపోతా నిన్ను కాల్లతో తన్నుకపోతాదనే అనుకున్నే. నువ్వ గిలగిల కొట్టుకొనిపోడానికి మనసొల్లక యీడిగిలడితే నిన్నీడనే వొదిలేసి అదొక్కతైనా ఎగిరిపోతాదెనుకున్నే.. కానీ... తమ్ముడా! గడ్డిగంపల సావాసం కాన్నుంచి ఆ పిల్లంటే ఎవురో తెలిసిపోయింది. నిన్ను కోరుకొని వొచ్చిందో, వొచ్చినాక కోరుకొన్నెదో తెల్దుగాని నిన్నిడిచిపోదురా నాయినా! ఆ గ్యారంటీ నేనిస్తా. ఎవురెట్లన్నా మాట్లాడనీ. ఇట్లనే చూసుకో... నీ చూపుల్లో తేడా రానీయకు...” చెప్పింది.

ఆ మాటలకు పరవశించిపోయాడు శివుడు. అవి పదే పదే చెవుల్లో మోగుతూనే వుండిపోయాయి. మనుషుల మధ్య కూడా అతణ్ణి అంతర్ముఖుణ్ణి చేసి తనలో తను నవ్వుకొనేలా చేశాయి. పగలు రాత్రిళ్లు వెంటాడాయి. గొడ్లపాకలో ఎల్లకిలా పడుకొని పులకరింతలు మోసులెత్తిన కనుగుడ్లతో, గుండెల జలదరింపులు పూసిన పెదవులతో లోకాన్ని మరిపిస్తూ వెర్రివాణ్ణి చేశాయి.

మార్గశిర మాసం వచ్చింది.

అప్పటికే అనూరాధ కార్తె సగం గడిచి వుంది.

వరి సుంకుమీద వుంది. అక్కడక్కడా పాలగింజలు పట్టివున్నాయి. సన్నటి పిచ్చుకలు గింజలు పొడిచి పాలు చప్పరిస్తూండటంతో వెలివెన్ను పడుతోంది.

చలి ముదురుతూ వుంది. తెల్లారు జామున వీధి కూడళ్లలో చలిమంటలు ఎగుస్తున్నాయి. దుప్పట్లు కప్పుకొని వచ్చి చలిమంటల ముందు కూచున్న ముసలాళ్ల బీడీ పొగలతో, లోకాభిరామాయణాలతో వీధులు నిద్ర మేల్కొంటున్నాయి.

తన చేతివేళ్ల సందుల్నించి పోదోసి నాటబడిన పైరు ఏపుగా పెరిగి పంటకు రావటం, తను పొదిగించిన గుడ్లు పిగిలి కోడిపిల్లలయి వీధికంతా అందగిస్తూండటం, తను తెచ్చిన పచ్చని గడ్డిని తిన్నబర్రె దాన్ని తెల్లని పాలగా మార్చుతూండటం - పైరు మీదా, బర్రెమీదా, కోళ్లమీదా గౌరికి మర్లు పుట్టించేలా చేశాయి. అవన్నీ తనకు సంబంధించినవిగా, తన చేతులకు సంబంధించినవిగా, తన వల్ల ఉద్దీపన పొందినవిగా, భావన కలుగుతోంటే - వాటిపట్ల ఏదో గాఢమైన ఆపేక్ష పొర్లుతోంది.

చెన్నారెడ్డి దగ్గరనుంచి పిలుపొచ్చింది శివునికి.

ఐదేళ్లలోపు పిల్లల వివరాలు సేకరించాలిట. ఇల్లిల్లూ తిరిగి సర్వే చేయాలట. దీనికి సంబంధించిన ప్రొఫార్మా కూడా అందించాడు.

భాగ్యాన్ని వెంటేసుకొని రెండు సాయంత్రాలు కష్టపడి వూరంతా తిరిగింది గౌరి. ఊర్లో వుండేది డెబ్బైరెండు కుటుంబాలే. పిల్లలు మాత్రం ముప్పైయేడు మంది తేలారు. ప్రొఫార్మాలో సూచించిన ప్రకారం జాగ్రత్తగా రాసి పంపింది.

వాళ్ల వెనక యింటింటికి పోకున్నా వీధుల్లో నిల్చుంటున్నాడు శివుడు

సర్వే పుణ్యాన వూరంతా అధికారికంగా చూడగలిగింది గౌరి. ఇంటిపేర్లు, వ్యక్తుల

# మానసిక సమస్యలకు
# కౌన్సెలింగ్ & సైకోథెరపీ



కెరీర్, మ్యారేజ్, ఫ్యామిలీ, హెల్త్ మరియు
సైకలాజికల్ కౌన్సిలింగ్‌లో నిష్ణాతులైన

**హిప్నో కమలాకర్,**
**హిప్నో పద్మా కమలాకర్**

లచే ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్, న్యూరోటిక్
డిప్రెషన్, ఆందోళన, భయం, కోపం, నత్తి,
నిద్రలేమి, పనులు వాయిదా వేయడం,
దాంపత్య సమస్యలు, ఎయిడ్స్ ఫోబియా,
భార్యాభర్తల వైరుధ్యం, చదువుపై అనాసక్తి,
ఏకాగ్రతలోపం, మతిమరుపు, పరీక్షభయం,
స్టేజ్‌ఫియర్, "ధూమపానం","మద్యపానం",
"గుట్కా, ఖైనీలు" తినడం వంటి
చెడు అలవాట్ల నుండి రక్షణ.

## మైండ్ అండ్ పర్సనాలిటీ కేర్

3-6-656, హిమాయత్‌నగర్ స్ట్రీట్ నెం.9
హైదరాబాద్, ఫోన్: 040-27623310, 27623320., Cell: 93900 44031

Timings:
9 a.m. - 1 p.m.
3 p.m. - 7 p.m.
శనివారం సెలవు

ప్రతినెల 1, 2, 3 మరియు 15, 16, 17
తేదీలలో సిద్ధార్థ అకాడమీ ఎదురుగా,
NVKR టవర్స్ వెనుక, రెవెన్యూ
కాలనీ, హోటల్ కాంధారి రోడ్,
మొఘల్‌రాజపురం, విజయవాడ-10
ఫోన్: 93900 44032, 2487080

ప్రతినెల 4, 5, 6 మరియు
18, 19, 20 తేదీలలో
శ్రీ వెంకటసాయినివాస్ G-2 తిలక్‌రోడ్,
రాజమండ్రి-3, ఫోన్: 2449846
సెల్: 93900 44033

పేర్లు తెలుసుకోగలిగింది. భాగ్యం భర్త రాఘవను చూసింది. అతని హావభావాలు గమనిస్తే - మనుషులెవ్వరితో మాట్లాడి కలిసిపోయే రకంగా కన్పించలేదు.

ఆ విషయాన్నే వాపోయింది భాగ్యం.

ఎవ్వరితోనూ పెద్దగా మాట్లాడడట. అరుగులమీద కూచుంటే పులిజూదాలలాంటి ఆటల్లో మునిగిపోవటం, పొలాల మీదకు వెళితే ఒంటరిగా తిరగటం, పెళ్లాంతో కూడా రోజంతటికీ కలిపి పదివాక్యాలు కూడా మాట్లాడడట. అవీ చిన్నచిన్న వాక్యాలట. అన్నంపెట్టమని కూడా అడగడట. పీటవద్ద కూచుని నిరీక్షిస్తాడట. అడగలేదనే ఉద్దేశ్యంతో తను పెట్టకుంటే అతనే వెళ్లి పెట్టుకు తింటాడట. తను ఎంత వాగుడు కాయో అతనంత ముభావట.

"నా మొగుణ్ని మనుషుల్లో కలిసేట్టు జెయ్యి మరదలా!" దీనంగా అడిగింది భాగ్యం.

"నేనా? " ఆశ్చర్యంగా చూసింది.

"నీ మొగునికి చెప్పు..." అంది.

గౌరి ఆలోచిస్తూ వుంటే ఆమె పాటలోకి దిగింది. "నను బ్రోవమని చెప్పవే! సీతమ్మ తల్లీ... నను బ్రోవమని చెప్పవే!" అంటూ.

రాత్రి రాఘవ సంగతి శివుని వద్ద ప్రస్తావించింది గౌరి.

"మా మూగెన్నా! ఆయప్ప అంతేలే... చేనికాడికెప్పుడన్నా తోడుగా కావిలిపోతే ఇంగ సచ్చినట్టే. పలుకు తోడు కూడా వుండదు." చెప్పాడు.

భాగ్యం కోరిక విన్నవించింది.

శివుడు కూడా ఆలోచనల్లో పడ్డాడు.

ఆరోజు సెల్‌ఫోన్ ఒకటి అందుబాటులోకి రావటంతో తల్లికి ఫోన్ చేసింది గౌరి. కుశలప్రశ్నల తర్వాత చెప్పింది 'ఈసారి వచ్చేటపుడు కుట్టుమిషన్ తీసుకు'రమ్మని. ఊర్లో కుట్టు మిషన్ లేదు.

తన బట్టలే కాకుండా స్నేహితురాళ్ల బట్టలు కూడా కుట్టొచ్చుగదా అనేది ఆమె ఆలోచన.

మధ్యాహ్నం పూట అందరూ అరుగుల మీద కూచుని వున్న సమయాన ఉన్నట్టుండి పిల్లలకోడి 'కొక్కొక్కొక్కో' అంటూ చావుకేకలు వేస్తూ చెట్టుకిందకు పరుగెత్తింది. అప్పటికే బుల్లి కోడిపిల్లలు నేలకేసి కొట్టిన కుండపెంకుల్లా చెల్లాచెదరై రాళ్ల చాటుకో, మనుషుల కాళ్లసందుకో పరుగెత్తాయి. బుజ్జికోడి పిల్ల ఒకటి హుషారుగా కదల్లేకపోయింది. అప్పటికే గద్దనీడ దాని మీద రాక్షసంగా వాలింది. కాలివేళ్లతో తన్ని పట్టి గాల్లోకి ఎగిరింది. దాని కాలివేళ్ల సందున కోడిపిల్ల కీచుకీచుమని అరుస్తోంది.

అరుగువద్ద వున్నవాళ్లంతా చేతిలో రుమాళ్లు వూపుతూ "హూయ్ హేయ్..."మంటూ అరుస్తోన్నా గద్ద లెక్కజేయలేదు.

తన కళ్లముందే తమ కోడిపిల్లను గద్ద తన్నుకుపోతోంటే చూస్తూ సహించలేకపోయాడు శివుడు. చివుక్కున నేలకువంగి పట్టెడు లావు రాయి తీసి గద్దకేసి విసిరాడు - నరాలు తెగిపోయేలా గావుకేక వేస్తూ. అతని తోటి మరికొందరు యువకులు రాళ్లు విసిరారు.

రాళ్లు గాల్లో దూసుకెళ్లి గద్దను రాచుకొంటూ దాని చుట్టూ ఎగిరాయి. వాళ్ల అరుపులు రెక్కల యీకల్ని వణికించాయి.

అరుపుల అదలింపులకూ, రాళ్ల జడిపింపులకూ బెదరి గద్ద కాళ్లల్లో పట్టు సడలింది.

కోడిపిల్ల నేలకు జారింది.

కిందపడబోతున్న పిల్లను గాల్లోనే అందుకొన్నాడు ఓ యువకుడు.

కొన్ని క్షణాలు ఆలస్యం చేసినా కోడిపిల్ల కళ్లు పీకేసి వుండేది గద్ద. అప్పటికే కాలిగోళ్ల తాకిడి వల్ల రెండు మూడు చోట్ల గాయాల

య్యాయి.

గద్దను శాపనార్థాలు పెడుతూ ఆదరాబాదరా వచ్చి కోడిపిల్లను చేతిలోకి తీసుకొంది లక్షుమ్మ. గుప్పెట్లో మూసి నోటగాలి వూదుతూ ఇంట్లోకి తీసికెళ్లి నాటువైద్యం మొదలెట్టింది.

వైద్యం పూర్తయ్యేదాకా కాసేపు గద్దను తిట్టింది. మరి కొంతసేపు తల్లికోడి చేతగాని తనాన్ని దుమ్మెత్తిపోసింది. మొహంనిండా అంతులేని విచారాన్ని నింపుకొని వుంది.

కోడిపిల్లను చేతిలోకి తీసుకొనేసరికి గౌరికి కూడా ఒక్క క్షణం గుండెలు జలదరించాయి. రోజూ తన ముంజేతి మీదకెక్కి, తల ఓరగా తిప్పి తనకళ్లల్లోకి చూసే పూల కోడిపిల్ల అది. దూదివుండలాంటి కోడిపిల్లకు గాయమై తన చేతిలో నిస్సహాయంగా పడి వుండటం ఆమెకు బాధ కలిగించింది.

ఇతరులెవ్వరైనా తమ కోడి మీద రాయేసినా, మరొకరి గడుసుకోడి వచ్చి తమ కోడిని వెంటాడి పొడిచినా ముసలామె పడే అర్థంలేని ఆవేదనకు ఇప్పుడు అర్థం తెలిసివచ్చింది. ఆ మూగజీవులతో మానసిక సంబంధాలు పెంచుకోవటం వలన మాత్రమే అనుభవంలోకి వచ్చే వేదన అది.

బర్రెకు కంపగీరుకొని నెత్తురోడితే తనకే గాయమైనట్లుగా బాధపడుతుంది ముసలామె.

ఆమె ఒక్కతే కాదు. వూర్లో చాలామంది అంతే. తనకు గుర్తుంది... రాములోల్ల యింట్లో నెల కిందట గాడి మీది ఎద్దు చనిపోతే ఆ ఇంటి ఆడాళ్లు ఎంతగా శోకాలు తీశారనీ! ఇంటి పెద్దకొడుకు చచ్చిపోయినంతగా ఏడ్చారు. ఆ ఏడుపులు చూసి తనా రోజు ఆశ్చర్యపోయింది - 'ఒక పశువు చావును గురించి అంతగా దుఃఖించాలా?' అని. మరొక ఎద్దును కొనుక్కోవచ్చు గదా!



ధాలూ, నేలమీది మమకా రాలూ, ఇంటిమీది ఆపే క్షలూ... అన్నీ తెలిసివస్తు న్నాయి.

౨

సాయంత్రం బర్రె వచ్చిందిగాని అత్త ఇంటికి రాలేదు.

నేరుగా దూడ దగ్గ రకు పోయింది బర్రె. తల్లి పొదుగులో తల దూర్చి ఎగిరెగిరి కుమ్ముతూ వుంది దూడ.

ఆ దృశ్యాన్ని చూసింది గౌరి. ఆదరాబాదరా తుం టికర్ర తీసుకొని బర్రెను అదిలిస్తూ వెళ్ళింది. దాన్ని కూసం వద్దకు తోలుకెళ్లి మెడకు తలుగు పెట్టింది.

దూడ అరు స్తోంది. గింజుకొంటోంది.

అత్తకోసం కొంతసేపు చూసింది ఆమె. తల నిక్కబెట్టి దారి వెంట చూపులెత్తింది.

అత్త తొందరగా ఎదుక్కొంటుందనే నమ్మకం.

పచ్చిగడ్డి తీసుకెళ్లి బర్రె ముందు వేసింది. గడ్డిమీద బడి గబ్బిళ్లు గబ్బిళ్లు నోటబెట్టు కొని నమలసాగింది అది. పాలకోసం అరిచే కూతుర్ని తన వద్దకు రమ్మంటూ తల విసు రుతోంది.

మరికొంతసేపు అత్త కోసం ఎదురు చూసింతర్వాత నిర్ణయించుకొంది తనే పాలు తీయాలని.

అనుకొంది.

ఇప్పుడు తెలిసి వస్తోంది. ఆ ఏడుపు వెన కనున్న తాత్వికత. పశువును కూడా తమ యింటి మనుషుల్లో ఒకరుగా భావించేంత మానసిక సంబంధాలు పెంచుకోవటంవల్లనే ఆవేదన అంతా.

ఈ ఒక్క సంఘటనతో గౌరిలో చాలా మార్పులు చోటుచేసుకొన్నాయి. ప్రతి విష యాన్నీ విశ్లేషించి అర్థం తెలుసుకొనే వరకూ ఆలోచిస్తోంది. వ్యవసాయ కుటుంబాల్లోని మానవ సంబంధాలూ, మానసిక అనుబం ధాలూ క్రమేణా అర్థమవుతున్నాయి. బర్రె తోటి అనుబంధాలూ, పైరుతోటి సంబం

దూడను వదలి బర్రె చేపుకొచ్చేదాకా పొదుగును చీకనిచ్చి తర్వాత పక్కకు లాగింది.

పాల సెరవను తీసికొని బర్రె దగ్గర కూచుంది.

సెరవలోని నీళ్లతో పొదుగు కడిగి చన్ను పట్టి పాలు లాగేందుకు ప్రయత్నించింది.

ఒక చన్నులోని పాలు ధారగా కారుతూ, అది ఆగగానే రెండవ చన్నుపాల ధార ప్రారంభించేలా పాలు పితకటం ఆమెకు సాధ్యం కాలేదు. చన్ను పట్టి లాగితే చుక్కలుగా కారుతున్నాయి గాని ధార కుదరటం లేదు. ఆమె తంటాలు పడేంతలో అటుగా భాగ్యం వచ్చింది. గౌరి పక్కగా కూచుని పాలు ఎట్లా పితకాలో చెప్పింది. పాత్రను కాళ్ల మధ్య ఎలా కుదించాలో, ఎలా చన్ను పట్టి లాగాలో చెబుతూ పాలు తీసి యిచ్చింది. పరాచికాలాడింది.

పాలు చూసుకొన్న తర్వాత వాళ్లు వేప చెట్టు కింద అరుగుమీద కూచుని వున్న శివుణ్ణి గమనించారు. తమకేసే చూస్తున్నాడు అతను.

భాగ్యం చిన్నగా నవ్వుతూ "నేను రాకుంటే బావుండు..." అంది. "యీ ట్రైనింగ్ అంతా మావోడు యిచ్చేవాడు. ఇంకా సులభంగా నేర్చుకొనేదానివి." చెప్పింది ఓరగా చూస్తూ.

గౌరి నవ్వుకొంటూ పాలసెరవ తీసుకొంది.

చీకటి పడింతర్వాత వచ్చింది లక్షుమ్మ. చేలల్లో ఎవరో ఆడోళ్లు పండు మిరపకాయలు కోసుకుపోతోంటే వాళ్లను అదిలించి ఇప్పటిదాకా కనిపెట్టుకొని వచ్చిందట- సంజాయిషీ యిచ్చింది.

జ్యేష్టకార్తె చివరికంతా వరి అర్రాంచింది.

పండు మిరపల కోత మొదలైంది.

కూలీల్ని పెట్టి మిరప పండు కోయించి ఇంటివద్ద కళ్లంలో ఎండబోయిస్తున్నాడు శివుడు.

కళ్లాలన్నీ ఎండుమిరప తివాచీలుగా మారాయి. కొన్ని మిరప పళ్లు కళ్లు మిరుమిట్లు గొలిపే ఎర్రదనంతో మాగి, మరికొన్ని ఆకుపచ్చ ఎరుపులతో దోర మాగి అందంగా కన్పిస్తున్నాయి. రాత్రికి కుప్ప చేయటం, ఉదయం ఎండ బడింతర్వాత కళ్లమంతా నెరపటం చేస్తున్నారు.

ఉదయం లేస్తూనే అట్లా కళ్లాలకేసి వెళితే పొలాల నిండా మంచుపొగలు అలుముకొని కన్పిస్తున్నా ఒక్కోసారి మింటికి మంటికి ఏకంగా పొగమంచు కమ్మి నాలుగు బార్ల దూరంలోని వస్తువు కూడా కన్పించనంత వింతదనం ఎదురవుతోంది.

మిరపపళ్ల కుప్పల నిండా మంచుబిందువులే... గడ్డిలాకల నిండా, పైరంతా ఆక్రమించీ, నడుస్తోంటే పాదాలన్నీ తడిసిపోతూ, ఒళ్లంతా జలదరించి కొంకర్లుపోతూ... ఆ పొగమంచులోనే వింతయిన కాంతితో చలిమంటలు రగులుతూ - శీతాకాలపు ప్రకృతి జీవులన్నింటికీ కొత్త అనుభూతినిస్తోంది.

అట్లా చేల వద్దకు వెళితే చాలు అలసంద, పెసర, కందికాయలు కుప్పలు తెప్పలుగా దొరుకుతున్నాయి. చేలల్లో అడుగుపెట్టింది మొదలు మళ్లీ చేలను వదిలేదాకా ఏవొక కాయలు కోసుకుతినటమే.

సాయంత్రానికంతా బుట్టెడు కందికాయలో, అలసందకాయలో, అనపకాయలో కోసుకొస్తున్నాడు శివుడు. కందికాయల్ని ఉడకేసుకు తిన్నా అలసందకాయల్ని నిప్పుల మీద కాలిస్తేనే రుచి. ఇక అనపకాయల్ని ఉడకేసి బుట్టలో పోసుకొని మంచం దగ్గర పెట్టుకొని తింటూ వుంటే- కాయలన్నీ అయిపోయినా తనివి తీరదు. కడుపునిండదు.

సాయంత్రం బర్రెపాలు తీయటమనే అద

నపు బాధ్యత వొకటి మెల్లిగా గౌరి చేతులకె క్కింది. మొదటిరోజు భాగ్యం సహాయపడినా తర్వాత శిక్షణ అంతా శివుని చేతుల మీదే జరిగింది.

వంకవార వరిమళ్ల మీద పందుల దాడి మొదలైందట. జనమంతా కాపలాకు వెళుతు న్నారు. రాత్రయ్యేసరికి భుజాన దుప్పటి, చేతిలో ఏదో ఒక ఆయుధంతో మగాళ్లంతా మాటల సముదాయమై చేలకేసి కదులుతు న్నారు. వంకవార వరిమళ్ల వాళ్లే కాకుండా లోతట్టు పొలం వాళ్లు కూడా కాపలా వెళు తున్నారు. ఉదయంపూట దట్టంగా అలుము కొన్న మంచు పొగల్లోంచి నిండా దుప్పటి ముసుగేసుకొని చేల గెనిమల మీదుగా ఊర్లోకి అడుగుపెట్టి వీధుల్లో రగులుతూ వున్న చలిమంటల చుట్టూ గుంపవుతు న్నారు.

సావాసగాళ్లంతా కాపలాకెళ్లినా శివుడు మాత్రం ఇంట్లోంచి కదలటం లేదు. అంద ర్నీ పొలాల్లోకి సాగనంపి తాను ఇంట్లో దూరుతున్నాడు. పెళ్లాం పక్కన వెచ్చగా పడుకొంటున్నాడు.

ఒకటికి రెండుసార్లు చెప్పి చూసింది లక్షుమ్మ.

ఏమాత్రం కదలిక లేని కొడుకు మొహం కేసి వింతగా చూసింది. అర్థం కానట్టుగా చూసింది. అయోమయంగా చూసింది. ఇన్నేళ్ల వ్యవసాయానుభవం ఏమూల జేరి నట్టు? ఈ చేతులతోనే గదా నేర్పింది తను! దున్నటం నేర్పింది. విత్తటం నేర్పింది. కలు పుదీయటం, పంట కోయటం, కళ్లం చేయ టం అన్నీ దగ్గరుండి నేర్పించింది. వేరుశెనగ విత్తినపుడు వారం రోజులూ, పంట సమ యంలో నెలరోజులూ గుడిసె వేయించి మరీ కాపలా వుండటం ఎలాగో నేర్పిం చింది. తన దుప్పటి కూడా వాడికే కప్పి చలి బారినుండి రక్షిస్తూ కాపలా కాసింది.

ఆ అనుభవమంతా ఏమైనట్టు?

పంది అడుగులు చేలో కన్పిస్తే గిలగిల్లా డేవాడు. వేరుసెనగ చెట్లను నక్కలు ఎల్లేసి కాయలు కొరికితే లబలబలాడేవాడు. బర్రెలు పొరబాటున వరిపైరు కొరికితే మొత్తుకొనేవాడు. ఇప్పుడేమైంది వాడికి? పైరు నాశనమయ్యే విషయాన్ని కూడా పట్టించుకోవడంలేదంటే వాడు రైతుదనానికి దూరమయినట్టేనా?

భరించలేకపోతోంది ఆమె. కళ్లకు కనిపిం చని కరవులేవో ఉప్పెనలై మీదబడుతోన్న ట్లుగా అనుభూతికొస్తోంది.

పెండ్లాం మోజులో పడొచ్చుగాని పైరును మరిస్తే ఎట్లా?

రైతుకు పైరు పొలం తర్వాతేగదా మిగిలి నవన్నీ!

రోజంతా ఆలోచిస్తూనే వుండిపోయింది ఆమె.

చివరకు కోడలితోనే విన్నవించింది.

"ఎట్టమ్మే! పందులొచ్చి పైరు తొక్కి పోతం డాయట. ఒక్క రాత్రి పందుల మంద చేలో దూరినాయంటే మన సేతికి ఏమీ మిగల్దు. యీనికేమి సేటుకాలమొచ్చిందో మరి కదల కుండాడు. ఇంట్లో మంచం కర్సుకొని పండు కొంటే నోటికాడికొచ్చిన పంట నాశనమైపో తది" అంది.

'మంచం కరచుకొని' అన్నమాట 'తనను కరచుకొని' అన్నట్లుగా ధ్వనించి ఉలిక్కిప డింది గౌరి. పైరు నాశనమయ్యే దృశ్యాన్ని వూహించుకొని తమ పట్ల ఎంత అసహ నంగా వుంటోందనీ ముసలామె. బహుశా తమ శారీరక వాంఛను అసహ్యించుకొం టోంది కాబోలు.

శరీరమంతా సిగ్గుతో కుంచించుకపో యింది ఆమెకు.

రెండు రేత్రిళ్లు శివుణ్ణి పోరుబెట్టింది.

మూడో రాత్రి కంతా దుప్పటి భుజాన

వేసుకొని సావాసగాళ్లతో కలిసి బైల్దేరాడు- అతను.

ఆ రోజు రాత్రి గౌరికి నిద్రపట్టలేదు.

మంచమంతా సువిశాలంగా విస్తరించినట్లనిపింది. ఇటువైపు నించి అటువైపుకు ఎంత పొర్లినా పట్టె తగలనట్టే తోచింది. నిండా ముసుగు తన్నినా చలి దాడి భరించలేకపోతోంది. రోజూ తనను అంటుకొని, తన శరీరాన్ని రక్షిస్తూ వున్న వేడి శ్వాసలూ, గుండె చప్పుళ్లూ, శారీరక స్పర్శలూ ఒక్కసారిగా దూరమయ్యేసరికి కళ్లు మూతబడలేదు.

**అతని ఒళ్లంతా మంచుగడ్డలా వుంది. అతని వణుకుళ్లు ఆవిరయ్యేసరికి చాలా సమయమే పట్టింది. రోజూ అదే తంతు**



చలిపొద్దు గాబట్టి ఎనిమిది గంటల్లోపే ఊరంతా సద్దుమణిగింది. ఎక్కడో ఒకటి రెండిళ్లలో మోగుతోన్న టీవీ రొదలు తప్ప కుక్కలు కూడా పెద్దగా మొరగటం లేదు.

మరో గంటసేపు నిద్రలేమితో కుస్తీపట్టింది గౌరి. వాకిళ్లు సరిగ్గా వేసిందో లేదో చూసింది. కుండా చట్టీ ఎగబెట్టిన విషయం అనుమానమొచ్చి మరోసారి పరిశీలించింది. తను ఒంటరిదాన్నన్నే విషయం గుర్తొచ్చి ఇంకోసారి తలుపు గడియ గట్టిగా బిగించింది.

మంచమ్మీద పడుకొని నిద్రకోసం తంటాలు పడుతోన్న సమయంలోనే- కనురెప్పలు మెల్లిగా అంటుకొంటోన్న తరుణంలోనే- తలుపు చప్పుడైంది.

ఉలికిపాటుగా కళ్లు తెరిచింది.

చెవులు రిక్కించింది.

మరోసారి చిలుకు కదలింపులు.

గుండెలు దడదడలాడాయి.

గొడ్లపాకలోని అత్తను కేకేయాలనిపించింది.

అంతలోనే ఏదో పిలుపు. గుసగుసల సవ్వడితో కూడిన పిలుపు. "గౌరీ! వాకిల్దీ..." అంటూ.

పిలుపు శైలిని గుర్తుబట్టింది. గొంతు గుర్తుబట్టింది.

ఆశ్చర్యపోతూ వెళ్లి తలుపు తీసింది.

దుప్పటి ముసుగేసుకొని వున్న శివుడు ఆమెను రాచుకొంటూ లోనికొచ్చాడు. అప్పటికే మంచు తాకిడికి చెమ్మగిల్లింది కాబోలు దుప్పటి అంచులు ఆమె ఒంటికి చల్లగా సోకాయి.

ఇరుగు పొరుగు చేలవాళ్లు వంకదరిన్నే పడుకొని వున్నారట. అటువైపు పందులు రావటం సాధ్యపడదట. అందుకే ఎవరికీ చెప్పకుండా జారుకొచ్చాడట.

ఆమెకు అనుమానంగా వుంది. తన్ను వదలి వుండలేకనే అతనొచ్చాడేమోనని.

అతని ఒళ్లంతా మంచుగడ్డలా వుంది.

అతని వణుకుళ్లు ఆవిరయ్యేసరికి చాలా సమయమే పట్టింది. రోజూ అదే తంతు.

తల్లి కంటపడకుండా జాగ్రత్తపడుతున్నాడు అతను.

అయితే, ఇరుగుపొరుగు చేలవాళ్లు మాత్రం రెండో రోజున్నే పసిగట్టారు. 'పెండ్లాం గల్లోడులే పాపం' అంటూ వ్యంగ్యంగా జాలిపడ్డారు. తర్వాతిరోజు సందేల కావలి వెళుతున్నపుడు "ఒరే శివగా! నువ్వేమో పెండ్లాం కాడ ఎచ్చగా పండుకొంటివి. మేం సలికి సచ్చాంటిమి. మేమూ వొకరోజన్నా ఎచ్చబడాల గదా!" అన్నాడు ఎర్రగుడ్ల రోశయ్య.

ఎవరో కిసుక్కున నవ్వారు.

"పెండ్లాముండోల్లం. మాకు రాని కోరిక నీకొచ్చిందే! తాడూ బొంగరం లేనోనివి

# తూర్పు రాయలసీమ ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు జిల్లాల
# పట్టభద్రులకు విజ్ఞప్తి !


మహాత్మ జ్యోతిరావు పూలే- సావిత్రిబాయి పూలే

ఆర్.కృష్ణయ్య గారు
రాష్ట్ర బి.సి. సంక్షేమ సంఘం అధ్యక్షులు


డా॥ మాదాల వెంకటేశ్వరరావు గారు
M.B.B.S., FCGP.

**తూర్పు రాయలసీమ, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు
జిల్లాలలో పట్టభద్రుల నియోజకవర్గ ఓటరు
మేధావులకు విజ్ఞప్తి !**

ఇండియన్ మెడికల్ అసోసియేషన్,
ప్రభుత్వ డాక్టర్ల అసోసియేషన్, S.T.U., B.T.A.,
వివిధ క్యాడర్ సంఘాలు, S.C., S.T., B.C.,
మైనారిటీలు, సామాజిక చైతన్య వేదిక,
రాష్ట్ర బి.సి సంక్షేమ సంఘం, బి.సి. సంఘర్షణ సమితి
93 బి.సి కులాల ఐక్యవేదిక, సేవా స్టంబ్,
A.D.P.S., అఖిల భారత
యాదవ మహాసభ, దళిత యువసేన
మరియు ఇతర స్వచ్ఛంద సేవా సంస్థలు
బలపరుస్తున్న అభ్యర్థిగా పోటీ చేయుచున్న నన్ను
మీ పవిత్రమైన ఓటు వేసి గెలిపించవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

## డా॥ మాదాల వెంకటేశ్వరరావు
**M.B.B.S., FCGP.**
**నెల్లూరు - సెల్ నెం. 98495 50479**

నువ్వెట్లా ఎచ్చబడతా వురా మామా!పొయ్యిగ డ్డల కరుచుకొని పండు కొంటవా యేంది?" అందరూ పక్కున నవ్వారు.

"వెచ్చదనం పెండ్లాంకాడ దప్ప యాడా రాదా?" గయ్‌మన్నాడు రోశయ్య. "మంచి కోడిపుంజునొకదాన్ని ఇస్సే యీ వంకలోనే బట్టీపెట్టమా! నాలుగు సుక్కలు మందేసు కొని రొండు ముక్కలు కొరుకుతా వుంటే ఆ ఎచ్చదనం మీకేం దెలుస్తాదిరా!" చెప్పాడు.

అతని అభిరుచి అందరికీ నచ్చింది.

"అబ్బ! ఇన్నిరోజులకు నీ తెలివి పన్జేసింది మామో!" ఉన్నట్టుండి రోశయ్యను పైకె త్తాడు ఓ యువకుడు.

శివుని సమ్మతితో సంబంధం లేకుండానే కోడిమాంసపు తీర్మానం అక్కడ ఆమోదించ బడింది.

సారాయి సంగతి తనకు సంబంధం లేదంటూ తప్పుకోబోయాడు శివుడు. "నువ్వింటికాడ పెండ్లి జేసుకొనుంటే అంద రికీ పొయ్యావా?"

"ఎవురో... సిందులేసే వాల్లకూ, కట్టెతిప్పే వాల్లకూ..."

"మేంగూడా సిందులేస్తాం. కట్టెతి ప్పుతాం... వంకలు వాగులు దద్దరిల్లాల... వానెక్క... పందులు పారుకోవాల..." రోశయ్య అన్నాడు.

మూడు సీసాల సారాయి, మూడు కేజీల కోడిపుంజును తెచ్చియిచ్చేట్టుగా శివుడు సమ్మ తించాడు.

"ఎంత తెంపు వొచ్చెరా నాయాలా! మా సెల్లెలు కాలుబెట్టిన వేళావిశేషం-" సుబ్బారెడ్డి అన్నాడు.

మల్లీరోజు రాత్రి వంకవార చేలవాళ్లు ఓ పదిమంది వంకలో గుమిగూడారు. కోడిని కోయటం, మంట మండించటం, అన్నం చేయటం వగైరా పనులతో వంకంతా సంద డిగా వెలిగిపోసాగింది.

వాళ్లకు తోడు మరో ఐదు మంది జత య్యారు.

"యాడున్నేరురా యీ నాకొడుకు లంతా..." అంటూ విసుక్కొంటున్నాడు రోశయ్య. తేపతేపకూ కోడిమాంసపు పరిమా ణాన్ని లెక్కేస్తున్నాడు. సారాయి డబ్బా మూతతీసి పరిశీలిస్తున్నాడు. వచ్చిన వాళ్లల్లో మరో ఇద్దరు సారాయి తాగేవాళ్లు వుండటం చూసి సన్నగా తిట్టుకోవటం మొదలెట్టాడు.

"యాందొరే గొనుతండావ్! బర్లు పాసిపో తయి నాకొడకా!" హెచ్చరించాడు గురయ్య. "నీకు కాబట్టిన కాడికి తాగరాదా! మిగిలింది మాకియ్యరాదా! సీనగత్తినాకొడుకువే..." అన్నాడు.

మరింక ఆలస్యం చేయలేదు రోశయ్య. గుటగుట కడుపునిండా తాగి వెలితికి నీళ్ళు పోశాడు. ఆదరాబాదరా పొయ్యి దగ్గరకు వెళ్ళి ఉడికీ ఉడకని మాంసపు ముక్కను నోట వేసుకొన్నాడు.

మరికొద్దిసేపటికి అతని నోట్లోంచి యాల పదాలు తన్నుకు రాసాగాయి.

"తుమ్మ చెక్క సారాయిరో... దీనికెంత కైపాయరో..." కండువా రెండు కొసల్ని సాగదీసి పట్టుకొని చిందులు వేయటం ప్రారంభించాడు.

సారాయిలో నీళ్ళు కలిపిన విషయం మిగతా వాళ్లకు తెలిసిపోయింది. రోశ య్యను తిట్టుకొంటూ, చీదరించుకొంటూ, తూతూ అని వూస్తూ ఎలాగోలా కడుపు నిండా తాగి ముక్కలు కొరికారు. కైపె క్కారు. నీళ్ల కలిపినా నిషా ఎక్కినందుకు ఒకడు సారాయిని అభినందిస్తే, రోశయ్య నీళ్ళే కలపలేదనీ, అతను చాలా ఉత్తముడనీ, అందుకే ఇంత బాగా కైపెక్కిందనీ మరొ కడు వాదించాడు.

మందు తాగి మాంసం తిని కోడిచారు

చతుర 30 వసంతాలు

తాగిన తదుపరి అందరూ సమానమయ్యారు. తాగనివాళ్ళే అంటరాని వారయ్యారు.

వంక ఇసుకలో కొందరూ, గుండ్రాళ్ళ మీద మరికొందరూ కూచుని యాలపదాలు ఎత్తుకొన్నారు.

అన్నం కూడా తినకుండా శివుడెప్పుడో వాళ్లను వదిలి వెళ్లిపోయాడు.

తాగిన వాళ్ల పాటలు పద్యాలతో సగం రేత్రి దాకా వంక మార్మోగిపోతూనే ఉంది. దూరపు చేలవాళ్లు కూడా అక్కడేదో జరిగిందని ఊహించుకొన్నారే గాని చలివల్ల లేచి రాలేకపోయారు.

తాగిన వాళ్లల్లో సగం మంది వంకలోనే పడుకొని స్వర్గపుటంచుల దాకా వెళ్లేందుకు ప్రయత్నిస్తోండగా మిగిలినవాళ్ళు మోకాళ్ళూ మోచేతులతో దేకుతూ తమ పడకల దాకా వెళ్లి అక్కడ రంభ ఊర్వశి మేనకల కోసం ఎదురుచూడసాగారు.

దేవలోకం వెళ్లారో లేదో, దేవనర్తకిలు వీళ్ల వద్దకు వచ్చారో లేదో తెలియదుగానీ పందులు మాత్రం మూడవ జాము ముగిసే సమయాన గురగురమని వాళ్లను పలుకరించి మరీ పొలాల్లో జొరబడ్డాయి.

సారాయి తాగని వాళ్లకు మెలకువ వచ్చింది. తాగిన వాళ్ల గురకలో పంది గుర్ఘురింపులో అర్థంగాక కొంతసేపు తికమక పడ్డారు. శబ్దాలన్నీ మందగా విన్పిస్తూ వెళుతుండడంతో అనుమానమొచ్చి గట్టిగా కేకేశారు. ఆ శబ్దాలకు వరిపైరులో జరజరమనే కదలికలు విన్పించి గుండెలు దడదడలాడుతోండగా, "పందులు పందుల్రోయ్!" అంటూ కేకలూ, యీలలూ, రాళ్లు విసరటాలూ... నిద్రబోయేవాళ్లు ఉలికిపాటుతో లేచి పెడబొబ్బలు పెట్టడాలూ, ఎవరో జేబులో పెట్టుకొచ్చిన టపాకాయలు పేల్చి వాతావరణాన్నంతా యుద్ధరంగంలా తయారు చేయడాలూ... ఇన్ని హడావుళ్ళకు పందులు

బెదిరి వంకవైపు రావటం చాలించి వరిపొలాల్లో అడ్డంగా పరుగెత్తి చెరువు కట్ట ఎక్కాయి. అక్కణ్ణించి కట్ట మీదుగా బరక పొలాల్లోకి దాటుకొన్నాయి.

తర్వాత ఎవరికీ నిద్ర రాలేదు.

వంకలో పడుకొన్న వాళ్లు కూడా స్వర్గాన్నించి దిగివచ్చి అలసిపోయిన శరీరాలతో తమ గుడిసెల వద్దకు చేరుకొన్నారు.

తాగి పడిపోయి కాపలాకు దూరమవటం వల్ల యీ అనర్థం జరిగిందనేది అందరికీ స్పష్టమైంది.

ఉదయం లేచి వంక గట్టున నిల్చుని అట్లా ఎగమల్లి చూస్తే- చెరువు కట్టదాకా వరికర్రలు వంగదొక్కబొడి దారి ఏర్పడి ఉంది. పైరును తిని నాశనం చేయలేదు గాని తొక్కి చెరుపు చేశాయి పందులు.

అక్కడికీ యువకులు హుషారు చేయటం వలన పెద్ద నష్టం తప్పింది.

పందులు చేలల్లో జొరబడటం మామూలే అయినప్పటికీ దాని వెనక కథ మాత్రం వూర్లో చర్చనీయాంశమైంది. శివుణ్ణి తప్పుపట్టలేకున్నా అతని చేత మందు తెప్పించు కొన్న తాగుబోతుల్ని మాత్రం బాగానే తిడుతున్నారు. శివుడు అంత సులభంగా వాళ్లకు లొంగడానికి గల కారణాన్ని వెదకి తెలుసుకొని కొందరైతే నవ్వుకొన్నారు. మరికొందరు ముక్కున వేలేసుకొన్నారు.

పెళ్ళాం కాడ పడుకొనేందుకే వాళ్లకు మాంసమూ, మందూ ఇప్పించాడని తెలిసి ముసలాళ్ళు మీసాలు సవరించుకొంటూ పాత జ్ఞాపకాల్ని తవ్వుకొన్నారు.

"ఇదేముంది? మేం వయసులో తిరిగిన తిరుగుళ్లు ఇంటే మీ కండ్లు తిరిగిపోతాయి. అప్పుడు మా ఆడది పుట్టింటికాడున్నదిలే. మాంచి పనల కాలం. పొద్దుగుంకేదాకా పన్జేసి నీల్లు పోసుకొని బువ్వ దిని మంచం ఎద్దల కొట్టంలో బేసి బొంతపరిచి మా నాయన కండ్లబడకుండా ఇండ్లు దాటిన్నా-

చతుర 30 వసంతాలు

పదిమైల్లదూరం నడ్సి మా బాసేలి కాడికి చేరు కుండేటోన్ని. మల్లా తెల్ల బారే తలికి ఇంటికొచ్చి ఎద్దులకు నీల్లు తాపి పనిలో కల్సుకుండే టోన్ని" అంటూ ఓ ముసలాయన చెబు తోంటే మరో ముసలాయన ఇంకో జ్ఞాపకం ఎత్తుకొన్నాడు.

లక్షుమ్మకు కూడ విషయం తెలిసి కొడుకు కేసి అదోలా చూసింది. అర్థం కానట్లుగా చూసింది. ఏమనేందుకు నోరు పెగల్లేదు. పందుల మంద పొరబాటున తమ చేలోనే వంగి ఉంటే ఏమయి ఉండేదో వూహించు కొని గజగజలాడిపోయింది.

ఇంత జరిగింతర్వాత ఇప్పటికయినా బుద్ధి తెచ్చుకొన్నాడో లేదో?

ఇంకా ఇంటికి తిరిగొస్తున్నాడేమో!

ఒక రాత్రి మాటువేసింది ఆమె.

పది గంటల్లోపే ఇంటికి వస్తూ వున్న కొడుకును చూసింది.

ఈ రాత్రికే పైరు నాశనమై పోతుందేమో నన్నంతగా గుండెలు లబలబలాడాయి. కొడుకు మీద కోపం తన్నుకొస్తూ ఉంది. కోడలి అలసత్వం పట్ల అసహనంగా ఉంది. కర్తవ్యాన్ని మరిచి మూర్ఖుడై ఇంటికి వచ్చిన మొగుణ్ణి పక్కలో చేర్చుకొని సుఖపెట్టిన ఆడది అది గాడిదతో సమానమంటూ గొణుక్కుంది.

పంట మట్టిలో కలిసిపోతుందేమోనని భయం. ఆ వినాశనం మీదుగా కరువులు నడిచి వస్తాయేమోనని భీతి. కరువు అను భవాన్ని తల్చుకొని గుండెల్లో వణుకు.

పొద్దున్నే లేచి ముసలి గోవిందమ్మ దగ్గ రకు వెళ్ళింది.

కొడుకు నిర్వాకమంతా ఆమెకు చెప్పి ఏడ్చింది.

మునెమ్మను పిల్చుకొని వాపోయింది.

కొడుకు దారికొచ్చేట్టు లేడు. దారికి తేవల సిన కోడలు కూడా మైకంతో కళ్లు మూసు కొంది. ఇప్పుడామె కళ్లు తెరిపించాలి.

"అమ్మా!"అంటూ గోవిందమ్మ కాళ్లు పట్టు కొంది.

"కూతురా!" అంటూ మునెమ్మ చేతులు పట్టుకొంది.

లక్షుమ్మ బాధను అర్థంచేసుకొన్నారు వాళ్లు.

ఏం చేయాలో నిర్ణయించుకొన్నారు కూడా.

ఆ రోజు మధ్యాహ్నం ఎవరూ లేకుండా చూసి గౌరి వద్దకు వెళ్ళింది గోవిందమ్మ. "ఏం కూరాకు జేసినావే మనమరాలా?" అంటూ.

సంకటి గెలికి చిక్కుడుకాయల తాలింపు చేసి వుంది.

ఎడమ అరచేతిలోని సంకటి ముద్ద మీద కూర వేయించుకొని, చిక్కుడుకాయ తునక నొకదాన్ని నోటబెట్టి చప్పరించి లొట్ట వేసింది గోవిందమ్మ.

"బాగుంది. బో రుసిగా వుందం"టూ మరోసారి చప్పుడు చేసింది.

ఆమెకేసే చూస్తూ వుంది గౌరి.

ఈమధ్య కాలంలో తమ ఇంటికి రావటం బాగా తగ్గించింది యీ ముసల్ది. దానికి కార ణాలు ఇద్దరికీ తెలుసు.

ఇప్పుడెందుకు వచ్చిందో అర్థం కాలేదు.

ఆమె రాకను గురించి ఆలోచిస్తున్నంతలో పాట ఒకటి ఇంట్లో అడుగుపెట్టింది- మునెమ్మ రూపంలో.

"నాకు వొర్రిబువ్వ వండరాద ఓరి
మొగుడా!

నువ్వు కొర్రబువ్వ తినరాద ఓరి
మొగుడా!

నాకు పెరుగుబువ్వ పెట్టరాద ఓరి
మొగుడా

నువ్వు మజ్జిగబువ్వ జుర్రుకోర ఓరి
మొగుడా

చతుర 30 వసంతాలు

నాకు పట్టెమంచం
వెయ్యరాద ఓరి
మొగుడా
నువ్వు నులకమంచ
మేసుకోర ఓరి
మొగుడా
నాకు పరుపుదిండ్లు వెయ్యరాద ఓరి
మొగుడా
నువ్వు పాతబొంత పరచుకోర ఓరి
మొగుడా"

ఆమెకేసి ఎగాదిగా చూసింది గౌరి.

ఇద్దరూ కలిసొచ్చారంటే విశేషమే!

"బాగ్గెం పిల్ల రాలేదా? " అడిగింది గోవిందమ్మ.

"రాలే జేజీ!"

"వస్తాననె్నదే. ఎందుకు రాలేదబ్బా! రానీ నా సవితిని..." అంటూ పిడచ నోటబెట్టుకొంది.

**ఈ నడమన మా సివన్నతో సావాసం జేస్తాండంట. సేలకాడికి సెట్లకాడికి ఇద్దరూ కలిసే పోతాండరంట. ఆయప్పతో బాటు యీడూ మూగోడవుతాడేమోనని నాకు భయంగా ఉంది**



"దాని జోలికి ఎందుకు పోతావే అవ్వా! ముందే ముసిల్దానివి. ఒక్కటంటే పదంటది. మొగుడు మూగోడయినా అది మాటల పుట్ట..." మునెమ్మ అంది.

"దేవుడేం గుడ్డోడో ఎడ్డోడో గాదు. అదంత మాటకారి గాబట్టే ఆ మూగోనికి తగలగట్టిండు..." ముసలామె అంది.

వాళ్లకేసి తదేకంగా చూస్తోంది గౌరి.

"ఈ నడమన మా సివన్నతో సావాసం జేస్తాండంట. సేలకాడికి సెట్లకాడికి ఇద్దరూ కలిసే పోతాండరంట. ఆయప్పతో బాటు యీడూ మూగోడవుతాడేమోనని నాకు భయంగా ఉంది" మునెమ్మ అంది.

"పోయిన్నాకొడుకు యీనితోబాటు సందేలనే యింటికి రాకుండా తెల్లవార్లూ సేని గట్టును కర్సుకోని ఎందుకు పండుకొంటాన్నెట్టూ? ..." ముసలామె లా పాయింటు.

వాళ్ల సంభాషణ పందుల కావలి మీదకు వెళ్లింది.

"మీ వరిమళ్లల్లో పందులు జొరబన్నేయంటగదమ్మే రేత్తిరి!" గోవిందమ్మ అంది.

ఉలికిపాటుగా చూసింది గౌరి.

"మా సుబ్బిగాడు కనుక్కొని గూ...బే... అంటూ కేకలేసేతలికి ఇరుగుపొరుగోళ్లంతా లేసి సందడి జేసి తరిమిన్రంట. మావోడు కనుక్కోకుంటే ఎంతసేపు... ఇదో ఈ పిష్ట తిన్నెంతసేపే గాదూ- సేనంతా నేలపాలు జేసేందుకు... రాక రాక కాలమొచ్చింది. పైరు కుదిరింది... నోటికాడి తిండి నేలపాలయితండెనే..."

గుండెల్లో పదరు మొదలైంది గౌరికి.

తనకు చెప్పనే లేదు శివుడు.

"కావిలి పోకుంటే రేపయినా వస్తాయి" మునెమ్మ అంది. "పంట నష్టమూ... పదిమంది సేత మాటలూ..."

మాటలెందుకో అర్థం కాలేదు గౌరికి.

"ఇప్పుడుగాని అనుకోకుండా వుండారా!" సాగదీసింది మునెమ్మ.

"సెవుల్దెగిన ముండలుంటాయి. ఎప్పుడూ ఎవురోకరి మీద నాలికె జాపకుంటే బతకలేవు"

"ఎవురేమన్నెరే? " గోవిందమ్మ ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

"అట్టా యీదిలేకి బోయి యింటే తెలుస్తాది. ఇంట్లో కూకుంటే ఏందెలుస్తాదీ? " మరోసారి సాగదీసింది. "ఏ నా సవితి నోట బట్టినా యీయమ్మ మాటే..." గౌరికేసి ఓరగా చూసింది.

అయోమయంగా కళ్లెత్తింది గౌరి.

"వాడంటే తెలివిలేనోడు. మొరటోడు. పెండ్లాన్ని కర్సుకొని పండుకొంటే సాలను

కొనే ప్రెపంచ గ్యానం లేనోడు... యీ పిల్లకేమొచ్చింది! సదూకున్నేది... తెలివిగ ల్లది... పైరు నాశనమైపోయినా పర్లేదు. వాన్ని యింట్లోంచి బైటికి పంపుతే సచ్చే ట్టుందే అని వొకటే సెవులు కొరుక్కోడాల నుకో..."

తల తిరిగిపోయింది గౌరికి.

"ఈ పిల్ల వాన్నెందుకు యింటికాడుంచు కొంటాదో ఆ యిడ్సిన్నాసవుతులకేం దెలు సులే..." గోవిందమ్మ అంది మరో లొట్ట వేస్తూ. మునెమ్మ కేసి తిరిగి "యీ యమ్మి ఏం జేస్తాదే? ... తప్పంతా దీని అత్తదే... గడ్డికి పొమ్మని పోడు జేసె. గడ్డి కోసి మోస కొచ్చే తలికి అలబాటులేని పానమై వొల్లంతా యిరిగినట్టయి నొప్పులొచ్చె... ఆ నొప్పులు పోవాలంటే రేత్రికి వాడు నూనె రాసి వొల్లు రుద్దాల్సొచ్చె... ఉడుకు నీల్లు పోయా ల్సొచ్చె.. యీ ఇబ్బందులన్నీ పూర్లోవాళ్లకు ఏం దెలుస్తాయి? ... ఎవురి బాధలు వాల్లకు..." అంది వ్యంగ్యం ధ్వనించే ధ్వనిం చనట్టుగా.

ఉన్నఫళాన భూమి బ్రద్దలై అందులో తను కూరుకుపోయి అదృశ్యమైతే బావుండ ననిపించింది గౌరికి. మాటలు రానీని, దృశ్యాలు కనిపించనీని శోక సముద్రం వొకటి ఆమెను ఉప్పెనలా ముంచింది. కను గుడ్ల మీద నీళ్లూరి కొలుకుల్లోంచి జలజలరా లాయి. ఎదుటి దృశ్యాలు మసకెక్కాయి.

"మేమేమన్నెమే తల్లీ! మేమేదో అని నిన్నే డిపించినామని నీ మొగునికి చెప్పే వమ్మా!... ఉన్నమాటన్నెం అంతే..." చేయి కూడా కడుక్కోకుండా బిరబిర బైటకు నడి చింది గోవిందమ్మ.

మునెమ్మ అయితే ఒక్క నిమిషం కూడా అక్కడ నిలబడలేదు.

శోక వివశురాలై దబ్బున మంచమ్మీద వాలింది గౌరి.

ఎంతసేపు ఏడ్చిందో ఆమెకే గుర్తు లేదు.

మానసిక వేదన అంతా కన్నీరై కరిగిపో యిన తర్వాత మెదడు పనిచేయడం ప్రారంభిం చింది.

తనమీద పడ్డ నింద సామాన్యమైంది కాదు. పల్లె జనం దృష్టిలో తను క్షమించ రాని నేరమే చేసింది.

పని, వాళ్ల ప్రాణం, పని, వాళ్ళ బతుకుదె రువు. పొలం పనుల కేసి ఎవరైనా ప్రేరే పించాలిగాని విముఖుల్ని చేస్తే ఓర్చుకోలేరు. శివుడు రాత్రి కాపలా వెళ్లకపోవటానికి కారణం తనేనని వాళ్ల నమ్మకం... వాస్త వమే... పెళ్లాం రాకముందు వరకూ ఏడా దిలో మూడొంతుల రాత్రిళ్లు మడవలకనో, పందుల కాపలాకనో, కళ్లాల్లోని గింజలరాశి వద్దకనో, గొర్ల చేర్పింపులకనో ఇంటికి వచ్చే వాడు కాదుట. ఈనాటికీ చాలామంది రైతులు అదేవిధంగా ఉంటున్నారు. తను వచ్చింతర్వాతే అతను ఇల్లిడిచి పోవటం లేదు. కర్తవ్యాన్ని వదిలేశాడు. రైతుదనాన్ని వదిలేశాడు. దానికి కారణం తనేగదా! తనను నేరస్తురాల్ని చేయటంలో తప్పులేదు గదా!

ఆలోచిస్తూ వుండిపోయింది.

పాడిబర్రె ఇంటికొచ్చేదాకా, దూడ అరు పులు చెవిని సోకేదాకా ఆలోచిస్తూనే ఉంది ఆమె.

రాత్రి భోజనం తర్వాత మంచంమీది బొంతతోబాటు రెండు దుప్పట్లనూ శివుని భుజాన వేసింది. గొడ్డలి తీసి చేతికి అందించింది.

రెండు దుప్పట్లు ఎందుకన్నట్లు చూశాడు.

"మడికాడికి నేనూ వస్తా..."

"నువ్వా!" కళ్లనిండా ఆశ్చర్యం.

"ఆ... పందల కావిలి ఎట్లుంటాదో సూడాల..."

“సూసేదేముండదు. సలికి ముడుసుకొని పండుకోడం తప్పు...”

“అదే చూస్తా...”

“నువ్వా సలికి తట్టుకోలేవులే... నేనే ఓర్చుకోలేక యింటికొచ్చి అమ్మచేత తిట్లుదింటాండ..”

“నువ్వింటికొచ్చేది అందుక్కాదులే...” ఓరగా చూసింది.

గుంభనంగా నవ్వుకొన్నాడు అతను.

ఎంత చెప్పినా ఆమె వినుకోలేదు.

ఒక రాత్రి చలి బారిన పడితే ఆమెకే అర్థమవుతుంది లెమ్మనుకొన్నాడు.

దారిన వెళ్లేటపుడే చలి తాకిడి తెలిసి వచ్చింది గౌరికి. అతని దుప్పట్లోకి దూరి పక్కనే వొదుక్కొని నడవసాగింది. ఆమెను చేతుల కింద పొదువుకొని గెట్లమీద జారిపడకుండా నడవటం గమ్మత్తుగా అన్పించింది అతనికి.

శివుడు పెళ్లాన్ని వెంట తెచ్చుకొన్నాడనే విషయం ఇరుగు పొరుగు రెండు మూడు చేల వాళ్లకు తెలిసింది.

మంచం తెచ్చుకొనుంటే బావుండేదనుకొన్నాడు.

గుడిసె వొంచుకోనందుకు ఇప్పుడు బాధగా ఉంది.

తుమ్మ చెట్టు మొదట్లో దాచిన గోనె పట్టల్ని తీసి వాగు వారన పచ్చిక గడ్డిమీద పరిచాడు. దాని మీద బొంత.

పడుకొనేందుకు మెత్తటి పరుపులాగే ఉంది పడక.

వాతావరణమంతా చలిచలిగా ఉంది.

చీకట్లు పొగమంచుగా మారి నేలను ఆక్రమించుకొంటున్నాయి.

నిండా దుప్పటి కప్పుకొని అతని డొక్కల్లో దూరింది గౌరి.

“ఎవురొరే ఆ దావన పొయ్యేది?” ఎవరో కేకేస్తున్నారు.

“గొల్లోల్ల రంగన్ననులే మామా! గొర్లకాడికి పోతాండ...”

“ఆ దావన పోగాకు... ఆ దావన పోగాకు...”

“ఏమ్మామా?”

“పాములుండాయి నాయినా! పెనుబాములు...ఇదో ఈ పక్కన్నించి పోదూరా..”

గౌరి వీపున వేలితో గిలిగింతలు పెట్టినట్లుగా సైగ చేశాడు శివుడు.

తాము పడుకొన్న గెట్టు మీంచి వెళ్లబోతోన్న రంగన్నను దారి మళ్లించాడు పెద్దరామయ్య. ఆ పెనుబాములు ఏవో గౌరి చెవిలో గుసగుసలాడేసరికి ఆమె మరింత కుదించుకుపోయింది. ఒళ్లంతా గిలిగింతలు పెట్టినట్లయి ఆమెను పెనవేసుకుపోయాడు శివుడు.

కొత్త తావున నిద్రబట్టదేమో అనుకొంది ఆమె.

తనకు తావు కొత్తగా ఏమీ అన్పించలేదు. మంచం లేకపోవటం, చలి ఎక్కువగా ఉండటం తప్ప. రోజులిలాగే శివుని వొడి పొత్తిళ్లు, అతని వేడి శ్వాసల పలుకరింతల మధ్య మామూలుగానే నిద్రబోయింది.

ఉన్నట్టుండి దూరపు చేల నుంచి ఎగిసి వచ్చిన కేకలు... పందులు రాకున్నా జాగృత పరిచే కేకలు... తమ ఉనికిని గుర్తు చేసే విధంగా ఒకరి కేకను అందుకొని మరొకరు.... ఒకదాని వెనక ఒకటి పిక్కటిల్లుతున్నాయి. శివుడు కూడా తన వంతుగా గొంతు చించుకొని అరిచాడు.

ఉలిక్కిపడింది గౌరి. ఒళ్లంతా జలదరించింది. వెన్నెముక వెంట భయం తాలూకు కదలిక జరజర పాకింది. లేచి కూచుని శివునికేసి చూసింది.

సందర్భాన్ని వివరించి చెప్పి పడుకోబెట్టుకొన్నాడు అతను.

అప్పటికే నేలంతా మంచుతో తడిసి ఉంది.

# అమ్మతనంలోని కమ్మదనం అందరికీ సాధ్యం ?



సంతాన లోపాలు కనుగొనేందుకు 2 గం॥లు సమయం వెచ్చిస్తే చాలు. ఉభయులలో లోపం ఎక్కడ వున్న మీ ముందు విస్పష్టం.

నేటికి మా ఉనికి 25సం॥లు దేశవిదేశాలలోను సంతానం లేని దంపతులకు సంతానాన్ని పొందటంలో మేము ఘన విజయాన్ని సాధించాం. మా అత్యాధునిక I.V.F. లాప్రోస్కోప్ సెంటర్ నందు సంతానం లేని దంపతులకు అడ్వాన్స్‌డ్ I.V.F. (టెస్ట్‌ట్యూబ్ బేబి) ట్రీట్‌మెంట్‌ను కిరణ్ ఫెర్టిలిటి అందుబాటులోనికి తెచ్చినది.

**ప్రపంచస్థాయి సాంకేతిక పరిజ్ఞానం**
**అందరికి అందుబాటులో ఆధునిక వైద్యం**

అన్ని రకాల ఇన్‌ఫెర్టిలిటి ప్రాబ్లమ్స్‌పైన 50% డిస్కౌంట్ ఇవ్వబడును. దసరా సందర్భంగా

5 సం॥రములు పై మించి వైవాహిక జీవితం గడిపిన దంపతులకు అతి తక్కువ స్పెర్మ్‌కౌంట్ వంటి పురుష సంభందమైన ICSI ట్రీట్‌మెంట్ ఇంట్రాసైటోప్లాస్మిక్ స్పెర్మ్ ఇంజిక్షన్ సౌకర్యం. హై రిస్క్ ప్రెగ్నెన్సీ, మేనేజ్‌మెంట్, టెస్ట్‌ట్యూబ్ బేబి ఊసైటి /ఎంబ్రో డోనేషన్ ప్రోగ్రామ్స్ సౌకర్యాలు కలవు.

## విజ్ఞప్తి

సంతానం లేనివారికి గొప్ప సదావకాశం. చిన్న మనవి ..... సంతానం లేదని దిగులు చెందుతున్నారా ?

నేను మీలాగే చాలా దిగులుపడి వున్నాను సంతానము కలగలేదని ఎన్నో, చిన్నా చితక హాస్పటల్స్ మరియు గుళ్ళు గోపరాలకు తిరిగి



డా॥ కిరణ్ మరియు సంతానం పొందిన తల్లి బిడ్డలు

విసికిపోయి ఎన్నో డబ్బులు ఖర్చు పెట్టినాను. అయినా ఫలితం కలగలేదు. నేను కిరణ్ ఫెర్టిలిటి యాడ్‌ను పేపర్‌లో చూసి డాక్టర్ కిరణ్‌గారిని సంప్రదించినాను. అందుకుగాను డా॥ కిరణ్ గారు నాకు ఖచ్చితమైన రోగనిర్ధారణ పరీక్షలు జరిపి ఖచ్చితమైన ట్రీట్‌మెంట్‌ను అందించగలిగినారు. అందువలన నాకు మంచి పండంటి బాబును కలిగినాను. నేను మా వారు మా కుటుంబసభ్యులందరు చాలా సంతోషంగా వున్నాము. మరి ఎందుకు ఆలస్యము మన కిరణ్ ఫెర్టిలిటి వుంది మీ చెంత.




## సాయి కిరణ్ ఇన్‌ఫెర్టిలిటి & టెస్ట్‌ట్యూబ్ బేబి హాస్పటల్

6-2-966/4, హిందిప్రచార సభ ఎదురుగా, నిర్మలా స్కూల్ ప్రక్కన, ఖైరాతాబాద్, హైదరాబాద్.

ఫోన్ : 040-65215768, 65549313, సెల్ : 9849000260

Azendia ADs 9246525535

చతుర 30 వసంతాలు

దుప్పట్లు చల్లబడ్డాయి.

చలి లోపలికి దూరుతూ వుందిగాని రెండు శరీరాల వేడిమి ముందు ముక్కు చూపలేకపోతోంది.

రాను రాను చలి బలం పుంజుకోసాగింది. వాళ్ల శరీరాల్ని లోబరచుకోసాగింది.

చలి ఎక్కువయ్యే కొద్దీ గౌరిని తనలోకి పూర్తిగా చొప్పించుకొని అల్లుకుపోతున్నాడు శివుడు. ఆమెకు చలిసోకకుండా తన శరీరాన్ని దుప్పటిలా కప్పుతున్నాడు.

సగం రాత్రికే దుప్పట్లు తడిసిపోయాయి.

దుప్పట్ల లోపలికి శరీర ఉష్ణాన్ని, ఊపిరుల వేడినీ ఏ మాత్రం భంగపరచకుండా పడుకోగలిగితేనే చలిని భరించగలిగేది. మాటి మాటికి కాళ్లు చేతులు కదల్చటం, భంగిమ మార్చటం, దుప్పటి సవరించుకోవటం లాంటి పనులు చేస్తుంటే చలి తాకిడి క్రూరంగా ఉంటుంది. ఆ విషయం శివునికి బాగా అనుభవమేగాని గౌరికి అవగాహన లేదు.

మూడు జాముల పొద్దు గడిచేదాకా కూడా భరించలేకపోయింది ఆమె. శివుని శరీరంలోకి ఎంత చొచ్చుకుపోయినా తట్టుకోలేకపోయింది. శరీరం మీద బట్టలే మంచు నిప్పులై గుండెలదాకా కాల్చుతున్నాయి.

ఎండాకాలపు ఉక్కపోతనీ, వానాకాలపు చిత్తడినీ ఎరిగి వుంది గాని చలికాలపు ఈ మంచు తాకిడిని ఇంత వాస్తవంగా ఆమె ఎప్పుడూ చూసి వుండలేదు. ప్రకృతిలోని మార్పులు ఇంత తీవ్రంగా ఉంటాయని కూడా ఆమెకు అవగాహన లేదు. ఏదైనా అనుభవానికి వస్తేనే తెలుస్తుంది. మొండితనం అలవాటు చేసుకొంటేనే భరించగలుగుతుంది.

శరీరమంతా గజగజ వణుకుతోంది. ఎంత ఆపుకొందామనుకొన్నా సాధ్యం కాలేదు. నాభినుంచి తన్నుకొస్తూ వుంది వణుకు. తల నరాలు చిట్లేంతగా పోటెత్తుతున్నాయి.

ఆమె అవస్థ అతనికి తెలిసిపోయింది.

మరింక ఆలస్యం చేయలేదు.

దగ్గర్లోని పత్తి కట్టెను రెండు సందిళ్లు తెచ్చాడు.

చలిమంట రగిలించాడు.

మంట ముందు కూచున్నా చలి అణగలేదు. ముందు భాగాన వేడి తగులుతోన్నా వెనక దూడ నాకినట్లు చల్లగా జలదరిస్తూ ఉంది. చలి కాపుకొనే విధానాన్ని కూడా శివుని వద్ద పాఠాలు చెప్పించుకోవలసి వచ్చింది.

దుప్పట్లను మంట మీద బాగా వేడి చేసి కప్పుకొంటే అయిదు నిమిషాల్లో మళ్లీ తడిసి పోతున్నాయి.

కొంత చీకటి వుండగానే ఇంటికి పోదామని ప్రతిపాదించింది ఆమె.

"నేనిందుకే ఆ జామున ఇంటికొచ్చేది" చెప్పాడు.

"అందుక్కాదులే..." స్పష్టంగా ఖండించి అదోలా చూసింది.

దుప్పట్లను బాగా వేడిజేసుకొన్న తర్వాత ఒక దుప్పటిని ఆమె తలమీద కప్పి జారిపోకుండా చెవుల మీదుగా కండువా చుట్టి బిగించాడు అంచులు భుజాలపైకి వచ్చేలా సవరించాడు.

చివరగా పెద్దమంట రగిల్చి బొడ్డుకాపు వేసుకొని ఇంటికి కదిలారు.

గెనిమల మీది గడ్డి సాంతం తడిసి మంచు బిందువుల్ని మోస్తూ వుంది.

కుచ్చెళ్లు ఎగబట్టుకొని నడవకుంటే బట్టలు తడుస్తున్నాయి. మోకాళ్లదాకా నీళ్లలో నడిచినట్లుగా వుంది. పంట పొలాల మధ్యన గెట్టుమీద నడుస్తున్నపుడు పంచెను తొడల దాకా ఎత్తి పట్టుకొంటున్నాడు శివుడు. తనూ కుచ్చెళ్లను అలాగే ఎత్తిపట్టి బట్టలు తడవకుండా ఆ చీకట్లలో నిర్భీతిగా నడు

స్తోంటే... మంచుతో తడిసిన వరి వెన్నులు తొడల దాకా రాచుకొని మంచు చిత్రాల గిలిగింతలు రచిస్తూ వింత అనుభూతిని రగిలిస్తోంది.

ఇంట్లోకి అడుగుపెట్టి వాకిళ్లు వేసుకోగానే - రోజూ చలి వణుకుళ్లను అనుభవానికి తెచ్చే యిల్లు- యీ రోజు విచిత్రంగా వేడి కుంపటిలా ఉంది.

"రేపు రావుగదా వరిమడి దగ్గరికి?" అడిగాడు నవ్వుతూ...

అతని గుండెల్లో వొదుక్కొని పోతూ కొంత మౌనం తర్వాత చెప్పింది. "మంచం తీసకపోయి మడికాడ వాల్చు. పత్తి మెల్లెలతో అయినా చిన్న గుడిసె కప్పు" అని.

ఆమెకేసి అబ్బురంగా చూశాడు శివుడు.

* * *

మూలకార్తె వెళ్లిపోయిన వారానికి పుష్యమాసం వచ్చింది. మసూర వరికోతలు ప్రారంభమయ్యాయి. మొలగొలుకుల వరి మరో నెలకు గాని సిద్ధం కాదు.

ఓ వైపు మిరపకాయల కళ్ళాలూ, మరో వైపు వరికోతలూ కలగలిసి రైతులంతా కసాలుగా వున్నారు.

ఆ సమయంలో వచ్చింది సరోజమ్మ.

కూతురి మొహం పెరుక్కుపోయి, వొళ్లంతా సన్నబడి, శరీరం రంగుమాసి, చలికి పెదాలు పగిలి... తన కూతురేనా అనిపించింది. కుట్టు మిషన్ని ఓ మూలగా సర్దిస్తూ ఆదుర్దాగా ఆమెకేసి కదలబోయింది. తిను బండారాల పొట్లాల్ని గూళ్లలో పెడుతూ కూతుర్ని ఆందోళనగా స్పృశించబోయింది. కన్నీళ్లతో పరామర్శించబోయింది. 'కూతురా!' అంటూ పట్టుకొని ఏడవబోయింది. తనను తప్పించుకు తిరుగుతూ వున్న అల్లుణ్ణి నిలదీయబోయింది. వదినమ్మను సంజాయిషీ అడగబోయింది.

దేనికీ అవకాశం ఇవ్వలేదు గౌరి.

తల్లి నెత్తిన సంకటి తట్ట వుంచి "రా

పోదాం" అంది.
బిత్తరపోయింది సరోజమ్మ.
తట్టను విసరికొడదామనిపించింది.
కోపాన్ని పెదాలు దాటనీకుండా పట్టి వుంచి కూతురి వెంట నడిచింది.
దారిలో పురాణం విప్పింది.
ఆక్రోశాన్ని వెళ్లగక్కింది.
ఒక్క ప్రశ్నకూ సమాధానం యివ్వలేదు గౌరి.
అటు ఇటు చేలవాళ్లు వాళ్లకేసి తలలెత్తి వింతగా చూస్తున్నారు. తల్లి రెట్టించి అడిగే ప్రశ్నలూ, కూతురి మౌన సమాధానాలూ వాళ్లకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి.
కూలీలకు సంకటి పెట్టి వాళ్లు తిన్న తర్వాత ఇద్దరూ వెనుదిరిగారు.
కళ్ళం నిండా పేర్చిన పంట చెత్తనూ, వడ్లు రాలగొడుతూ వున్న కూలీల్నీ, పొలి గాలి పాటలు ఎగుస్తూ ఎంతో హుషారుగా వున్న కళ్లాన్నీ మనస్సు పెట్టి చూడలేకపోయింది సరోజమ్మ.
ఆమెకు ఇప్పుడు కూతురి మీద అంతులేని కోపంగా వుంది.
కూతురి చేష్టలపట్ల నిప్పు మీది ఉప్పు కళ్లలా ఎగిరిపడుతోంది.
తిరుగు ప్రయాణంలో మెడేలు తొక్కుతూ ప్రశ్నించింది. పళ్లు కొరుకుతూ ముందుకు తిరుక్కొని మాట్లాడబోయింది. కూతురి జడ పట్టుకొని లాగి కొట్టాలనిపించింది. చెంపలు వాయించాలనిపించింది.
బుట్టను ఇంట్లో పెట్టి బైటకు కదిలింది గౌరి.
వెనక కేకలేస్తూ ఉన్న తల్లిని లెక్కజేయకుండా నేరుగా కళ్లంలోకి నడిచింది.
అక్కడ మిరపకాయల పరుపు వద్ద కూలీలు వున్నారు. తెల్లకాయల్ని యేరుతూ గ్రేడింగ్ చేస్తున్నారు. వాళ్ల వద్ద కూచుని తనూ పనిలో మునిగింది.
సరోజమ్మ కక్కలేక మింగలేకా వుంది.
వేపచెట్టు కింది అరుగు మీద కూచుని చాలాసేపు కళ్లంకేసే చూస్తూండిపోయింది. కళ్లార్పకుండా అలాగే చూస్తూ... కనుగుడ్ల మీద ఏవో దృశ్యాలు కదలాడి కదలాడి... గుడ్లు కరిగి కన్నీరుగా జారి... శోకావేశంతో చరచర కళ్లంలోకి నడిచింది.
"నిన్ను నేల మీద కాలుబెట్టకుండా సాకిన గదే! చేతులకు మట్టి అంటకుండా సూసుకున్నే గదే! ఎప్పుడన్నా నీనెత్తి మీద కేజీ బరువు బెట్టి మోయించిన్నా? పదిబార్ల దూరం నడిపించిన్నా? సినిమాకు పోవాలన్నే ఆటోలో తీసుకపోతాంటి గదే! నీకిదేం పొయ్యేకాలమే యమ్మా!" అంటూ కూతుర్ని జుట్టు పట్టుకొని వూపింది. ఆమె ముందున్న ఎండు మిరపల్ని కాళ్లతో చిమ్మింది. "నిన్ను కన్నెప్పుడు కడుపు కోయించుకొన్నే. మల్లా యిప్పుడు నా కడుపు కోస్తాండవు గదే!" అంటూ ఏడుస్తూ ఆమె వీపుమీద దబా దబా రెండు దెబ్బలు వేసింది.
కూలీలంతా బిత్తరపోయారు.
ఒక్కసారిగా లేచి ఆమెను అడ్డుకున్నారు.
వాళ్లల్లో గోవిందమ్మ, మునెమ్మ కూడా వున్నారు.
"మీకేం తెలుసమ్మా నా కడుపు శోకం?" అంటూ తన్ను పట్టుకొన్న వాళ్లను విదిలించింది సరోజమ్మ
"దీన్నిట్లా చూడాలని గాదమ్మా ఈ పెండ్లి జేసింది. నాలుగు రోజులు కుదురుగా ఈ పల్లెలో కూకోనుంటే మల్ల కడపకు తీసప్పోయి అంగట్లో కూచోబెట్టి మారాజాల సాక్కొందామనుకొన్నే. సూడండి తల్లీ! సూడండమ్మా...! దీని సేతులు జూడండి... ఎర్రగా బొబ్బలెక్కివుండాయి. పెదాలు జూడండి, పగిలి నల్లగా కమిలిపోయి... మొగం జూడండి - తెల్లగా పాలిపోయి...

వొల్లంతా సూడండే నాయమ్మలారా! నా బంగారు కూతురు ఎట్టయిందో సూడండి... తమలపాకంటి బిడ్డ రేగ్గంప మండ య్యింది..." అంటూ గోడు గోడున ఏడ్చింది.

గౌరి తలెత్తకుండా మిరపకాయల్లో గెలుకు తూనే వుంది.

ఇట్లాంటి సన్నివేశాన్ని కూలీలెప్పుడూ ఎరు గరు. ఆమెను ఎట్లా ఓదార్చాలో కూడా వాళ్లకు తెలిసిరాలేదు.

కూతురు పొలం పనులకు వెళుతోందనీ, కష్టపడుతోందనీ ఆ తల్లి పడే వేదన వాళ్లె ప్పుడూ చూసివుండలేదు. అసలది వాళ్లకు జీర్ణమే కాలేదు.

కష్టం జేసికొనే వాడికిచ్చి పెళ్లి జేసినపుడు కష్టపడక తప్పదు గదా అనేది వాళ్ల ప్రాథ మిక అవగాహన.

సరోజమ్మ గొడవను చాలాసేపు విన్న తర్వాత ఇక ఉండబట్టలేకపోయింది గోవిం దమ్మ.

"నెత్తిన మూడిత్తులు పడగానే అత్తగారింటికి వొచ్చి సరిపోయింది. నీ యింటనే వుండింటే వాల్లి దర్నీ ఒక మంచం మీద పండుకోనిచ్చుండే దానివి గాదే..." అంది.

తలెత్తి ముసలిదానికేసి చూసింది సరో జమ్మ.

"ఎంత బాగా సోకుజేసి మొగుని కాడికి పంపినా తెల్లబారే తలికంతా ఎంటికెలు సిక్కు బడతాయి. బొట్టు సెధిగిపోతది. సీరె నలిగిపోతది. జడలో పూలు కమిలిపో తాయి. కాటికె అద్దిన వడగండ్ల లాంటి కండ్లు గూడా కాటికె చెరిగి ఎర్రబారతాయి. మరీ తులవ నా బట్ట మొగుడయితే... బుగ్గలు గిల్లడం, పెదేలు కొరకడం, రయికె చిరగడం... వొల్లంతా పచ్చిపుండును జేసి వొదుల్తాడు... నీ యవ్వారం జూస్తాంటే రెండో రేత్రికే కూతుర్ని మొగుడికాడికి పంపే ట్టు లేవే ..."

చతుర 30 వసంతాలు

నవ్వు తన్నుకొచ్చింది గాని సద్దుజేయకుండా నవ్వే ప్రయత్నంలో కిసుక్కుమన్నారు కూలీలు.

మూతి మూడు వంకలు తిప్పింది సరోజమ్మ. "ముసిల్దానివయినా పులుసేమీ తగ్గలేదే!" అంది.

వెంటనే గొంతెత్తింది మునెమ్మ.

"నడుం సన్నది. నాజుకైంది. పెదాలు ఎర్రది. పిరెమైన సిన్నది. నీ కూతురు సోకుల వయ్యారి. సొగసుల సింగారి. సోకులన్నీ ఎల్లకాలం అట్లే వుండవు అత్తమ్మా! ఇప్పటికే నెలదప్పిందో ఏమో ఈ సిన్నది. తొమ్మిదినెలల్లైతే నున్న నడుముండదు. ఎర్ర పెదాలుండవు. నాజూకు నడకలుండవు. అప్పుడెట్లా జేస్తవే అత్తమ్మా? నా నడుం సన్నని బిడ్డనూ నాజూకు పెదాల కూతుర్నీ నాకియ్యమంటే మావోడు యాడ దెస్తాడే తల్లీ!" పాటలాగా పాడింది.

తలొంచుకొని ఇంకా కెలుకుతూనే వుంది గౌరి.

అప్పుడు మరోసారి గొంతెత్తింది గోవిందమ్మ. ఆడపిల్ల ఏ పరిస్థితుల్నయినా ఆకళింపు జేసికొని అందులో యిమిడి పోతుందనీ, ఆమె నాజూకుతనాన్ని అతిగా వూహించుకొని ఓ తండ్రి ఎలా యిబ్బంది పడ్డాడో తెలిపే ప్రసిద్ధమైన బూతుకథనొకదాన్ని చెప్పింది.

ఏమనుకొందో ఏమో- గోవిందమ్మ కేసి గుర్రుగా చూస్తూ మెల్లిగా అక్కణ్ణించి కదలి ఇంట్లోకెళ్లింది సరోజమ్మ.

మంచమ్మీద కూచుని ఆలోచిస్తూ వుండిపోయింది.

ఏ ప్రమాదమైతే ఎదురవకూడదని తను భావించిందో అదే ప్రమాదంలో పడింది గౌరి. వ్యవసాయం అంటకుండా చూడాలని ప్రయత్నిస్తే తుమ్మ జిగురులా అదే అంటింది. వ్యవసాయం ఒక మహా వ్యసనం. భూమిలో గింజలు విత్తటం, అవి మొలకెత్తితే తామే ప్రాణం పోసినట్లుగా



భావించటం, అవి పెరిగి పైరవుతోంటే మర్లు పెంచుకోవటం, బర్రెల్ని సాకటం, కోళ్లను పెంచటం, ఎన్ని తెగుళ్లొచ్చినా, ఎన్ని కరువులొచ్చినా మరో సీజన్ కోసం, మరో విజన్ కోసం, మరో అదను కోసం, మరో పదనుకోసం ఎంతో ఆశగా ఎదురు చూడటం...

తను ఏమారింది. కూతురిలోని మార్పుల్ని పసిగట్టలేకపోయింది. తను రావటం కొంత ఆలస్యమైంది. నెలకు రెండుసార్లయినా వస్తూ పోతూ వుంటే ఆ పిల్ల పోకడ తెలిసి వుండేది. తను జాగ్రత్త పడేది.

కూతురి ప్రవర్తనే తన మనస్సుకు కష్టంగా తోస్తూవుంది. అల్లుణ్ణి అడిగేందుక్కూడా లేకుండా చేసింది. వాళ్ల బలప్రయోగం కూడా తనకు కనిపించలేదు. ఎంత లోతు మనిషి కాకుంటే తనచేత కూడా సంకటి బుట్ట మోయిస్తుంది!

ఎంత సర్ది చెప్పుకొందామనుకొన్నా మనస్సు ససేమిరా అంటోంది సరోజమ్మకు.



సాయంత్రం ఇళ్లకు వెళుతూ అటుగా వచ్చారు కూలీలు. వాకిలి తీసి లోపలికి తొంగిచూశారు.

మంచమ్మీద పడుకొనే తలెత్తింది ఆమె.

"పంట కల్లంలో కొచ్చిన మంచికాలాన వొచ్చినవు. మంచి అమ్మవయితే నువ్వూ నీ కూతురితోబాటు కల్లంలో పన్జేసేదానివి" గోవిందమ్మ అంది.

"నాకేం ఖర్మబట్టలే..." చెప్పింది సరోజమ్మ తుమతుమ లాడుతోన్న మొహంతో. "దాన్ని ఆడించే వోల్లు ఆడిస్తుండారు. దాని ఉసురు కొట్టుకొంటరు... నేను ముందే సెప్పినా- పనీబాటా సెయ్యొద్దనీ, సేపించొద్దనీ... యాపారం బెట్టిస్తానని. నామాట యింటే గదమ్మా! నా బిడ్డను నలిపిపారేసెగదమ్మా! బాగా సూసుకొంటాడనుకొంటే బతుకు బండలు సేసె గదమ్మా!" మళ్లీ ఏడుపు మొదలెట్టింది.

బాగా చూసుకోవడం లేదనే ఒక్క విషయం దగ్గర అందరూ ముక్కు మీద వేలేసుకున్నారు.

"నువ్వు గూడా వాన్నే అంటాండవా!"

గోవిందమ్మ దీర్ఘం తీసింది. "నీ కూతుర్ని నెత్తినబెట్టి మొయ్యంది ఒక్కటే తక్కువ... యీ పిల్లను వాడు సూసుకున్నెట్టు మమ్మల్నా సూసుకోమని కొత్త కోడండ్లంతా మొగుండ్ల మీద అలుగుతండారు. మొగుండ్లంతా యీన్ని తిడతండారు. నువ్వూ యీ నా బట్టనే తిడ్తాంటివి... కోడలా... నీకో సంగతి చెబుతా యింటావా! ఏ ఆడదీ అనగూడదుగానీ... నేను మొగుడు లేని ముసలి ముండను అంటాండ. నాకు మల్లా వయసొచ్చేట్టు గనక దేవుడు దయజూస్తే ఒక్కరోజన్నా ఈ నా బట్టకు పెండ్లామయి దామని వుందే..." అంటూ సరోజమ్మకేసి ఓ

చూపు విసరి, చివుక్కున తలదిప్పి అక్కణ్ణించి కదలిపోయింది గోవిందమ్మ.

"ఓసి నియ్యమ్మ ముసిల్దానా!" బుగ్గలు నొక్కుకొంది మునెమ్మ. అందరూ నవ్వుకొంటూ వెనుదిరిగారు.

తర్వాత మెల్లిగా ఇంట్లోకి అడుగుపెట్టింది గౌరి. తోక తొక్కిన తాచులా బుస్సుమంటూ లేచింది సరోజమ్మ. కడుపులో ఎక్కసనంతా వెళ్ళగక్కింది. తల వాచేట్టు చీవాట్లు పెట్టింది కూతుర్ని. తమలపాకులా తలొంచుకు నిల్చుంది గౌరి. ఓపిక వున్నంతసేపూ తిట్టనిచ్చింది. తర్వాత తలెత్తి అంది "అయితే ఇప్పుడేం చెయ్యమంటావు మా? పోదాం పా... బావకూడా వస్తాడు. కడపకు పోదాం పా" అంది.

"పోలేమనే గదా నువ్వట్లా మాట్లాడేది!" గయ్‌మంది సరోజమ్మ.

"ఇక్కడుంటే తప్పదు మా!" చెప్పింది. "ఇంటికాడ కూచొని ఏం జెయ్యాల? ఊరంతా వెదికినా మాట్లాడే తోడు దొరకరు. ఎంతసేపని పండుకోవాల? పిచ్చిపట్టుద్దేనుకో... ఊరికే కూచుంటే పొద్దుబోదు. నాకు తోడు బావను పిల్చుకోవాల. తోడుండమంటే వుంటాడు. అయితే పొలంలో పైరు నాశినమైతది. ఏడాది కష్టమంతా ఏట్లో గలుస్తది. ఊరంతా నన్ను తిట్టుకొంటారు. నామీద వూస్తరు. వాకిట్లో కాలుబెట్టి సంసారాన్ని కూల్చినానంటారు. ఇంత పనికి మాలిన దాన్ని నన్ను కన్నేందుకు నిన్నూ తిడ్తారు. నన్నిట్లా పెంచినందుకు నీమీద దుమ్మెత్తిపోస్తరు. అందుకే మా... మాయమ్మ మంచి తల్లి అనిపించుకోడానికే నేను పొలంలేకి పోతుండా. నేను మంచి కూతుర్నినిపించుకోడానికీ, మంచి కోడల్నని పించుకోడానికీ... కొత్త కోడలిగా నా పాదం మంచిదనిపించుకోడానికీ నేను పొలంలేకి పోతాండ ... నా కోసమూ... నీకోసమే... బావకోసం గాదు. అత్తకోసం గాదు. నాకోసమూ, నీ కోసమే..." చెబుతూ దొడ్లోకి నడిచింది.

* * *

సరోజమ్మ వెళ్లింది గానీ, ఆమె సృష్టించిన ప్రకంపనలు మాత్రం ఊర్లో ఇంకా అణగిపోలేదు. ఆమె పడిన ఆరాటాన్ని మునెమ్మ చెబుతూవుంటే జనమంతా ఒకటే నవ్వులు. కర్రెడ్డులోల్ల వియ్యంకురాలి కథ వినమంటూ గోవిందమ్మ బుగ్గలు నొక్కుకొని, కళ్లు పెద్దవి చేసి, చేతులు తిప్పి సందుసందూ గొంది గొందీ కొదవబోకుండా చెప్పింది. కొత్త కోడళ్లు తమ తల్లుల పట్ల జాగ్రత్త పడేలా చేసింది.

సరోజమ్మ చేసిన గొడవంతా శివునికి తెలిసింది.

వెంటనే అతను చేసిన పని తల్లిని పక్కకు తీసుకెళ్లి ఎక్కడా నోరుజారవద్దనీ, గొణగవద్దనీ సూచించటం. అక్కను కూడా బతిమాలటం.

అతని గుండెల్లో మళ్లీ అలబడి మొదలైంది. మనస్సంతా తీవ్రమైన ఆందోళనకు గురయింది. తెలీని భయమేదో ఎదలో జొరపడి అదిరిపాటును కలిగిస్తోంది. వీధుల్లో మాట్లాడుతోన్నా, కళ్లంలో పనిచేస్తోన్నా, వరసైన వాళ్లు చెతుర్లాడుతోన్నా, భోంచేస్తూ వున్నా లోలోపల అలజడి మాత్రం ఓ వైపు మోగుతూనే వుంది.

గతంలో ఒకసారి ఇలాంటి భావనకే గురయ్యాడు తను. అప్పుడది కేవలం తన అనుమానపు ఊహలవల్ల వచ్చిన భయం. ఇప్పుడు మాత్రం పూర్తిగా నిర్ధారణ అయ్యింది. కూతుర్ని తన్నుకుపోవటానికే సిద్ధమైంది ఆమె. తనను కూడా ముక్కున కరచుకుపోవాలనుకుంది.

ఏం చేయాలో అర్థం కావటంలేదు.

ఎలా అడ్డుకోవాలో తెలీటంలేదు.

కాలుగాలిన పిల్లిలా అటు ఇటు తిరుగు

# 'వెల్ఫేర్' గ్రూప్ అధినేత

# మళ్ల విజయప్రసాద్‌తో కాసేపు...






BUILDINGS ESTATES FARMS RESORTS
CHARITABLE TRUST



1999 సం॥లో **వెల్ఫేర్ గ్రూప్** సంస్థను ఏర్పాటు చేసి, ప్రస్తుతం దేశవ్యాప్తంగా 16 రాష్ట్రాలలో 185 శాఖల్లో వ్యాపార లావాదేవీలు విస్తరించి, రియల్ ఎస్టేట్, బిల్డింగ్స్, రిసార్ట్స్ రంగాలలో 1500 మంది నిర్వాహక సిబ్బందితో సుమారు 2 లక్షల మార్కెటింగ్ స్టాఫ్‌తో దాదాపు 4 లక్షలమంది సభ్యులతో **'వెల్ఫేర్'** విరాజిల్లుతోందన్నారు. సుమారు 200 కోట్ల టర్నోవర్‌తో వ్యాపారం నిర్వహిస్తూ... 157 కోట్ల విలువైన ఆస్థులతో విజయపథంలో నడుస్తోందన్నారు. సంస్థ ప్రధాన లక్ష్యం ఏమిటని అడగగా... 'సభ్యుల సంక్షేమమే మా **వెల్ఫేర్** లక్ష్యంగా సాగుతుంది.

ప్రస్తుతం ప్రతి సామాన్యుడికి ఒక సొంత ఇల్లు ఉండాలనే లక్ష్యంతో సంస్థను ప్రారంభించినప్పటి నుండి సభ్యులుగా చేర్పించి నెలకు కొంత మొత్తాన్ని చెల్లించటంవలన కాలక్రమేణా వారి ఆదాయం పెరిగి ప్లాటు ఓనరు అయ్యే అవకాశం కల్పిస్తున్నాము. మా వెంచర్లు దేశవ్యాప్తంగా 100, 25 వెంచర్లు పూర్తి అయ్యాయి.




**మీ విజయరహస్యం ఏమిటి:**

నిష్ణాతులైన అంతరంగిక సిబ్బంది, సుశిక్షితులైన మార్కెటింగు సిబ్బంది సమైక్య కృషి, పటిష్ట ప్రణాళికతో ఎప్పటికప్పుడు కొత్త ఆలోచనలతో విజయపథంలో నడిపిస్తున్నాయి. వ్యాపారరంగంలో ఉంటూ క్రీడలు, సాంస్కృతిక, ఇతర సేవా కార్యక్రమాలకు స్ఫూర్తిని నింపడమే కాకుండా వాటి ద్వారా దేశ భవిష్యత్తుకు మన భారతదేశ కీర్తిని దశదిశలా వ్యాపింపజేయాలి. మనకు ఉన్నదాంట్లో అవసరమైన వాళ్ళకు సహకరించడం మన ధర్మం అనిపించుకుంటుంది. మా ట్రస్టు ద్వారా




ఉచిత వైద్య శిబిరాలు, ఐ-క్యాంపులు, ఉచిత కళ్ళజోళ్లు, వృద్ధాప్య పింఛన్ల పంపిణీ, ప్రతినెల 3వ తేదీన పాపాహోం విద్యార్థులకు మధ్యాహ్నం, రాత్రి భోజనాలను ఏర్పాటుచేయడం, ప్రకృతి వైపరీత్యాల సమయంలో బియ్యం, దుప్పట్లు, దుస్తులు పంపిణీ చేయడం మా బాధ్యత. విశాఖ ప్రజల మనస్సుకు ఆనందాన్ని, ఆహ్లాదాన్ని పంచాలనే ఉద్దేశంతో, కల్చరల్ నైట్స్, గొప్పగొప్పవారిని తీసుకువచ్చి మన స్థానికులకు పరిచయం చేయడం, క్రికెట్ పోటీలు నిర్వహించి, వారిలో ఉన్న టాలెంట్ ద్వారా గుర్తింపు తీసుకురావడం చేస్తున్నాము.

అంతర్జాతీయ స్థాయి కరాటే పోటీలు నిర్వహించిన ఘనత **'వెల్ఫేర్ గ్రూప్**కి దక్కింది

తున్నాడు. ఒకచోట నిల్చోబుద్ధి కావటం లేదు. కూచోబుద్ధి కావటంలేదు. చివరకు రాత్రి పడుకోబుద్ధి కూడా పుట్టటంలేదు.

కళ్లం వద్ద వరిగడ్డి కుప్ప మీద పడుకొని మరోసారి గౌరికి శరణాగతుడయ్యాడు. ఆమె వొడిలో తలదాచుకొని భోరున విలపించాడు.

చాలా సేపు సముదాయిస్తూ వుండిపోయింది ఆమె.

చివరకు తనూ అతణ్ణి కౌగిలించుకొని ఏడవటం మొదలెట్టింది.

గింజలు రాలగొట్టి పచ్చిగడ్డి కుప్పేసి వుండటం వలన గడ్డి లోపల్నించి వేడిసెగలు తన్నుకొస్తున్నాయి.

కప్పుకొన్న దుప్పటి మాత్రం మంచులో తడుస్తూ వుంది.

ఓవైపు శీతలమూ, మరోవైపు ఉష్ణమూ కమ్ముకొని శరీరాల్ని కరిగిస్తూవున్న విచిత్రమైన స్థితిలో వాళ్లు ఒకరి గుండెల్లోని ఆవేదనను మరొకరి గుండెల్లోకి కలబోసుకొంటూ, పెదాలు వెలిబుచ్చలేని భావాలెన్నింటినో శరీర స్పర్శతోనే తెలుసుకొంటూ, మాటల్ని మరుస్తూ, సమస్యల్ని మరుగుజేస్తూ, ఆవేదనల్ని ఆవలికి నెడుతూ, రెండు శరీరాలే కాదు రెండు హృదయాలే కాదు రెండు మనస్సులూ ఒకటైన అచలస్థితిలోకి వెళుతూ...

* * *

కళ్లంలో ఎండుమిరపల రాశివద్ద నిల్చుని వేపపుల్లతో పళ్లు తోముతున్నాడు శివుడు.

మంచుకు తడిసిన ఎర్రటి మిరపకాయలు లేత సూర్యకిరణాలుసోకి వింతగా ప్రకాశిస్తున్నాయి.

మెల్లిగా ఇంటికేసి కదిలాడు.

వేపచెట్టు కిందకు వచ్చేసరికి ఇంటిముందు కల్లాపి చల్లిన తావులో ఒద్దికగా కూచుని ముగ్గేస్తూ వుంది గౌరి.

చెట్టు కింది అరుగు మీద గొంతుక్కూచుని పళ్లు తోముకొంటూ ఆమెకేసే చూడసాగాడు అతను.

చూపులతో శరీరాన్ని సొంతం తడుపుతున్నాడు.

కదలికల్ని కళ్లల్లో ముద్రించుకొంటున్నాడు.

మొహంలోని భావాల్ని సైతం చదువుతున్నాడు.

ఆమె ఇక్కడ అడుగుపెట్టి ఆరునెలలు కావొస్తోందంటే నమ్మలేకపోతున్నాడు. వర్షాన్ని తోడు తీసుకొని ఆమె తన వెనక మెడేలు తొక్కుకొంటూ ఒంటరిగా పల్లెకు రావటం ఇప్పటికీ కళ్లకు కట్టినట్లుగా వుంది. కారే కొట్టంలో రాత్రంతా తడవటం, మూడు చేటల కథ చెప్పుకోవటం- నవ్వొస్తూ వుంది.

ఆనాటి ఆమె రూపం కళ్లముందు కదలాడుతూ, ఎదురుగా కన్పించే ఇప్పటి రూపంతో కలిసిపోయేందుకు ప్రయత్నిస్తూ... చాలా సేపు అదే పెనుగులాట... ఎక్కడో అన్వయం కుదరని అవస్థ... అవును... అప్పటి ఆమె సౌష్టవ రూపానికీ ఇప్పటి రూపానికీ కొంత తేడా కన్పిస్తోంది. ఆమె తల్లి వాపోయినట్లు గౌరి శరీరంలో నాజూకు తగ్గింది. నునుపుదనం మారింది. కండరాల మిసమిసలు మాసిపోయాయి. వ్యవసాయానికి సంబంధించిన మబ్బుల మరకలేవో శరీరాన్ని కమ్మేశాయి.

నిరంతరం కళ్ల ఎదుటే వుండటం వలన తను గమనించలేకపోయాడు.

నిజమే... సరోజమ్మ ఆరోపణలు వాస్తవమే. గౌరి చిక్కిపోయింది. పనిభారం ఆమె అందమైన చర్మాన్ని మాసిపోయేలా చేసింది.

ఆలోచనల్లో పడ్డాడు శివుడు.

తనామెకు పచ్చదనాన్నీ, పల్లెదనాన్నీ పరిచయం చేసేందుకు ఎన్నో అవస్థలు పడ్డాడు.




# రవీంద్ర ఫౌండేషన్

హైదరాబాద్. రి.నెం. 908/2004



పేదరికానికి పుట్టినిల్లు అయిన పాలమూరు జిల్లాలో గుండె జబ్బులతో బాధపడుతున్న చిన్నారులకు సహాయం అందించేందుకు పెద్ద మనసుతో ముందుకు రండి. ఆరిపోతున్న ఈ చిన్నారి జీవితాలను వెలిగించండి. మనము జీవించడమే కాదు. మరొకరి జీవితానికి ప్రాణం పోద్దాం...! ఒక్కసారి ఈ చిన్నారులను పరిశీలించండి! ఆరిపోతున్న ఈ చిరుదీపాలను వెలిగించండి.

బూర్గుల శ్రీనాథశర్మ
డైరెక్టరు

**నందిని** (4 సం॥)
S/o నర్సింహులు
గంగన్నగూడ
కొందుర్గు (మం॥)
సమస్య: గుండెకు రంధ్రం పడింది

**అనిల్‌కుమార్** (5 సం॥)
S/o యు.సుదర్శన్
మహబూబ్‌నగర్
సమస్య: గుండెకు రంధ్రం, జ్వరం, దగ్గు, శ్వాసలో ఇబ్బంది

**సాయిహర్షిత** (11 సం॥)
D/o మధుబాబు
వీరన్నపేట
మహబూబ్‌నగర్
సమస్య: గుండెకు రంధ్రం

**నర్సిములు** (3 సం॥)
S/o హుసేనప్ప
అమరవాయి గ్రా॥
మల్దకల్ (మం॥)
మ.నగర్ జిల్లా
సమస్య: గుండెకు రంధ్రం

**శారద** (3 సం॥)
D/o వెంకటేష్
అమరవాయి
మల్దకల్ (మం॥)
సమస్య: గుండెకు రంధ్రం

**భరత్** (4 సం॥)
S/o శ్రీనివాస్
గంగన్నగూడ గ్రా॥
కొందుర్గు (మం॥)
జి॥ మ.నగర్
సమస్య: గుండెకు రంధ్రం

**సాయిప్రసన్న** (9 సం॥)
D/o వెంకటస్వామి
సాతాపూర్ గ్రా॥
పెద్దకొత్తపల్లి
సమస్య: గుండెకు రంధ్రం

**మల్లేష్** (5 సం॥)
S/o వెంకటరాములు
సాతాపూర్ గ్రా॥
పెద్దకొత్తపల్లి మం॥
సమస్య: గుండెకు రంధ్రం

**చింటూ** (4 సం॥)
S/o ఎల్లారెడ్డి
సదగోడు గ్రా॥
ఉప్పునుంతల మం॥
సమస్య: గుండెకు రంధ్రం
రక్త కణాలు పనిచేయడం లేదు

**శివలీల** (13 సం॥)
D/o సాములు
చిన్నదర్‌పల్లి, హన్వాడ
సమస్య: గుండెకు రంధ్రం, దగ్గు, దమ్ము ఉంది

**గోవింద్** (16 సం॥)
S/o తుల్జా, రుక్కన్నపల్లి
ఖిల్లాఘనపూర్ (మం॥)
సమస్య: కాళ్ల వాపులు, రక్త ప్రసరణలో ఇబ్బంది, గుండెలో కవాటాలు మూసుకుపోయాయి

**షమీమసుల్తాన్** (22 సం॥)
D/o ఎండి.మహబూబ్‌ఖాన్
వీరన్నపేట
మహబూబ్‌నగర్
సమస్య: గుండెకు రంధ్రం, దగ్గు, జ్వరం

**వీరిని మీరు ఆదుకొని సహాయం చేయండి**

సంప్రదించండి: బూర్గుల శ్రీనాథశర్మ, డైరెక్టరు
రవీంద్ర ఫౌండేషన్, Flat No. 106, B1 బ్లాక్
R.K.టవర్స్, మయూరి మార్గ్, బేగంపేట, హైదరాబాద్-16 Cell: 9848667875, ఫోన్: 040-64529565

తన సర్వ వ్యాపకాల్నీ సమయాన్నీ ఆమె కోసమే వినియోగించాడు. ఆమెతో డిదే లోకంగా అలవాటు పడ్డాడు కూడా.

వ్యవసాయ పనుల్ని ఆమెకు పరిచయం చేసేందుకు తన తల్లి తనకంటే ఎక్కువగా ఆరాటపడింది. ఎన్నెన్నో వ్యూహాలు పన్నింది. ఎందరెందరి సహాయాన్నో తీసు కొంది. ఆమె ప్రయత్నాలన్నీ తనకు తెలు స్తూనే వున్నా మౌనంగా చూస్తూండిపో యాడు. బహుశా తను కూడా పరోక్షంగా తల్లికి సహాయపడినట్లే.

నాలుగేళ్ల కరువు తర్వాత వచ్చిన మంచి కాలం యిది. నేలంతా కుమలనాని కొర్రకూ టిలా తయారైన కాలం. లేత తమలపా కంటి కాలం- ఏ మట్టి పొరమీద అడుగు పె ట్టినా పచ్చని మొలకలై పాదాన్ని స్పర్శించే కాలం. ఏ గుంటల్లో ముంగాళ్లు దించినా చేపల ముక్కులై చుట్టుకొనే నీళ్లున్న కాలం... మందమతిని సైతం చివురింపజేసే పచ్చదనపు కాలం... పరిచయం అక్కరలేని కాలం... యీ కాలాన్ని... యీ కాలంలోని పల్లెను పరిచయం చేసేసరికి తాము ఇన్ని అగచాట్లు పడ్డారు. గౌరిని శారీరకంగా ఇబ్బందులకు గురిజేశారు.

వ్యవసాయానికి చెందిన మంచి కాలం గురించే ఆమెకు తాము పరిచయం చేశారు. కరువుల గురించి ఆమెకు తెలీదు. వాటి క్రూరత్వం ఆమెకు పరిచయం కాలేదు. మని షికి మనిషికి మధ్యనున్న అపురూప మానవ సంబంధాల్ని కూడా కరువు విరు చుక తింటుందనే విషయం తెలీదు. రైతులు పురుగు మందులు తాగి చచ్చే సంగతీ, చిన్న చిన్న ఆర్థిక విషయాలకే కాట్లాడుకొని కోర్టుల పాలయ్యే సంగతీ, ఒక్క తడి నీళ్ల కోసం అన్నదమ్ముల మధ్యనే యుద్ధాలు జరిగే సంగతీ... ఇవన్నీ తెలి యాలంటే గౌరికి కరువు పరిచయం కావాలి. మరో కరువు రావటమనేది చాలా సహజ విషయం. ఇప్పుడీ మంచి కాలాన్ని పరిచయం చేసినంత సులభంగా ఆమెకు కరువుల్ని పరిచయం చేయగలరా? వాటి స్వరూపాన్ని విశదీకరించగలరా? మంచి కాలమొస్తే వ్యవసాయం అందంగానే వుంటుంది. పచ్చని పైరూ, బంగారు పంటా, పాల సముద్రాలూ... అన్నీ బాగానే వుంటాయి. బాగున్న వీటిని పరిచయం చేసేందుకే తామెతో శ్రమించారు. రేపు అడుగడుగునా ఎండిపోతూ రైతు గుండెను మాడ్చే పైరునూ, కడుపునిండా మేపలేక ఎముకలు బైటేసుకొన్న బర్రెనూ, కొక్కెర తెగుళ్లతో నేలరాలే కోళ్లనూ, మైళ్ల దూరం నించి తెచ్చుకొనే బిందెడు నీళ్లనూ, అప్పు లోళ్ల దాడులనూ... వీటన్నింటినీ తాము గౌరికి హృద్యంగా పరిచయం చేయగలరా?

ఆలోచనల్లో పడ్డాడు శివుడు.

ముగ్గు పూర్తిచేసి మధ్యలో పేడముద్ద ఉంచి, దానిపైన గుమ్మడి పూవును అమర్చి వాకిట్లోకెళ్లి నిల్చుని రొండిన చేయిచేర్చి తన పనితనం కేసి తనే కొత్తగా చూడసాగింది గౌరి.

ఆమెకు ముగ్గులోని చుక్కలన్నీ ఏడేండ్ల లోపు పసిపిల్లలై తన పాట వింటూ, ఆటలో లీనమవుతూ ఒద్దికగా కూచుని వున్నట్లుగా అన్పించింది. కుట్టుమిషన్‌లో కుట్టిన అంద మైన చిత్రంలా వుంది రంగవల్లిక. డ్వాక్రా సంఘాల సభ్యుల చేతుల్లో రూపుదిద్దుకొన్న సొగసైన బొమ్మలా వుంది. తన వద్ద అక్ష రాలు నేర్చుకొనేందుకు వచ్చిన ఆడపడుచులా వుంది.

ముగ్గులోని గుమ్మడి పూవును చూడగానే సంక్రాంతి గుర్తుకొచ్చింది శివునికి.

ఆ వెనకే కొత్త అల్లుళ్ళు, అల్లెం తింటూ పండుగ జరుపుకొనే అత్తవారిల్లు గుర్తుకొ చ్చింది. ✦




డిసెంబర్ 2006
చతుర నవల
ముద్ర
పై సమీక్షలు



## సమాజానికి మచ్చ!

(మొదటి బహుమతి రూ 100/- పొందిన సమీక్ష)

పూర్వ కాలంలో భగవత్సన్నిధిలో నృత్యాంగనలుగా మారే యువతులు 'దేవదాసి' ఆచారానికి నాంది పలికితే కాలక్రమంలో అది మాతంగి, బసివిని వంటి వివిధ పేర్లతో ఓ దురాచారంగా రూపొందింది. ఆ ఆచారం మూల ఉద్దేశం మూలను బడి, అట్టి స్త్రీలను నేడు ఊరుమ్మడి భార్యలుగా మార్చింది. ఆ అనాచారం సభ్య సమాజానికే మాయని మచ్చ అని చెప్పవచ్చు

ఆ దుర్వ్యవస్థలో గ్రామ పెద్దల అహంకారానికి, అహంభావానికీ, స్వార్థానికీ బలయిపోయే అభాగినులెందరో! అవిద్య, పేదరికం తెచ్చిన మూఢనమ్మకాలను అట్టడుగు వర్గాల్లో పెంచి పోషిస్తున్న కులపోల్ల కుత్సితాలను, ఆ అభాగ్య స్త్రీల కడగండ్లనూ కళ్లకు కట్టిస్తుంది 'ముద్ర'. కేవలం తనకు లొంగలేదన్న కారణంగా కోటమ్మ జీవితాన్ని నాశనం చేసిన ముసలయ్య వంటి గ్రామ పెద్దలూ, వారి నెదిరింపజాలని, వెన్నెముక లేని గ్రామ ప్రజలూ ఉన్నంతకాలం ఆ దురాచారం కొనసాగుతుందనే చెప్పాలి. కోటమ్మ జీవితం తిరిగిన మలుపులు స్త్రీ ఒంటరిదైతే ఆమెను ఎందరు, ఎన్ని విధాలుగా ఎక్స్‌ప్లాయిట్ చేయగలరో తెలుపుతాయి. సంఘటనలు సహజంగా అనిపించినా, తెలివైన ఆ పిల్ల తన జీవితాన్ని గాలి వాటుకెర చేయకుండా మరింత సవ్యంగా, సమర్థతతో సవరించుకోగలిగి ఉండేదేమోననిపిస్తుంది. ముగింపు సినిమాటిక్‌గా అనిపిస్తుంది. కర్నాటక, ఆంధ్ర, మహారాష్ట్రల మారు మూలల్లో ఎక్కడో ఆ పద్ధతి చెదురుమదురుగా కనిపిస్తున్నట్టు అడపా దడపా ఆలకించడమే తప్ప- బడుగు వర్గాలలో సైతం ఎంతో అవేర్‌నెస్, అన్యాయాన్ని ఎదిరించే తెగింపూ సంతరించుకున్న ఈ కాలంలో ఈ దురాచారం ఇంకా కొనసాగుతోందంటే నమ్మబుద్ధి కాదు. ప్రభుత్వం దీన్ని పకడ్బందీగా అరికట్టి, ఆ అభాగినుల మనుగడకు తగు ఏర్పాటు చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. 'ముద్ర' ఇతివృత్తం పాతదే అయినా, కథనం ఆసక్తిగా చదివిస్తుంది.

– *సత్యనారాయణ, సికింద్రాబాద్*

## పడిలేచిన కెరటం

(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

స్వాతంత్ర్యం, సభ్యత, నాగరికత, సంస్కారం, సంస్కృతి అన్నీ సిగ్గుపడేలా చేసేది నీచ 'బసివి సంప్రదాయం'. సమస్య స్వరూప స్వభావాలను ఎత్తి చూపడంలో, పరిష్కారం సూచించడంలో రచయిత కృతకృత్యులయ్యారు. కన్నవాళ్ళని, స్వంత ఊరుని, పేరుని పొగొట్టుకొని జీవితం మీద, శరీరం మీద అధికారం కోల్పోయిన 'బసివి' కోటమ్మ పోరాట పటిమే ఈ నవలకు ప్రాణం, ఊపిరి. తన నాశనానికి ఎవరు కారణమో వారందరినీ (ఒక్క మణిని తప్ప) పరాభూతుల్ని చేస్తుంది. తను 'మాత' కావడానికి కారకుడైన పంతుల్ని కసితీరా తన్ని తగలేస్తుంది. తనని వ్యభిచార గృహానికి అమ్మే

సిన సలీం బాషాను, జాన్‌బీని పోలీసులకి పట్టించి ఎందరో స్త్రీలను విముక్తుల్ని చేస్తుంది. తనను కామించిన ముసలయ్యను కొట్టినందుకు, అతనిచేత కన్నెరికం చేయించు కోవాల్సి వచ్చినా, కాదన్న అతనికే బిడ్డని కని, కన్నెరికం చేయవచ్చిన శంకరయ్యకు చెల్లెలుగా ఆమెని నిరూపించి బిడ్డ అరుణకి పెండ్లి చేసిన ఘనత కోటమ్మది. పడిలేచిన కెరటంలా ఆ పాత్ర అనుక్షణం మనలను ఆకర్షిస్తుంది. మదపుటేనుగులాంటి శంకరాన్ని గడ్డిపోచల్లాంటి స్త్రీల సహాయంతో నిస్సహాయుణ్ణి చేసిన విధం నిజంగా హృద్యం. అగ్రకులస్థుడయిన ఉదయ్‌కుమార్ అరుణని పెండ్లి చేసుకోవడంతోను, పంతులు కొడుకు సూర్యప్రకాష్ పెండ్లికి సారథ్యం వహించడంతోను నాణానికి రెండోవైపు చూపినట్లయింది. అతి సాధారణ పాత్ర అనుకున్న కిష్టయ్య పాత్ర 'అయితమ్మ గుడిని', 'బసివి గుడిసె'ను నాశనం చేయడంతో విశ్వమంతా నిండి వెలిగినట్లయింది.

– **చాడ సుజాత,** మొయిద.

## అంతం కాదిది... *(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

జోగిని వ్యవస్థ, వ్యభిచారం, ఆడపిల్లలను దేముడికి నైవేద్యం పెట్టడం లాంటి మూఢాచారాలు రాతియుగం నుంచే ప్రారంభమయ్యాయని చరిత్ర చెపుతోంది. కుతంత్రాలకు మారుపేరుగా మగవాడి దుష్ట ఆలోచనకు రూపకల్పనే జోగిని వ్యవస్థ. మగవాడిలోని వికృతమైన కామ వాంఛల ఆలోచనల్లోంచి పుట్టుకొచ్చిన జోగిని విధానానికి, చెదపట్టిన సమాజంలోని మూఢ నమ్మకాలు కొంత బలాన్నిచ్చి చెట్టు వేళ్ళలా గ్రామీణుల జీవన విధానాలలోకి చొచ్చుకుపోయాయి.

ఇక కథలోకి వస్తే కోటమ్మ, ముసలయ్య, ఓబులవ్వ, మణి, కృష్ణయ్య తదితర పాత్రలు మనకు నిత్యం ఎదురవుతుంటాయి. మనం వారిని పట్టించుకోం. చూసి చూడనట్లు పోతాం. అలా సర్దుకుపోయే మనస్తత్వంలో పెరిగిన వాతావరణం మనది. ఇక కోటమ్మ తన కూతురు తనలాగ బసివి కాకుండా అనేక ప్రయత్నాలు చేసి విజయం సాధించింది. ఇందులో కోటమ్మ పాత్ర గురించి ఎంత రాసినా తక్కువే అవుతుంది. చివరలో శంకరయ్యకు చెప్పినట్లు లోగడే కోటమ్మ తల్లి ముసలయ్యను ఎందుకు పరాభవించలేదు? కాలంతో తెచ్చిన మార్పులు కూడా మనిషికి బలాన్నిస్తాయి. అలాగే చెల్లెలికి కన్నెరికం చేయడానికి వచ్చిన శంకరయ్యకు కోటమ్మ తన ఉగ్రరూపం ఇంకా చూపించాల్సింది. రావణాసురుని అంతానికి సీతమ్మ కావలసివచ్చింది. పెత్తందార్ల కండకావరానికి ఎక్కడో అక్కడ అంతం ఉంటుంది.

–**ప్రసాద్,** నవులూరు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/7